# ఋతుసంహారము

గ్రంథకర్త:

కొలకుల నారాయణరావు, బి.ఏ., బి.యల్.

యఫ్.ఆర్.ఈ.యస్. (లండను)



టీకాకర్త:

భట్టారం మల్లికార్జునం

# PREFACE



'RITUSAMHARA' (Cycle of Seasons) is, as is well known, a Sanskrit poem generally ascribed to the great Kalidasa. It was my good fortune a year and half ago to have come across this prince of poems. As I read the description of each season, I felt as if I was transported into the conditions of that particular season. My heart strings were touched. Inspired, as it were, I rendered into Telugu Verse, a few Slokas here and there. Friends who read my verses, expressed that they were faithful renderings of the original, and urged me to complete the work. I doubted if I could be equal to the task. But as the bidding of my friends was pressing, I continued the translation and finished it.

It is my first duty to express my gratitude to my Guru Pandit Durbha Subramanya Sarma Garu. I thank him for the continued impetus he gave me in my endeavour, and the help he rendered me in revising my work. I may however state that the improvements he suggested, could at best touch only the outer fringe or the formal aspect of my production, as I wanted that the composition should be an honest expression of my own self. His suggestions have nevertheless been of great educative value to me.

I must also acknowledge my debt of gratitude to Khan Bahadur Janab Yahya Ali Sahib Bahadur M.A., B.L., District and Session Judge, Cuddapah. My work was conceived and completed when the Khan Bahadur was Public Prosecutor and Government Pleader at

Nellore, and I was working as his Junior. Besides being an accomplished scholar and a sound lawyer, he possessed in an admirable degree, a genial temperament which drew me irresistibly to him. The liveliness which I felt as I proceeded with the reading of Ritusamhara found its daily echo in the pleasant atmosphere which my senior created for me in the office chamber. I therefore made up my mind at an early stage of my work, to dedicate it to him if I should ever be blessed to complete it. The response which he gave to my request regarding dedication, was characteristically warm and generous, and I celebrated the dedication function in my own humble way, an account of which appears in the accompanying pages.

I shall feel exceedingly happy, and consider myself richly recompensed, if my translation succeeds in evoking in the hearts of my readers some at least of the pleasure which it was my good luck to enjoy as I read the original.

NELLORE,
15-3-1937.

K. NARAYANA RAO.

# ఋతుసంహార
# కృతిసమర్పణ మహోత్సవము



కృతికర్త:— శ్రీయుత కొలకుల నారాయణరావుగారు,
బి.ఏ., బి.యల్.,

కృతిపతి:— ఖాన్ బహద్దరు జనాబ్ యాహ్యాలిసాహేబు
బహాదరువారు, యం.ఏ., బి.యల్.,

సభాధ్యక్షులు:—శ్రీమాన్ మాడభూషి నరసింహాచార్యుల
వారు, బి.ఏ., బి.యల్.,

గురుపూజ:—బ్రహ్మశ్రీ మర్ఠా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

కొనిరి. ఆవల లఘ్వాహారములు విరివిగ సమర్పించబడెను. సుమారు నూఱుమంది పౌరప్రముఖులు ఇందు పాల్గొనిరి. ఫలాహారములు ముగిసిన వెంటనే రాజాగారి కళాశాలా భవనమున సభామందిరమున సభ్యులు సమావేశమైరి. పండిత కాళిదాసు వేంకటసుబ్బాశాస్త్రులు, దీపాల పిచ్చయ్యశాస్త్రులు, కే. వి. రామానుజాచార్యులు, పులిగెండ్ల నరసింహశాస్త్రి, కొసుఖేల సీతాపతిరావు, కోట నరసింహము, వంగోలు వేంకటరంగయ్య, తూములూరు శివరామయ్య, చివుకుల మాలెకొండయ్య, రేబాల పట్టాభిరామరెడ్డి, రేబాల లక్ష్మీనరసారెడ్డి, యం. వి. సుబ్బారావు, కొసుఖేల రామచంద్రరావు, గొంట్లా శ్రీరాములుశెట్టి, పి. ఆదినారాయణమూర్తి, యం. యస్. నరసింహరావు, ఓరుగంటి వేంకటసుబ్బయ్య, పి. వి. కృష్ణయ్య, కె. రామనాథము, కే. పార్థసారథి అయ్యంగారు, యం. ఆదిశేషారెడ్డి. వావిలికొలను నరసింగరావు, మోచర్ల రామకృష్ణయ్య, మన్నేపల్లి రామకృష్ణరావు, చివుకుల కృష్ణస్వామయ్య, ఏ. సి. సుబ్బారెడ్డి, పాణకా పిచ్చిరెడ్డి, మొదలి లక్ష్మీనరసయ్య, వేపకొమ్మ ఆదిశేషయ్య, వాకాటి సంజీవిశెట్టి, ఇంగువ శ్రీకృష్ణయ్య, జంధ్యాల జానకిరామశర్మ, కేసరి సుందరరామయ్య, గుజ్జము సుబ్రహ్మణ్యము, సోమపూడి కనకయ్య, కటకం రాధాకృష్ణయ్య శెట్టి, పెనుబోలు సుబ్బయ్యశెట్టి, ఓలేటి వేంకటకృష్ణయ్యశెట్టి, పుల్లట్టి సీతాపతిరావు, పెడిపాటి చలపతిరావుగార్లును ఇంకను పెక్కురు భాషాభిమానులు సభ నలంకరించియుండిరి.

శ్రీమాన్ మాడభూషి నరసింహాచార్యులవారు ఈ విద్వన్మహాసభకు యం. వి. సుబ్బారావుగారి ఉపపాదనమీఁద అధ్యక్షులుగ ఎన్నుకొనఁబడఁగా, శ్రీ ఆచార్యులవారు అధ్యక్షపీఠము నలంకరించిరి. కృతిపతి శ్రీ యాహ్యాలీ సాహెబ్ గారును, కృతికర్త శ్రీ నారాయణరావు గారును, కృతికర్త గురువులు బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారును, సభావేదికయందాసనముల నలంకరించిరి. శ్రీయుత నేలనూతల రామకృష్ణయ్యగారు దైవప్రార్థన సలిపిరి. అంతట అధ్యక్షులవారు సభను ప్రారంభించుచు

తాము చెప్పఁదలఁచిన విషయముల కడపటఁ జేర్కొనెదమని చెప్పి, ఈ విద్వన్మహాసభను సమావేశపఱిచిన కృతికర్త నారాయణరావుగారిని తమ విజ్ఞప్తిని చదువఁగోరిరి. అంతట శ్రీ నారాయణరావుగారద్దాని స్ఫుటస్వరమున నిట్లు చదివిరి.

## కృతికర్తగారి విన్నపము

ఋతుసంహారమును నే నిటీవల తెలిఁగించితిని. దీనిని చక్కఁగా సవరించి ముద్రింపించి పీఠికాదులతో సనిపఱిచి 'కృతి సమర్పణ' మహోత్సవము గావింపవలయునని తలంచియుంటిని కాని ఖాన్‌బహద్దరు జనాబ్ యాహ్యాలిసాహేబువారు మన పురమును వీడి జిల్లాజడ్జీగా పరమండలమునకుఁ బోవలసివచ్చినందున, ఆ సందర్భమున నెల్లూరుపౌరులు జరుపు వీడుకోలు మహోత్సవములు పెక్కింటిలో కృతిసమర్పణము విశిష్టముగాఁ గానవచ్చునుగాన, దాని నిప్పుడే కావింపుమని నా మిత్రులు కొందఱు, ముఖ్యముగా శ్రీ యుతులు మన్నేపల్లి రామకృష్ణరావుపంతులుగారు నన్ను ప్రోత్సహించినందున అముద్రితదశనే నాకృతిని వారి కర్పింపవలసినవాఁడ నైతిని. ఇది యచిరకాలమున అచ్చొత్తించి "కృతి ప్రకటన మహోత్సవము" వేఱొకటి జరిపి పుస్తకములు పండిత సుహృత్తుల హస్తగతము సేయఁగలను. ఖాన్ బహద్దరుగారు నెల్లూరికి రా నంగీకరింతురేని నా సంకల్పము నెఱవేఱును.

నేను వీరియొద్ద సుమారు 2 సంవత్సరములు జూనియర్‌గా నుంటిని. ఆ యల్పకాలములో నాకు గోచరమైనవారి యుదారతయే ఈ సమర్పణమునకుఁ బ్రేరకము. వారికి ఆంగ్లపారసీక భాషలయందుఁగల యభిరుచి యెఱింగి, ఆంధ్రభాషాభిమానమును తెలిసికొని వారి రసికతకుఁ దనిసి, యీ కృతి వారి కంకితము చేయుచున్నాను. ఇది చంద్రునకు నూలిపోఁగు అని నేను ఎఱుఁగనివాఁడఁగాను.

నాకుఁ గవితాగురువులగు బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారిం గూర్చి రెండు మాటలు. వారి శిష్యవర్గములోఁ గవనము చెప్పువారు పెక్కురు గలరు. వీరికడ 1929 సం॥లో ఇంటరులోఁ జదువునాఁడే నేను వీరి వైదుష్యము గనుఁగొంటిని. తెనుఁగు ఐచ్ఛికశాఖగాఁ దీసికొని వీరికడ శిక్షాభాగ్యము వడసిన యెవ్వరేని వీరి విమర్శప్రౌఢికిని అతిక్లిష్టములగు ఛందో వ్యాకరణాద్యంశములఁ గరతలామలకము సేయు వీరి మతివైశద్యమునకును ఆశ్చర్యపడక మానరు. వీరు ఉత్తర రామచరిత్ర నాటకసంవిధానముంగూర్చి నుడివిన యపూర్వవిషయములు కొన్ని నేను మద్రాసు కాలేజి పండితుల మ్రోల నొకసారి వినిచినపుడు వారు ఆశ్చర్యభరితులైరి. వీరు పాఠ్య క్రమము కొలఁదికాలములో ముగించి విద్యార్థులలోఁ గొంత ప్రతిభగల వారిని కవనమునకుఁ బ్రేరించుచుండువారు. వారిచేఁ బద్యములఁ జెప్పించి వాని నోపికతో దిద్ది యోగ్యములఁ బ్రోత్సహించువారు. శర్మగారికి విద్యార్థులయెడ ఎంత వాత్సల్యమో, విద్యార్థులకు వారియెడ నిప్పటికిని అంత గౌరవము. విద్యార్థులమాట యటుండ, వీరి సౌహార్దయము వడసిన మఱి కొందఱు నేఁడు సుప్రసిద్ధకవులై తమ కవితావికాసమునకుఁ బ్రథమ కారణము శ్రీ శర్మగారే యని తమ గ్రంథములందే ప్రకటించికొని యున్నారు. వీరు దిద్దిపెట్టిన గ్రంథము లెన్నియో! నా కవనమునకుఁ బ్రభవము శర్మగారు విద్యార్థిదశలో నాకుఁజేసిన యనుగ్రహమే కదా! అని సంతసించుచున్నాను. వీరి శిష్యులు నా సతీర్థ్యులొకరు రచించిన గ్రంథముమీద కవిచూడామణి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు ఏఁడాదినాఁడు అభిప్రాయ మొసఁగుచు వ్రాసిన యీ క్రింది వాక్యములు చూచిన శర్మగారి కవితాగౌరవము ఎంతవ్యాప్తమై యున్నదియుఁ దెలియును.

“నాఁడు శ్రీ వేంకటరాయశాస్త్రులుగారి గోష్ఠిని బలువురు సాహిత్య చతురులు నెల్లూర వెలసిరి. నేఁడు శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారి గోష్ఠిని బలువురు సరసకవితాచతురులు వెలయుచున్నారు.”

వీరి క్షమ యనన్యాదృశము అనుట వీరి సౌహార్దము చెందినవారెల్ల నెఱుంగుదురు. ఆనాఁటి గాఢపు వాత్సల్యము శర్మగారికి నాయెడ నేఁటి కిని క్షీణింపకుంట నా యదృష్టము. నేఁడు ఇచ్చటికి విచ్చేసి నా సపర్య గైకొనుట కంగీకరించినందులకు శర్మగారికి నా ప్రణామసహస్రములు.

## గురుపూజ

ఆవల నారాయణరావు నాయుఁడుగారు గురువుగారిని స్తుతించుచు రచియించిన యీ క్రింది పద్యము శ్రీయుత మోచర్ల రామకృష్ణయ్య బి.ఏ., గారు హృద్యముగఁ జదివిరి.

అలఘుప్రేమఁ బ్రబోధరూపసుధ శిష్యస్వాంత కేదార సీ
మల వర్షించి కవిత్వసస్యముల సంస్థాపల్లిలఁ బండించు పే
శల కావ్యాభ్ర విహారశీలుఁ బ్రతిభా స్సౌదామనీలోలు ను
జ్జ్వలదుర్భాన్వయసంభవుర్ ఘనునిసుబ్రహ్మణ్యు భావించెదన్.

అంతట బ్రాహ్మణపండితులు పనస చెప్పి వేదోక్తాశీర్వాదములతో, శ్రీ నారాయణరాయసమర్పితములైన పట్టువస్త్రముల శ్రీ శర్మగారికి చదివించిరి. శ్రీ శర్మగారు లేచి ఉత్తరీయమును ధరించి యీ క్రింది ప్రత్యుత్తర వాక్యముల నుడివిరి.

## శర్మగారి ప్రత్యుత్తరసారాంశము

శిష్యులు గురువులం బొగడుట సహజమే. కవిగారి వాక్కులు నా యర్హతకంటెను వారి వినయమునే తెలుపును. కవిత్వము పుట్టువుతో రావలయును. లత, కొనసాగి పుష్పించి పరిమళించుట లతయొక్క యంత స్సారబలము. ఉద్యానపాలకుఁడు చేయు సహాకార మల్పము. కావున నా శిష్యులు గొందఱు కవులేర్పడుటకుఁ గారణము వారి ప్రతిభయే కాని

నా ప్రభావము కాదు. భాషాంతరీకరణము కష్టమైనపని. సంస్కృత భాషాభిజ్ఞులకు మూలశ్లోకము చదువుకొన్నప్పుడే యానందము కలుగునో, తెలుగువారికి ఈ తెలుగు పద్యము చదువునప్పు డట్టిది కలుగవలయును. ఇదియే యాంధ్రీకర్త మనస్సులో నుంచుకోవలసిన విషయము. మూలానుసరణాభినివేశమున పద్యమును చెఱపక, పద్యసౌభాగ్యము కొఱకు మూలమందలి రసమును చెఱపక వ్రాయుటకు ఎంతో ప్రజ్ఞయు ఓపికయు కావలయును. (ఇక్కడ శర్మగారు ఒక నైషధశ్లోకమునకు శ్రీనాథుని తెనుఁగుపద్యమును జెప్పి, మార్పునకుఁ గారణముల నిపుణముగా వివరించిరి.) వారు నా శిష్యులని చెప్పుకొనుచున్నారు కావున నారాయణరావుగారి కృతిని పొగడుటకుఁగాని తెగడుటకుఁగాని నా కధికారములేదు. అది ఇక్కడ వచ్చియున్న విద్వద్రసికకవిజనులకుఁ గర్తవ్యము. ఇక్కడమాత్రము నే నొకటి చెప్పవలసియున్నది. కృతిపతి భవిష్యత్కాలమున హైకోర్టు జడ్జిపదవి నధిష్ఠించినపుడు, నారాయణరావు కవితాపరిశ్రమము వీడక ఇంతకన్న రుచిరముగా కృతిని వ్రాసి వారికే సమర్పింపఁ దలఁచుచో అయ్యెడ నన్నుఁగూడ మఱవకుందురుగాక అని.

## కృతిపతి ప్రశంస

ఆవల శ్రీ నారాయణరావునాయుడుగారు కృతిపతియగు ఖాన్ బహదూర్ జనాబ్ యూహ్యాలిసాహేబ్ బహదూర్ వారికి కృతిసమర్పణము చేయుచు రచియించిన యీ క్రింది పద్యములను ప్లీడరు శ్రీయుత మోచర్ల రామకృష్ణయ్యపంతులు బి.ఏ., గారు అత్యంత మనోహరముగ చదివిరి.

శ్రీలక్ష్మి ధృతి కీర్తి ముఖ్య వివిధ
శ్రేయంబులన్ గూర్చి వి
ద్యాలాలిత్యంబు తిరంబుచేసి పరిపూ
ర్ణాయుస్సదారోగ్య ని

ర్వేలోత్సాహములిచ్చి యీశ్వరుఁడు కూ
ర్మిన్ బ్రోచెడింగాతఁ దే
జోఽలంకారుని ఖాన్ బహద్దరుజనాబ్
యాహ్యాలి ధీరోత్తమున్.

శైలేంద్ర ప్రతిమాన ధీరగుణ ని
స్తంద్ర క్రియా శాలి! యా
హ్యాలీ! సత్కవి కాళిదాసుఋతుసం
హారంబు పీయూషక
ల్లోలోద్వేలఘునీవిశేషమును దె
ల్గున్ భూమికిం దెచ్చి నీ
కేలన్ బెట్టితి, నా భగీరథుని భం
గిన్ గీర్తి నర్థించితిన్.

నా చిత్తాబ్జమునన్ గవిత్వమకరం
దం బూరి యుప్పొంగి భ
వ్యౌచిత్యంబునఁ బండితభ్రమర సా
ర్థానందసంధాయియై
ఈచాయన్ బ్రవహించి నైక్యమయి పో
వున్ నేఁడునీయందుఁ, బ్ర
జ్ఞాచాతుర్యసరిత్పతీ! బుధజన
శ్లాఘార్హ శశ్వత్స్మృతీ!

నీ యౌజ్జ్వల్యముగాంచి, నీ రసికతన్
వీక్షించి, నీ మిత్రతా

న్యాయం బారసి, నీ దయాగుణము చా
యఁ జూచి, మోహించి, యెం
తో యుల్లాసముతో వరించె నిను నేఁ
దోల్దాల్లఁగన్నట్టి ల
క్ష్మీయుక్తిం దగు కావ్యకన్య యనుర
క్తిఁ దీనిఁ జేపట్టుమీ.

అరయ మహమ్మదీయులును
హైందవులుం దమ భేదభావముల్
మఱచి పరస్పర ప్రణయ
మంజులతాపరిపూర్ణ మానస
స్ఫురణ వహించి బాంధవుల
పోల్కి మెలంగుచునుండ్రుగాత, మీ
కరణి సముద్యమంబుల జ
గత్ప్రియకార్యవిధానసూర్యులై.

తరువాత మోచర్ల రామకృష్ణయ్యగారు కృతినుండి ఒక్కొక్క ఋతువునుండియుఁ గొన్ని పద్యములు అర్థము తేటపడునట్లు మనోరంజకముగఁ జదివిరి. సంస్కృత శ్లోకమును తెనుఁగు పద్యమును రెండిటిని పోల్చి చూపిరి. పద్యముల ధారాశుద్ధికి సభ్యులు తన్మయులగుచుండిరి.

## ఒంగోలు వేంకటరంగయ్యగారి ఉపన్యాసము

ఈ మహోత్సవ విషయము కొలకులనారాయణకవి బి.ఎ., బి.యల్.,గారు రచించిన ఋతుసంహారాంధ్రీకృతిని జనాబ్ యాహ్యాలి సాహెబు ఎం.ఏ, బి.యల్., గారి కర్పించుట.

యువజనుల సాహచర్యమున ముదిమివారికిని ఉత్సాహము కలుగు నందురు. అట్లు వారితోడి ఉత్సాహ మనుభవింపఁగలుగుట భాగ్య విశేషము. ఈ నాఁటి మహాసభాముఖమున ప్రధానపురుషులు పూర్వవయస్కులు కృతి పతులొకరు, కృతికర్తలొకరు. ఉభయులు నభిజాతులు సద్వంశజులు. కృతిపతిగారి పూర్వికులు పారంపర్యముగ నెల్లూరు ముఫ్తీహోదాగలవారు, ముఫ్తీ యనఁగ ధర్మపాలకుఁడు. ఈ వంశమున కడపటి ముఫ్తీదారు జనాబ్ అబ్దుల్ అలాంసాహెబు మర్హూంగారు. వీ రనేకస్థానములలో డిస్ట్రిక్టు మునసబుగ నుండి కడపట మన మండలములో కావలి డిస్ట్రిక్టు మునసబుగ నుండి వార్షికభృతినందిరి. వీరి యింటికి ముఫ్తీమంజిల్ (Mufti Manzil) అను పేరైనది. నెల్లూరియందు పలువురు గొప్పగొప్ప పదవులనందిన మహమ్మదీయులు వెలసియుండిరి. నెల్లూరి కాజీవంశస్థులు కీర్తిశేషులు ఫసహుద్దీన్ సాహెబుగారు కుంపినిదివాణమున ప్రిన్సిపల్ సదర్ అమీను (నేటివ్ జడ్జి)గ నుండిరి. హాజీమహమ్మద్ రహీంతుల్లా సాహెబులవారు వేంకటగిరి సంస్థానమున దివాంజీగా నుండిరి. వారి పేరుప్రతిష్ఠలు ఇప్పటికిని నెల్లూర మ్రోఁగుచున్నవి. చిరంజీవులు కృతికర్తలు అభిమానముచేతను అనువర్తనము చేతను నెల్లూరు వాస్తవ్యులైరి.

తిక్కనాదులు పవిత్రముచేసిన భూసారసంపర్కముచే నన్నటుల వీరికి తెనుఁగున నభిమానము సాహిత్యసంప్రదాయసంపదలు కడు చిన్న తనముననే చేకూరినవి. కవనశక్తియు సహజమైనది. వీరి చిఱుతవయస్సుననే సంస్కృత శృంగార కావ్యములలో పేరొందిన ఋతుసంహారమును ఇటీవల తెనిఁగించినదాని సంప్రతి గౌరవ పురస్సరముగ తమ కావ్యములను వ్యవహారపదమున దేశికులను నాఁడెల్లు జనాబ్ యహ్యాఅలీ సాహెబుగారికి అంకితముచేసియుంట యిపుడందఱికిని వినిపింపఁబడియున్నది. తెలుఁగుజాతి వాఁడు తెలుఁగుకావ్యము ఉర్దూ మాతృభాషగాఁగల మహమ్మదీయుని కంకితమిచ్చుట ఆశ్చర్యముగ నుండఁగలదు. కొంచెము విమర్శించినచో ఆశ్చర్యహేతువేమియు లేకపోవును. కృతిపతిగారు తెలుఁగుదేశపువారు.

లోకసాంగత్యముచే తెలుగు చక్కగ నేర్చినవారు. వ్యవహారదశయందు ప్రాయికముగ వీరిపని యంతయు తెలుగున జరుగవలసియుండె. అదియును గాక వీరు ఇదంపరముగ నొక యుపాధ్యాయుని సహాయముచేసికొని తెలుగున గణ్యమగు సాహిత్యమును సాధించిరి. ఇది యట్లుండగ భాషా చరిత్రమునుజూడ ఇస్లామియ ప్రభువరు లనేకులు సంస్కృతాంధ్రపండితులను కవులను సమ్మానించి అభిమానించి కృతులఁ గొని వారలఁ బోషించి నట్లు తెలియుచున్నది. జగద్విఖ్యాతపండితులును ధర్మవేత్తలును నగు విద్యోపాధ్యాయులను, ఢిల్లీ సుల్తానువారియొద్ద గొప్ప అధికారిగను సేనాధిపతిగనుండిన మాలిక్ కాఫూర్ సందర్శించినటుల, కావలి రామస్వామిపంతులుగారి Deccan Poets (డక్కను కవులు,) అను గ్రంథమునఁ గలదు. ఆ మహోపాధ్యాయులవారితో మాలిక్ కాఫూర్ గారు సంస్కృతమున సంభాషించినటుల అందున్నది.

మఱియు గోల్కొండ నవాబు మాలక్ ఏ ఇబ్రాహింగారు(Malik-e-Ibrahim) అద్దంకి గంగాధరకవి విరచితమగు తపతీసంవరణంబను నుత్తమాంధ్ర కావ్యమును అంకితము పొందినట్లు ఆ గ్రంథమునఁ దెలియుచున్నది. దేశసంప్రదాయమునుబట్టి (Max Muller) మోక్షమూలరయినట్లు కృతిపతి పేరును సంస్కృతరూపముదాల్చి "మల్కిభరామ" అయినది. ఇంకను అనేక గ్రంథములుగూడ వారి కంకితము చేయఁబడినట్లు ఆ కావ్యమే తెలుపుచున్నది.

ఈ నవాబుగారి సేనానియు గొప్ప హోదాదారులును అయిన అమీన్ ఖాన్ గారికి తెలగనార్య విరచితమయిన శుద్ధాంధ్ర యయాతి చరిత్రము అంకితమైయున్నది. ఈ కావ్యము లీనాఁటివి గావు. పదిఁయాఱవ శతాబ్ద మధ్యభాగమున వెలసినవైయున్నవి. వీనిఁబట్టిచూడ మహమ్మదీయ ప్రభువులకు ఆంధ్రముపై గొప్ప ఆదరాభిమానములు ఉండినవని ఊహింపవచ్చును. ఆ ప్రాచీన సంప్రదాయమునే యీనాఁడు మన పట్టణ వాస

వ్యులు గూహ్యాఅలీగారు ఉజ్జీవింపఁజేసి ఊర్జితపఱిచినారు. వీరేగాక మన కాలమున సంస్కృతమునను తెలుఁగునను గొప్ప పాండిత్యముగలవారిని మహామ్మదీయులను మతికొందఱినిగూడ చేర్చ్కొనవలెను. గోదావరీ మండలమున మన సమకాలీనులైన ఉమ్రాఅలీ షా యం. యల్. ఏ. గారు తెనుఁగున గొప్ప కవియై వర్ధిల్లుచున్నారు.

ఋతుసంహారము అన్వర్థనామము. గ్రంథము ఋతువున కొక సర్గముగ ఆఱు సర్గములపై నున్నది. మొత్తమున నూట నలువది నాలుగు శ్లోకములు గలవు. ప్రతిభావంతులగు మన యువకవిగారు అన్నిటికన్ని పద్యములు వ్రాసినారు. వానిలోఁ గొన్నిటి నిపుడు కర్ణపేయముగ ననుభవించితిమి. రచనా సారళ్యము భాషా నైర్మల్యము మొదలగు సంపదలం గూర్చి ప్రసంగించుట పిష్టపేషణముగ నుండును. గ్రంథము రసపుష్టిగలిగి ఆహ్లాదకరముగ నున్నది. ఇతోఽధికములగు నుత్తమకావ్యముల నిట్లె రచియించి ఈ కుమారకవి యభినందనార్హుఁడగుఁగాక.

ఈ కావ్యమున కథాంశ మేమియు లేదు. కేవల వర్ణనగ నున్నది. దీనిని కవిగారు బహునిపుణముగ నిర్వహించినారు. ఇట్టి కావ్యములు మన దేశమునఁనేగాక యితర భాషలయందును గలవు. ఇంగ్లీషున James Thomson కవి ఋతువులపై నొక పద్యకావ్యమును వ్రాసియున్నారు. వారి దేశపువాడుక ప్రకారము నాలుగు ఋతువులే యగుటవలన ఆ కావ్యము వర్షా శరత్తులతో ప్రారంభమయి మన ఋతుసంహారమువలె వసంతమున సమాప్తమయినది. ఆ యాంగ్లేయ కావ్యమునకును మన ఋతుసంహారమునకును ఒక్క భేద మగపడుచున్నది. ఋతుసంహారమున 'వ్రతానాముత్తమంవ్రతమ్' అనినటుల, ఏ ఋతువున కాఋతువు నిలిచిపోయినది. Thomson కవి యన్ననో అన్నిటిని సంపుటీకరణముచేసి ఒక గొప్ప ఫలితార్థమును జెప్పినాఁడు.

"These, as they change,
Almighty Father, these,
Are but the varied God. The rolling year
Is full of them."

(సర్వశక్తిగల ఓ తండ్రీ! యివి (ఋతువులు) మారుటంతయు నానారూపములుగల దైవమే. పరిభ్రమించుచుండు ఈ సంవత్సరము వీనితో నానా రూపములతో నిండియున్నది.) ఇట్టి యుద్బోధము ఋతుసంహారమున వ్యంగ్యముగ నున్నది.

కవికోకిల రామిరెడ్డిగారిచే ఆంధ్రప్రపంచమునకు ప్రసాదింపఁబడిన ఉమార్ ఖయ్యామ్ వ్రాసిన రుబాయత్ అను పార్సికావ్యమునకును మన ఋతుసంహారమునకును ప్రకృతి వర్ణనా విషయములో కొన్ని సామ్యములు గలవు. అతని మద్య పరవశత్వము ఆధ్యాత్మికరహస్యముగ పరిగణింపఁబడినను స్థూలముగ అతని మద్యానుభవము ఈ ఋతుసంహారమునను జూపట్టుచున్నది.

## బ్ర॥శ్రీ॥ కాళిదాసు వేంకటసుబ్బాశాస్త్రిలవారి ఉపన్యాసము

ఋతుసంహారము కాళిదాసకృతి, మిక్కిలి భోగ్యమైనది. నేను విన్నంతవఱకు, పద్యములు మూలశ్లోకములవలె సరళములై యున్నవి. ఓకో గుణము కలదు. "దివసాఃపరిణామరమణీయాః" అను శాకుంతలోక్తికి సరిగా నున్న శ్లోకము తెలిఁగించుచు "తుదలభోగ్యములైన దినంబులుౘ" అని కవి వ్రాయుట మనోజ్ఞము. గ్రంథము ముద్రితమైనపుడు ఇంకను గుణములు పరిశీలించుటకు సాధ్యమగును. 'మదిరాపానప్రశంసము' మాఘములోఁగూడ కలదు. కవులకు ఈ వర్ణన సామాన్యమే. చిన్నవారైనను, కవిత్వపరిపాకము మిక్కిలి బాగుగానున్నది. శైలిలో సంస్కృతపదములు మెండు. శ్రీనాథుని పోలికలు కొనవచ్చుచున్నవి. నారాయణరావుగారు ముందుముందు ప్రౌఢతర కృతులు వ్రాయఁగలరని నాకుఁ దోఁచుచున్నది. భగవంతుఁడు దీర్ఘాయురారోగ్యములు వారికి ప్రసాదించుఁగాత.

## తూములూరు శివరామయ్యగారి ఉపన్యాసము

నాకు ఇరువదియేండ్లుగా మిత్రులై గురుస్థానముగా నేను భావించుచున్న బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారికి మహాసభాముఖమున జరిగిన యీ గురుపూజనము నాకుఁ బరమ సంతోషదాయకము. నా మిత్రులు యూహ్యాలిసాహెబుగారు అస్థిరమైన రాచకీయరంగమును విడిచి స్థిరమైన న్యాయమూర్తి పదవి నొందినందుకు నాకు సంతోషము. హైకోర్టు జడ్జీ పదవి నేకాక వీరు ముందు ఫెడరల్ కోర్టు జడ్జిపదవికూడ పొందుదురుగాక. నారాయణరావుగారి కృతికన్య శర్మగారన్నట్లు ఇంకను 'గోషా'లో నున్నది. వెలువడిన పిదప, అందఱముచూచి ఆనందింపఁగలము. నెల్లూరులో ప్రతిభకు కొఱంతలేదు. నారాయణరావుగారివంటి యువకులు ఇట్టి సద్గ్రంథముల వ్రాసి నెల్లూరికీర్తి వర్ధిల్లచేయవలయునని నా కోరిక.

## కృతిపతి ఖాన్ బహద్దరువారి ప్రత్యుత్తరము

ఆనల ఖాన్ బహదూర్ యూహ్యాలీసాహేబ్‌గారు ఆంగ్లమున నుపన్యసించుచు నిట్లుచెప్పిరి. నేఁడు నాకు జరిగిన సన్మానము నా జీవితమున నొక అపూర్వ విశేషమని తలంచుచున్నాను. ఈ పురమున నా కిటీవల నెన్నియో సత్కారములు జరిగినవి కాని యందేదియు నేటి సన్మానముతో తులతూఁగఁజాలదు. శ్రీ నారాయణరావుగారు నాయొద్ద సుమారు రెండు సంవత్సరములు జూనియర్‌గా నుండిరి. ఆకాలమున వారి సామర్థ్యమును, పట్టుదలను, వినయమును, విశ్వాసమును నే నెంతో సంతోషముతో గమనించుచుంటిని. వారీ న్యాయవాది వృత్తిలోనే యభివృద్ధికి రాఁగలరని నాకు సంపూర్ణమైన నమ్మకము కలదు. ఇప్పుడే ప్రభుత్వోద్యోగములో ప్రవేశింపఁదలంపక కొంతకాలము ఈవృత్తిలోనే యున్నచో, వారున్నత స్థానము నొందఁగలరనుటకు సందియములేదు. వారి కవితాశక్తికి నే నెంతయు ఆనందించుచుంటిని. నాకు తెలుఁగున పరిశ్రమలేకున్నను, ఆంగ్ల

పారసీక భాషలలోఁ గల కవితా గ్రంథములను పఠించుటయుం దాసక్తుఁడ నగుటచేత తెలుఁగు కవితలోని భావసౌభాగ్యము నరసి అప్పుడప్పుడు ఆనం దించుచుండెడివాఁడను. నేను పరిశీలించినంతవఱకు ఋతుసంహారములోఁ గల భావములకును పారసీకములో మిక్కిలి వాసిగాంచిన ఓమర్ ఖయాం లోని భావములకును పోలిక యొంతో కలదు. శ్రీ వేంకటరంగయ్యగారును ఈ విషయము ప్రస్తావించియున్నారు. అట్టి యీ ప్రశస్తకృతి నాకంకితము చేయఁబడుట నా భాగ్యవిశేషముని తలంచుచున్నాను. నేను చిరకాలముగ నీ యూరివారి సంపర్కము ఆదరణమును బొంది మెలంగుచుంటిని. అట్టి మిమ్ము నే నెట్లు నా మనస్సుచేత కెంతయు చింతిలుచున్నాఁడను. నా మిత్రుఁడు నారాయణరావు ఇంకను ప్రసిద్ధకృతుల రచియించి కీర్తి నార్జింపవలయునని ఆశీర్వదించుచు విరమించుచున్నాను.

అనంతరము హిందీ భాషాపారంగతులగు పైడిపాటి చలపతిరాయకవి గారు ఇందుకు ప్రసంగించుచు మహమ్మదీయులు హైందవ భాషాపోషణ మున నెట్లు పాటుపడినదియు సోదాహరణముగ నుపన్యసించిరి.

## బ్రహ్మశ్రీ హనుమచ్ఛాస్త్రిగారి సందేశము

ఆగల మూలపేట సంస్కృతకళాశాల ప్రిన్సిపల్ గారును వైయా కరణ సార్వభౌములును అగు బ్రహ్మశ్రీ రాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారు, కార్యాంతరమున నొక గ్రామమునకు వెళ్లియుండి సభకు రాఁజాలక అచటి నుండి పంపిన యీ క్రింది శ్లోకములను శ్రీయుత మోచర్ల రామకృష్ణయ్య గారు చదివిరి.

శ్లో॥ ఋతుసంహారాఖ్యం కావ్య మాంధ్ర్యాం రచితం సుక్షేమణినా,
శ్రీ నారాయణకవినాభూయాత్సహృదయవల్లభం శశ్వత్.
జీయాదాచంద్ర తారార్కం కృతి రేషా సమర్పితా,
శ్రీమన్మాన్యయాధిపతయే యూహ్యాలీ త్యభిధాజుషే.

గురూపదేశ సంక్రాంత హృదయంగమసూక్తిభిః,
బహుకావ్య ప్రణేతృత్వం లభతాం మేమసత్య నిః.

## సభాధ్యక్షుల ఉపసంహారోపన్యాసము

పిదప సభాధ్యక్షులు శ్రీమాన్ మాడభూషి నరసింహాచార్యులవారు సభాకార్యక్రమమును ముగింపుచు, నాఁటి విద్వన్మహాసభ [illegible] అత్యద్భుతమైనదనియు, ఇంతటి మహావైభవముతో కృతిసమర్పణ మీ ప్రాంతమున ఎన్నఁడును జరుగలేదనియు, శ్రీ నారాయణరావుగారి ఆంధ్రీకరణము చాల మనోహరముగ నున్నదనియు, వారి శైలియు ధారాశుద్ధి గలిగి శ్లాఘాపాత్రమై యొప్పుచున్నదనియు, శ్రీ [illegible]స్వామిగారికి కృతిని అంకితముచేయుటవలనఁ బెట్టినంతనే కృతిధర్మమును [illegible] చేయుటవలననే కృతిస్వీకరణ సద్యఃఫలము లభించినదనియు, [illegible]స్వామిగారు ఈ ప్రకరణమును పఠించుచున్నను వారు మన "కవిత"లోనే యున్నవారుగాన మన సమీపముననున్నట్లే భావింపవచ్చుననియు, వారి [illegible] భాషాభిమానము మనకు కావలసినప్పుడెల్ల లభ్యముగుచుండుననియు, నారాయణరావుగారు ఇట్టికృతుల నింకను రచియించి అభివృద్ధికి [illegible] గావలయుననియు ఆశీర్వదించిరి.

ఆవల శ్రీయుత ముంగమూరు వేంకటసుబ్బారావుగారు వందన సమర్పణము చేయుచు, కవియు, కృతిపతియు, గురువుగారును [illegible] ఆంధ్రసభ సభ్యులగుటచే సంతసించుచు, తత్సభాసభ్యులెల్లరు [illegible] చుండవలెనని కోరుచు, సభ్యులకును, అధ్యక్షులకును, కృతిపతికిని వందనము లర్పించిరి.

మంగళవాద్యములతో సభ ముగిసెను.

---

## II

నెల్లూరు పట్టణమున ఈ నెల తే 17 దిన జరిగిన కృతిసమర్పణ మహోత్సవముయొక్క సంపూర్ణవృత్తాంత మీ సంచికయందుఁ బ్రచురింపఁబడినది. భాషాప్రపంచమునం దిట్టి మహోత్సవములు జనులయందు ఉన్నతభావములను ఉత్తేజకరమగు విజ్ఞానమును సరస సారస్వతాభిరుచియును బ్రజ్వలింపఁజేయుననుట నిస్సంశయము. పూర్వకాలమునం దిట్టి మహోత్సవములు రాజాధిరాజుల సభాస్థానములయందు, కవిపండితవర్గ సన్నిధానమున, సముచితసమ్మానములతో జరుగుచుండిన దృష్టాంతములు వాఙ్మయమున నసంఖ్యములు గలవు. కృష్ణదేవరాయలు మనుచరిత్ర పారిజాతాది గ్రంథములను పరిగ్రహించుటయు, అనవేమారెడ్డి శృంగార నైషధాది గ్రంథములను గైకొనుటయు, వేయేల, బమ్మెర పోతరాజువంటి ఎవరో కొందఱు విరక్తులు తప్ప, తక్కుంగల కవిపుంగవుల కృతికన్యలను రాజులు అమాత్యులు గొప్ప ప్రభువులు మున్నగువారు చేపట్టుటయు, ప్రాచీన గ్రంథపరిచయము గలవారి కెల్లరకు విదితమే. పరదేశప్రభువుల పరిపాలనారంభకాలమునుండి అట్టి విద్వన్మహాసభలు అరుదైనవి. స్వదేశసంస్థానాధిపతుల ప్రోత్సాహమున నింకను అపుడపుడు విద్వత్కవిసమ్మానములు జరుగుచుండుటను కనుచున్నాము వినుచున్నాము. ప్రభువుల ప్రోత్సాహము పోషణము నామమాత్రావశిష్టమయిన యీకాలమున, విద్వాంసులను కవులను ఆదరించి ప్రోత్సహించవలసిన భారము మహాజనులపై నెలకొనియున్నది. నెల్లూరు [illegible] మహాశయులు ఈ తే 17 ది సమావేశమునఁ జూపిన ఆదరాభిమానము లెంతయు ప్రశంసనీయములు. కవి యువకుఁడు, ప్రతిభాశాలి, ఉత్సాహవంతుఁడు. గ్రంథరచనకిదియే వారి ప్రథమ యత్నమైనను, విద్వదభినంద్యమైన మార్గమున నుత్తమకృతిని రచియించి, భవిష్యత్కాలమున నింకను ప్రౌఢములగు కృతులను రచియించి నెల్లూరు మండలమునకు కీర్తి గౌరవముల సంపాదింపఁగలరను ప్రత్యాశను వారు జనింపఁజేయుచున్నారు. ఈ కవిగారి ఆంధ్రీకరణము మనోజ్ఞమై, మూలగ్రంథము

నందలి శ్లోకములలోని రసమును పోషించుచు, కవి హృదయమును విస్పష్టముఁజేయుచు, శ్రోతల వీనులకు విందొనర్చుచు, జీవకళలతో విరాజిల్లుచు, కవిగారి సాహిత్యాభినివేశమును మృదుమధురకవితాసామర్థ్యమును వ్యక్తము చేయుచున్నవి. ఆనాఁటి సభయొక్క వక్తలలో నొకరును పౌరవతంసులును నిరంతరభాషాసేవకులును పరిశీలకులును అగు శ్రీయుత వంగోలు వేంకటరంగయ్య పంతులుగారును ఇతరులును తమ యుపన్యాసములలో నుడివినటుల, ఈకృతి మహమ్మదీయమహాశయున కంకితము గావింపఁబడుట స్వవర్గ మగు గొప్ప విశేషము. శ్రీ యాహ్యాలీ సాహెబ్‌గారు మహమ్మదీయులైనను, ఆంగ్ల పారసీక భాషలయందు ప్రవీణులైనను, ఆంధ్రమునను మిక్కిలి అభిమానముగలిగి పండితుల సహాయముతో కొన్ని యుద్గ్రంథముల పఠించి భాషావిజ్ఞానమును బడసినవారు. కృతి సమర్పణము, శ్రీ యాహ్యాలీసాహెబ్‌గారీ పురమున గడచిన వారము దివసములనుండి పొందుచున్న వివిధసమ్మానములలో నెల్ల నగ్రగణ్యమైన దనుట నిక్కము. వారి కిట్టి యదృష్టమును పొందుట ముస్లిములు వారి కింకను కలుగనున్న అభ్యుదయోత్కర్షములకు ప్రబలసూచకము. సాధారణముగ కృతిలో నొకపద్యములో గురుస్తుతిని ముగించు ఆచారమునకన్న మిన్నగా, సభాముఖమునఁగూడ గురువును గౌరవించుటకు ఈ నారాయణకవి యవలంబించిన నూతనములోదారవిధాన మెంతయు శ్లాఘనీయము, అను సరణీయము. తను శిష్యవర్గమున కట్టి ఆంధ్రసారస్వతాభిరుచిని కలిగింపఁ జేసి, ఉన్నతభావముల నుద్దీపింపఁజేసి, కావ్యముల రచియింపఁ బ్రోత్సహించి, శిష్యులవాత్సల్యాభిమానములను పూజాదికముల నందు భాగ్యమును గాంచిన గురువర్యులు శ్రీయుత దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారెంతయు ధన్యతములు. మిక్కిలి విజయప్రదముగ నెఱవేఱిన యీ కృతిసమర్పణమహోత్సవము నెల్లూరు మండలముయొక్క వాఙ్మయాభివృద్ధి కింతకు నెక్కువ ప్రోత్సాహ మొసంగుఁగాక యని కోరుచున్నాము.

సుబోధిని (సంపాదకీయము.)

—/o/—

# పీఠిక

(ద్వితీయ ముద్రణము)

"జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్॥

శ్రీ కాళిదాసమహాకవి ఋతుసంహారకావ్యమును నే నాంధ్రీకరించి యిప్పటికి దాదాపు ఇరువది సంవత్సరములైనది. నే నొనర్చిన యనువాదము కరము ప్రౌఢముగ నున్నందున పెద్దలు పలువు రద్దానికిఁ బ్రతిపదార్థ మనుబద్ధమగునేని సామాన్యులకు మిక్కిలి యుపయోగపడునని స్వయముగ నన్నెచ్చరించిరి. అందు ముఖ్యులు మన్మిత్రులు 'సరసకవి' 'సాహిత్యరత్న' బిరుదాంకితులు శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు. మద్గురువరేణ్యులు కీ. శే. మహోపాధ్యాయులు దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు సైత మిట్టిసేఁత యవశ్యాచరణీయమనియుఁ దత్కృషి ఫలవంతమగునేని నా ఆంధ్రీకరణము సారస్వతలోకమున స్థిరముగ నిలిచిపోవుటకు నవకాశమున్నదనియు వారు జీవించియుండినతఱిఁ బలుమాఱు ప్రోత్సహించిరి. ఉద్యోగవ్యూహమునఁ జిక్కిన నా కీపని దుర్ఘటమగుటయేగాక, నా గ్రంథమునకు నేనే టీకాదులు సనిపఱుచుట ప్రశంసార్హముగా నుండదని గుర్తెఱింగి యీ ప్రయత్నము సేసి ఉదాసీనుఁడనైతిని. మత్కృత మేఘసందేశాంధ్రీకరణమునకు విపులవ్యాఖ్య విరచించిన శ్రీ కేసరి సుందరరామశర్మగారు ఈ పనికిఁ బూనుకొనఁ దలంచిరిగాని, వారికి వ్యవధి చాలమి వెనుకంజ వేసిరి.

ఇంతలో నేను కోవూరు తాశీల్దారుపదవినుండి నెల్లూరు కలెక్టరాఫీసు హుజూరుశిరస్తాదారుగా మార్పుపొందితిని. నే నొకనాఁడు

ఆఫీసులో నుండఁగా నా ప్రియస్నేహితుఁడు చిరంజీవి భట్టారం మల్లి కార్జునంగారు రఘువంశమునుండి వారు తెలిఁగించిన 'నందిని' అను పాత్రము నా కొఱంగి సరిచూడుఁడని చెప్పిరి. ఆ గ్రంథమును దీటిక చిక్కినప్పుడెల్ల నే నా మూలాగ్రము చదివి, ఈ కవికుమారుఁడు నివురుగప్పిన నిప్పు అని యెంచింగితిని. అందుపై నా ఋతుసంహారకావ్యమును వారి కొఱంగి అర్ధానికిఁ టీకాతాత్పర్యములు రచియింపుఁడని కోరితిని. నా మీఁది యవ్యాజప్రేమచేతను, నా ఆంధ్రీకరణమునందలి యభిమానముచేతను, కాళిదాసమహాకవి మీఁది గౌరవముచేతను వారు వెంటనే యీ కార్యమున కంగీకరించి రెండు నెలలలో రచనఁ బూర్తిగావించిరి. శ్రీ మల్లికార్జునంగారి టీకారచన లక్షణరక్షితమై గంభీరముగ సాగుచున్నది.

ఋతుసంహారములో సారస్యములు పెక్కు లున్నవి. వాని నన్నింటిఁ గ్రోడీకరించి వ్యాఖ్య వ్రాయవలెనన్న నాకింటఁ గొన్ని యేండ్లు పూండ్లు పట్టును గాన నా ప్రయత్నమును ప్రస్తుతము విరమించితిని. దయామయుఁడు సర్వేశ్వరుఁడు కరుణించినచో, ఈ రెండవ ముద్రణమును పెద్ద లాశీర్వదించిన పక్షమునఁ దృతీయముద్రణమున నీ కొఱంతఁ దీర్పఁగలను.

నేను 'వావిళ్ల' వారి ప్రతినిఁబట్టి తొలుత ఆంధ్రీకరణమునకుఁ గడంగితిని. ద్వితీయముద్రణమునందు బహు గ్రంథావలోకనముచేసి మూల శ్లోకములను పాఠాంతరములతో ముద్రించితిని. అట్లొనర్చునప్పుడు కొన్ని యెడల మూలశ్లోకములకు నా ఆంధ్రీకరణమునకుఁ గొంతవ్యత్యాసము కనఁబడుచున్నది. మచ్చునకు 'వసంతము'న 28-వ శ్లోకము.— ఈ ముద్రణమున ద్వితీయపంక్తిలో "జ్యాయస్యాకులితక్షా" అని యున్నది. వావిళ్లవారి ప్రతిలోని "జ్యాయస్యాలికులమ్" అను మూలమునకే నేను

"కమ్మతేనియ లానుగండుతేఁటులబారు
రమణీయమగు నల్లత్రాడుగాఁగ"

అని ఆంధ్రీకరించితిని. ‘జ్యాయస్యాళికులమ్’ అను పాఠాంతరము నఖోజ్ఞాపికలో ముద్రింపఁబడినది. ఇట్టి వ్యత్యయములకుఁ బఠితలు నన్ను మన్నింతురు గాత!

ఎంత నిశితముగాఁ బరీక్షించినను ముద్రణస్ఖాలిత్యము లందందు దొరలక తప్పినవి గావు. గ్రీష్మములోని 18-వ శ్లోకమందుఁ బ్రథమపాదమునఁ ‘దీక్ష్ణతకు’ ‘తీక్ష్ణ’ అనియు, 98 వ పుట యందలి తుది పంక్తిలో ‘నుత్సుకిల్లిరి’ అనుటకుమాఱు ‘ఉత్సకిల్లి’ రనియు నేత్రాదృశములగు నచ్చుఁ దప్పులు గ్రంథమందుఁ బ్రవేశించినవి. సహృదయులే వానిం దిద్దుకొందురను ప్రత్యాశచే శుద్ధిపత్రమును సంకలింపలేదు.

ఇరువదిసంవత్సరముల క్రింద నేను రచించిన ఈ ఋతుసంహారకావ్యమును, బలువురు రసికవతంసుల ప్రోత్సాహముపైఁ డీకాతాత్పర్యసహితముగాఁ బునర్ముద్రణము గావింప నువ్విళులూరుచుండియు, ముద్రణభారమునకు వెఱచి నిరుత్సాహినై యుంటిని. నవలలు నాటికలు వ్యాప్తినొందు ఇక్కాలమున ఋతుసంహారమువంటి కావ్యమును ముద్రింపించుటకు నెవ్వరు ఇచ్చగింతురా యని సంకోచించుచుంటిని. కాని, “కృష్ణరాయుని భువనవిజయ ప్రఖ్యాతి ఆంధ్రదేశమున నేఁటికిని అడుగంటలేదు. ఆంధ్ర కవితాపితామహుని గండపెండెరపు ఘుళంఘుళలు నేఁటికిని ఆంధ్రుల కర్ణముల మాఱుమ్రోఁగుచునే యున్నవి”—అని నేను అచిరకాలముననే గుర్తెఱుంగఁ గల్గితిని :

నాఁడు కవిసార్వభౌమునకుఁ గనకాభిషేకము గావించిన రెడ్డేంద్రుల యనూనౌదార్యము నేఁడు నా యెడను బ్రసన్నతను గాంచినది. నా సారస్వతోద్యమము నెఱింగి అయాచితముగ ముద్రణార్థభరమును నిర్వహింప సతీతిలకము శ్రీ జెట్టి రుక్మిణమ్మ యిచ్చగించినది. లేగుంటపాడు గ్రామకరణముగాను, ‘లలిత’ ‘కనకలతాది’ బహుగ్రంథకర్తలును నా చిరకాలమిత్రులునగు శ్రీ లేగుంటపాడు సూర్యనారాయణరావుగారి మూలమున నీమె పరిచయభాగ్యము నాకు లభించినది.

నెల్లూరు మండలమునఁ బ్రఖ్యాతిఁ గాంచిన అల్లూరుగ్రామవాస్తవ్యులు శ్రీ అల్లంపాటి కృష్ణారెడ్డి, లక్ష్మీదేవమ్మలకుఁ గనిష్ఠపుత్రిక రుక్మిణమ్మ. ఈమె నెల్లూరుజిల్లా కోవూరుతాలూకా లేగుంటపాడు వాస్తవ్యులు శ్రీ జెట్టి బలరామరెడ్డిగారి జ్యేష్ఠపుత్రుఁడైన సుందరరామరెడ్డిగారి ధర్మపత్ని. ఈ సుందరరామరెడ్డిగారి సోదరుఁడు శ్రీ గోపాలకృష్ణారెడ్డియే మత్కృత గద్య మేఘసందేశముద్రణార్థప్రదాత! శ్రీమతి రుక్మిణమ్మగారి పుత్రులు శ్రీ చి. బలరామరెడ్డి, శ్రీ కృష్ణారెడ్డిగారలు వంశమండనులై వెలుఁగొందుచున్నారు. నా సారస్వతోద్యమ నిర్వాహకులైన యీ కుటుంబము వారిని భగవంతుఁడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యపుత్రపౌత్రసంపన్నులఁగావించి ప్రోచుఁగాత.

శాశ్వతకీర్తి ప్రతిపాదకమైన ఈ శుభకార్యమును నెఱవేర్చిన శ్రీమతి జెట్టి రుక్మిణమ్మగారికి నేను జేయఁగల ప్రత్యుపకృతి యేదిగలదు! "విద్వాంసుష్టః శ్లోకమేకం దదాతి" కదా!

ఈ గ్రంథమును అత్యల్పకాలములో సర్వాంగసుందరముగ ముద్రించిన కోకిలా ముద్రణాలయాధికారి విద్వాన్ శ్రీ అక్కింతల వేంకటేశ్వర్లు గారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

నృపుఁ డొక్కరుం డెదురేగిన కవిచంద్రు
 నెక్కించెఁ బట్టంపు టేన్గుమీఁద,
రాజొక్కరుఁడు కవిరాజునకుం దానె
 గండపెండారమ్ము కాల్దొడిగె,
ఱేఁడొక్కరుఁడు కవిశ్రేష్ఠుని రావించి
 కనకాభిషేకంబు ఘనత సలిపెఁ,
బ్రభువొక్కరుఁడు కవిరాట్టును మదిమెచ్చి
 దక్షత నక్షరలక్ష లొసఁగె,

కాని, యీనాఁడు నీనాఁడ కాంక్షితముగ,
మహిని (శ్రీ) జెట్టి రుక్మిణమ్మయును బోలె,
నడిగి యడుగక మున్నె యత్యాదరమునఁ,
గవిని సత్కరించిన యోష గలదె చూడ? 1

నిండారుపంటల నిలువెల్ల నెక్కొన్న
పొలములు కొన్నివందల గడించి,
చదలేటిజలముల క్షాళితంబులగుచు
వెలినిగ్గులొలుకు మేడల వసించి,
పిదికిన నమృతంపుఁ బెన్సోనయును బోలె
పాలొసఁగు పశుసంపదను మించి,
నట్టింటి దివ్వెలయట్టుల కళలీను
సులలితగుణములఁ బుత్త్రులను గాంచి,
పలుకుఁ దొయ్యలి సిరిచెల్వ గలసిమెలసి
నిత్యమును స్వీయగృహమున నృత్యమాడ
నిరతసౌభాగ్యసంపత్తి నెగడుచుండు
రుక్మగుణగణ్య, (శ్రీ) జెట్టి రుక్మిణమ్మ. 2

అదిగో యిదిగో యని వా
యిదాలవేసి మోచేయి నేదో మిషచేఁ
దుదిఁ జూపించెడు దాతల
మది మెచ్చదు రుక్మిణమ్మ; మాటలిఁకేలా! 3

తొలినాఁడేగిన నన్నుఁ గాంచి మదిసం
తోషించి తాంబూలముం

గలకండఁ దియమావిపండ్ల నిడి, ద్రా
క్షాశర్కరాక్షీరస
మ్మిళితంబై తగు పాయసం బొసఁగి నా
మేలెంచి కీర్తించి యం
జలిగావించి వచించె అర్థికులయో
పారత్న మీరీతిగన్. 4

"శ్రీకృష్ణరాయలు ప్రీతినొసంగిన
అగ్రహారములు కూలాటిపోయెఁ,
ప్రభులు గట్టించిన వజ్రదుర్గంబులు
హంపీపురంబున సొంపుదఱిఁగె,
ఉదయాద్రి చఱియల నూల్కొని త్రవ్విన
యూటబుగ్గలు నేఁడు తూఁటుపడియె,
మిన్నేరు చుంబించి మిట్టాడి పేర్చిన
దేవళంబులు నేఁడు తీఱుదప్పె,
రాజరాజులు పెంచిన రమ్యవనము
లందు గన్నేరు లుమ్మెత్త లావరించె,
వీరపుత్త్రులు మ్రగ్గిరి పేరులేక
అరయ భువి నివియన్నియు నస్థిరములె! 5

'నాకశ్రీకపినాకినీ మహితకృ
ష్ణా భూరిగోదావరీ
వ్యాకీర్ణాంబువులుఁ' స్థిరంబులొకొ! క్షా
మాగ్ని ప్రభూతార్తి తీ

ణాకృష్టంబులుగాఁగ నీవనదుల
త్యంతంబు శోషించి భూ
లోకంబున్ జలియింపఁజేసెడిని; నీ
లో నీడా యోజింపుమా!

సప్తసంతానములను బ్రశస్తిగాంచి
ఫలము గాకుండునట్టిది కృతియె గానఁ
ద్వత్కృత 'ఋతుసంహార' కావ్యము వెలార్చి
ధన్యతను గాంతు నాచంద్ర తారకముగ."

అని మత్కృతిముద్రణాకగు
ధనమిచ్చుట కిచ్చగించెఁ దత్సతి; నేన
న్న—నపూర్వంబగు స్వప్నం
బునఁ బెన్నిధి గాంచినట్లు ముగ్ధుఁడనైతిన్.

తిరుపతి వేంకటేశునకుఁ
దీటుగఁ బెండిలి సేసి వచ్చి స
త్వరముగ నీవు గన్న కవి
తాలలితాంగిని గారవింపు సు
స్థిరమతి శాంతిఁబొందుమని
దీవెన లిచ్చెఁ బడంతి; దానమం
దరయ, సమానగౌరవము
నందరె స్త్రీలును బూరుషాళితోన్?

కళల సరస్వతి పోలదె?
పలుతోఁడుల నెప్డు లక్ష్మి ప్రాపగుఁగాదే!

పాలింపఁబడె యరివర్గం
బులఁ గాళిక?—వీరలెల్ల ముగుదలుగారే! 10

* * * *

శ్రీరంజిల్లఁగ సప్తభూధరశిఖా
సీమస్థిరుండై విప
ద్దారిద్ర్యగ్రస్తచిత్తులగు భ
క్తశ్రేణి రక్షించి మో
క్షానందార్థత్వము నిచ్చు స్వామి సదయుం
డై జెట్టి శ్రీ రుక్మిణీ
నారీరత్నముఁ బ్రోచుఁగాత ధనధా
న్యాయుర్యశఃపూర్ణతన్. 11

నెల్లూరు,
11–9–56.

విద్వద్విధేయుఁడు,
కె. నారాయణరావు.

## శ్రీ కాకర్తృ విన్నపము



ప్రతిమాహీనుఁడు కాళిదాసుఁడు రచిం
పఁగ, రమ్యవాణీచమ
త్కృతి నారాయణరాయ సత్కవి తెలిం
గింపఁగ విరాజిల్లు నీ

ఋతుసంహారము మందబుద్ధినగు నా
యీ టీకచేతం గళం
కితముంగాక చెలంగుఁగాతమని భ
క్తిఁ వేఁడెదన్ భారతిన్.

నేర్చినవాఁడఁగాను మహా
నీయపదార్థవిధానచాతురిన్,
దీర్చినవాఁడఁగా నొక కృ
తిన్ మును పెందును, నేఁటికెట్టులో
కూర్చినవాఁడ దీని : రసి
కుల్ దోసఁగుల్ తెలియంగఁ జేసినన్
మార్చెదఁగాదు, నేర్చెదను
మంజుల వాగ్రచనావిధానమున్.

అంతరముల్ గణింపక మ
హత్తరవత్సలతాప్రపూర్తి నన్
జెంతకుఁ జేర్చి ''వత్స! విర
చించితిఁ గావ్యము : టీకవ్రాయ నీ
వంత''ని నాకు నీ సుకృత
భాగ్యముఁగూర్చిన కావ్యకర్త క
త్యంత కృతజ్ఞతాముఖ స
హస్ర నమస్కృతులన్ ఘటించెదన్.

భట్టారం మల్లికార్జునం.

# ఋతుసంహారము

## గ్రీష్మము

ప్రచండసూర్యః స్పృహణీయ చంద్రమాః
సదావగాహ [1]క్షతవారి సంచయః।
దినాంతరమ్యోఽభ్యుపశాన్తమన్మథో
నిదాఘకాలః సముపాగతః ప్రియే॥

వెలుఁగులఱేనికాఁకఁ బ్రభ
విల్లు నలంతఁ దొలంగఁద్రోయ లో
కులు శిశిరాంశునాగమముఁ
గోర, నజస్రవిగాహనక్షమం
బులగు జలంబులున్ దుదల
భోగ్యము లైన దినంబులున్ బ్రవ
ర్తిల, నుపశాంతమన్మథ మి
దే వడకా రరుదెంచె నెచ్చెలీ!

టీ. నెచ్చెలీ = ఓ ప్రియురాలా! వెలుఁగులఱేనికాఁకన్ = సూర్యుని వేఁడిమివలన, ప్రభవిల్లు = కలుగుచున్న, అలంతన్ = శ్రమను, తొలంగన్ = నివారింపఁబడుటకుఁగా, లోకులు = జనులు, శిశిర + అంశు + ఆగమమున్ = చల్లని కిరణములుగల చంద్రునిరాకను, కోరన్ = కోరఁగా,

పాఠాంతరము:—1 క్షమ.

అజస్ర విగాహనక్షమంబులు + అగు = ఎల్లప్పుడును స్నానమాడుటకు యోగ్యములైన, జలంబులున్ = నీళ్లును, తుదలన్ + భోగ్యములు + ఐన = చివరిభాగములందు (సూర్యుఁ డస్తమించి యెండ తగ్గిన తరువాత సుఖము ననుభవించుటకుఁ దగిన, దినంబులున్ = దినములును, ప్రవర్తిలన్ = కలుగఁగా, ఉపశాంతమన్మథము = చల్లారిన మదనతాపము గలది (యగు వడకారు = గ్రీష్మము, అనుదెంచెన్ = వచ్చెను, ఇదే = ఇదియే చూడుము.

తా. ఓ చెలీ! సూర్యుని వేఁడిమికి నోపక జనులు, చలివెలుంగులుగఁ చందమామ రాకకై యెదురు చూచుచుండ, నెల్లవేళలయందును స్నానమాడుటకుఁ దగిన జలములు గలిగి, సూర్యాస్తమయమైనంతనే చల్లని గాలుల వీచుటచే నెంతయును సుఖాస్పదమై, వసంతమునఁ జెలరేఁగిన మదనతాపముపశమించి యువతీయువకులు సుఖించుచుండ, నిదే-గ్రీష్మము వచ్చుచున్నది కనుఁగొనుము.

నిశాః శశాంకక్షత నీలరాజయః
క్వచిద్విచిత్రం జలయంత్రమందిరం।
మణిప్రకారాః సరసం చ చందనం
శుచౌ ప్రియే యాన్తి జనస్య సేవ్యతామ్॥ 2

శశధరక్షతభృశతమశ్ఛటలు నిశలు
మహితములు చిత్రజలయంత్రమందిరములు
సరసమగుచందనము మణిసముదయములు
జనుల కతిసేవ్యములగు గ్రీష్మమునఁ జెలియ!

టీ. శశధర = చంద్రునిచే, క్షత = ఛేదింపఁబడిన (పోఁగొట్టఁబడిన) భృశ = దట్టమైన, తమస్ + ఛటలు = చీఁకటుల గుంపులు (గల), నిశలు = రాత్రులును, మహితములు = కొనియాడఁదగిన, చిత్రజలయంత్రమందిరములు = జలధారాయంత్రములు గల భవనములును, సరసమగు = రసవంతమైన (తడియారని), చందనము = చందనలేపమును, మణిసముదయములు

(శీతలస్పర్శనముగల మౌక్తికమాలాది) మణిహారముల మొత్తమును, గ్రీష్మమున = ఈ గ్రీష్మర్తువునందు, జనులకున్ = మనుజులకు, అతిసేవ్యములు=మిక్కిలి సేవింపఁదగినవి (అనుభవయోగ్యములు), అగున్ = అగును.

తా. రాత్రులందుఁ జల్లని జాబిల్లి వెలుఁగు లెంతయు హాయినిఁగొల్పు చున్నవి. ఎండవేఁడిమిఁ బోఁగొట్టుట కిండ్లయందుఁ గల జలధారాయంత్రము లెంతో సుఖముం గూర్చుచున్నవి. చల్లని చందనద్రవమును, మౌక్తికమణి హారములును, శరీరమున కెంతేనిఁ జల్లఁదనమును గల్గించుచున్నవి. ఇట్టి గ్రీష్మర్తు వెల్లరికి ననుభవయోగ్యముగదా!

సువాసితం హర్మ్యతలం మనోహరం
ప్రియా ముఖోచ్ఛ్వాస [1]వికంపితం మధు।
సుతంత్రిగీతం మదనస్యదీపనం
శుచౌ నిశీథేఽనుభవన్తి కామినః॥ 3

ప్రియముఖోచ్ఛ్వాసములను గంపిల్లుమధువు
మారదీపకమగు విపంచీరవమ్ము
సౌరభమనోహరోత్తుంగసౌధతలము
లనుభవింతురు వలపుకాం డ్రర్ధనిశల.

టీ. ప్రియ = ప్రియురాండ్రయొక్క, ముఖ = ముఖములనుండి వెడలు, ఉత్ + శ్వాసములను = నిట్టూర్పుగాడ్పులవలన, కంపిల్లు = కదల్పఁబడిన, మధువున్ = మద్యమును, మారదీపకము + అగు = కామ ప్రేరకమగు, విపంచీరవమ్మున్ = వీణానాదమును, సౌరభ = పరిమళముతో నిండిన, మనోహర = రమణీయమైన, ఉత్తుంగ = ఎత్తైన, సౌధతలమున్ = మేడపైభాగమును (ఉప్పరిగ), అర్ధనిశలన్ = నడిరేయిని, వలపుకాండ్రు = విటులు, అనుభవింతురు = అనుభవించెదరు.

1 వికల్పితం.

తా. ఈ గ్రీష్మమున, నగరేలఁ గాముకులు తమ ప్రియురాండ్రతోఁ గూడి పరిమళద్రవ్యభరితములైన మేడల పైభాగములందు శయనించి, ప్రియురాండ్రాలాపించు వీణా నాదములకుఁ జొక్కి సోలి యుందురు. కాముకు లన్నరో, పగటి యొండ వేఁడిమికి నుడిగిన రత్యుత్కంఠత నుద్దీపింపఁ జేయు మద్యమును గ్రోలియుందురు. అట్టివారిని ముద్దుకొనఁబోయిన ప్రియులు, వారి నిట్టూర్పు గాడ్పులచేఁ గలిగిన మద్యగంధమునఁ గై పెక్కి వారితో సంభోగించుచుందురు.

నితంబ బింబైః [1]సదుకూలమేఖలైః
స్తనైః సహారాభరణైః సచందనైః।
శిరోరుహైః స్నానకషాయ వాసితైః
స్త్రియో నిదాఘం శమయన్తి కామినామ్॥ 4

హారచందనయుక్త వక్షోరుహముల
స్నానపరిమళకలిత కేశములగముల
వరదుకూలమేఖలనితంబముల నిపుడు
గాముకులవెట్టఁ దీరురు కాంత లబల!

టీ. అబల=ఓ చెలీ! ఇప్పుడు=ఈ గ్రీష్మమున, కాంతలు=మనోహర రూపములుగల జవ్వనులు, హారచందనయుక్త వక్షోరుహములన్ = ముత్తెపు సరులతోను, జందనలేపముతోను గూడిన కుచముల చేతను, స్నానపరిమళకలిత = స్నానాంతమున సుగంధద్రవ్యముల పొగచేఁ బడి యార్పఁబడి వాని పరిమళములతోఁ గూడిన, కేశముల గములన్ = వెండ్రుకల గుంపుతోను (కొప్పులతోను), వరదుకూల = శ్రేష్ఠమైన దువ్వలువలతో, మేఖల = ఒడ్డాణములతోఁ గూడిన, నితంబములన్ = పిఱుఁదుల చేతను, కాముకుల వెట్టన్ = కామాతురులైన పురుషుల తాపమును, తీర్తురు = పోఁగొట్టుదురు.

1 సుదుకూల.

తా. ఓ చెలీ! ఈ గ్రీష్మమున యువతీయువకు లేకశయ్యాగతులై యుండునెడ, ముత్తెపు సరులతో నలంకరింపఁబడి, చందనపంక లిప్తమగు ప్రియురాలి కుచస్పర్శనముచేఁ బ్రియుని మదనతాప ముపశమించుచున్నది. ప్రియురాలి కబరీభరమునుండి వెడలు కస్తూరితావు లాతని కెంతో హాయినిఁ గూర్చుచున్నవి. ఆ మదవతి పిఱుందులపైని మెత్తని వలువలు తగిలినంతనే యాతని మేనెల్లఁ జల్లఁబడుచున్నది. వివిధరతిబంధముల నాజవ్వని మొలనూలి చిఱుగంటల సద్దు వినినంతనే యాతని కెంతో యానందము గల్గుచున్నది. ఈ విధముగఁ బ్రేయసీప్రియు లిష్టోపభోగలాలసులై యున్నారు.

నితాంత లాక్షారసరాగ [1]రంజితైః
నితంబినీనాం చరణైః సనూపురైః।
పదే పదే హంసరుతానుకారిభిః
జనస్య చిత్తం క్రియతే సమన్మథమ్। 5

ప్రచురలాక్షారసనితాంతరంజితముల
నూపురాఢ్యమ్ముల నితంబినీపదాలఁ
బ్రతిపదము హంసనిరుతానువర్తనముల
జనులమనములు సహమనోజమ్ములయ్యె.

టీ. ప్రచుర=దట్టమైన, లాక్షారస = లక్కపూఁతచే, నితాంత = మిక్కిలి, రంజితములు=మనోజ్ఞములు, నూపుర + ఆఢ్యమ్ములు=అందెలతో నలంకరింపఁబడినవి, ప్రతిపదము = మాటిమాటికి, హంసనిరుత = రాయంచ సవ్వడిని, అనువర్తనము = అనుకరించునవి (అగునట్టి), నితంబినీపదాలను = జఘనభారాలసలైన జవరాండ్ర కాలినడకలం గాంచి, జనులమనములు = ప్రేక్షకుల చిత్తములు, సహమనోజమ్ములు=మన్మథోద్దీపితములు, అయ్యెన్ = ఆయెను.

1 లోహితైః.

తా. ఎఱ్ఱని లత్తుక పూఁతచే నొప్పుచు, మాటిమాటికి మ్రోయు నందెల రవళిచే రాయంచరవముల ననుకరించుచున్న మందయానల పాదములను గాంచినంతనే ప్రేక్షకుల చిత్తములు మదనపరవశము లగుచున్నవి. ఇఁకఁ దనువెల్లఁ గాంచిన నెట్లుండునో గదా!

పయోధరాశ్చందన పంక [1]చర్చితాః
తుషార గౌరార్పిత హార శేఖరాః।
నితంబ బింబా[2]శ్చల హేమ మేఖలాః
ప్రకుర్వతే కస్య మనో న సోత్సుకమ్॥ 6

హారితుషారగౌరవర
హారయుతంబులు చందనద్రవ
స్ఫారవిచర్చితంబులగు
చన్గవ, ఉజ్జ్వలజాతరూపకాం
చీరుచిరంబులౌ జఘన
సీమలు, బింబసమాధరంబు లె
వ్వారిమనంబు నుత్సుకము
వారక సల్పవు? కామినీమణీ!

టీ. కామినీమణీ! హారి = మనోహరమైన, తుషారగౌర = మంచువలెఁ దెల్లనైన, వర = శ్రేష్ఠమైన, హారయుతంబులు = మౌక్తికహారములతోఁ గూడినవియు, చందనద్రవ = చందనలేపముచే, స్ఫార = ప్రకాశించునట్లు, విచర్చితంబులు = ఎక్కువగాఁ బూయఁబడినవియు, అగు, చన్ + కవలు = కుచయుగములును, ఉత్ + జ్వల = మిక్కిలి

1 శీతలాః. 2 దేశాశ్చ సహేమః.

ప్రకాశించుచున్న, జాతరూప = బంగారుతోఁ జేయఁబడిన, కాంచీ = మొలనూలుచే, రుచిరంబులు + ఔ = రమణీయములైన, జఘనసీమలు = (విశాలములైన) పిఱుఁదుప్రదేశములును, బింబసమ = దొండపండువలె నెఱ్ఱనైన, అధరంబులు = పెదవులును, ఏ + వారిమనంబున్ = ఎవ్వరి మనస్సులందు, ఉత్సుకమున్ = ఉత్సాహమును, వారక = నిశ్చయముగా, సల్పవు? = కలిగింపవు?

తా. మదవతీ! మంచువలెఁ దెల్లనివియుఁ జల్లనివియునైన ముత్తెపుసరులచే నలంకరింపఁబడి శీతలపరిమళభరితమైన చందనపంకలిప్తములగు చన్నవలును, వెలఁగొంకు మొలనూళ్లచే నలంకరింపఁబడిన గొప్ప పిఱుందులును, దొండపండువంటి యెఱ్ఱని పెదవులును ఎట్టివానికైన నుత్సాహము రేకెత్తించునుగదా! (చందనమణిహారకాంచీదామభూషితలైన జవ్వనులఁ గాంచి యువకులచిత్తములు పల్లవించుచున్నవని భావము.)

[1]సముద్గతస్వేదచితాంగసంధయో
విముచ్య వాసాంసి గురూణి సాంప్రతం।
స్తనేషు తన్వంశుక మున్నత స్తనా
నివేశయంతి ప్రమదాః సయౌవనాః। 7

ప్రమద లున్నతకుచలు జవ్వనులు కాంత!
యంగసంధుల స్వేదమ్ము లలముకతన
గురువులగు చేలముల వీడి గుబ్బలందు
నృగాఁ దన్వంశుకముల ధరింతురిపుడు.

టీ. కాంతా! ఇపుడు, ప్రమదలు = కామోన్మత్తలును, ఉన్నతకుచలు = (ఎత్తుగా) నిక్కిన పాలిండ్లు గలవారును (ఐన), జవ్వనులు = ఎలప్రాయంపుబోంట్లు, అంగసంధులన్ = అంగము లొండొంటితోఁ

1 సముద్యత.

గలియు చంకలు మొదలైన తావులందు, స్వేదమ్ములు = చెమ్మటలు, అలముకతనన్ = వ్యాపించిన కారణమున, గురువులు + అగు = దట్టమైన, చేలములన్ = వస్త్రములను, వీడి = వదలిపెట్టి, గుబ్బలు + అందు = చనుల పైన, తను + అంశుకములన్ = పల్చని వలువలను, ధరింతురు = తాల్తురు.

తా. కాంతా! ఈ గ్రీష్మమున, మదవతులు బాహుమూలాద్యంగసంధులు నిదాఘఘర్మనిక్తము లగుటంజేసి, దట్టమైన పుట్టముల వీడి, పాలిండ్లపై వలిపెంపుఁబయ్యెదల వైచికొని విహరించుచుందురు.

సచందనాంబు వ్యజనోద్భవానిలైః
సహారయష్టిస్తన మండలార్పణైః[1]।
సవల్లకీకాకలి గీత నిస్వనైః
ప్రబుధ్యతే సుప్త ఇవాద్య మన్మథః॥ ౮

చెలువరో! చందనాంబుపరి
షిక్తమృదువ్యజనైకసంభవా
నిలముల, వల్లకీనిచయ
నిర్గలకాకలి గీతికాస్వనం
బుల, సనహారయష్టిపరి
భూషితసుస్తనమండలార్పణం
బుల, మదనుండు సుప్తుఁడు ప్ర
బోధితుఁ డయ్యె నిదాఘవేళలన్.

టీ. చెలువరో! = ఓ చెలీ! నిదాఘవేళలన్ = గ్రీష్మర్తువునందు, చందన + అంబు + పరిషిక్త = చందనద్రవముతోఁ దడుపఁబడిన, మృదు వ్యజన + ఏక = మెత్తని విసనకఱ్ఱలతో వీచుటవలననే, సంభవ = కలిగిన, అనిలములన్ = గాలులచేతను, వల్లకీనిచయ = వీణాసమూహములయొక్క,

1 అర్పితైః.

నిర్మల = అపస్వరరహితమైన, కాకలి = అవ్యక్తమధురమైన, గీతికాస్వనంబులన్ = గానాలాపముచేతను, నవహారయష్టి = క్రొత్త ముత్తెపుఁ జేరులతో, పరిభూషిత = శ్రేష్ఠముగా నలంకరింపఁబడిన, స్తనమండల + అర్పణంబులన్ = గుబ్బపాలిండ్ల నొసంగుటచేతను, సుప్తుఁడు = నిద్రితుఁడైన, మదనుండు = మన్మథుఁడు, ప్రబోధితుఁడు = మేల్కొల్పఁబడినవాఁడు, అయ్యెన్ = ఆయెను.

తా. చెలీ! గ్రీష్మమున నెండతాఁకునకు నుత్సాహ ముడిగిన యువకులకుఁ బ్రియురాండ్రు చందనపునీటఁ దడిపిన విసనకఱ్ఱలతో వీచి చల్లనిగాలిని మెసోఁకఁజేసియు, వీణియలమీటి మధురగానాలాపనచేసియు, ముత్తెపుసరులతోడి పలిగుబ్బపాలిండ్ల దనంటఁ గౌఁగిలించియు, మదనోన్మాదమును రేకెత్తించుచున్నారు. ఇట్టిచేష్టలచే నిద్రించిన మన్మథుఁడే మేల్కొనినట్లున్నాఁడు.

సితేషు హర్మ్యేషు నిశాసు యోషితాం
సుఖప్రసుప్తాని ముఖాని చంద్రమాః।
విలోక్య[1] నూనం భృశముత్సుకశ్చిరం
నిశాక్షయే యాతి హ్రియేవ[2] పాండుతామ్. 9

కలువల ఱేఁడు మిక్కిలి సు
ఖంబుగ రాతిరి వేళఁ దెల్లమే
డలపయి నిద్రవోయెడు ప
డంతుల నిద్దపుముద్దుమోములం
బలుమఱు నుత్సుకత్వమునఁ
బాఱఁగఁ జూచి నిశాక్షయంబునన్
బలితపు సిగ్గుచేత వలెఁ
బాండిమఁ గాంచుఁ గ్రమక్రమంబుగన్.

1 నిర్యంత్రణం. 2 ఏవ.

టీ. రాత్రివేళన్ = రాత్రులందు, తెల్లమేడలపయి నిద్రవోయెడు= సౌధాగ్రభాగములఁ బరుండి నిద్రించుచుండు, పడంతుల = స్త్రీలయొక్క, నిద్దపుముద్దుమోములన్ = కాంతివంతములై ముద్దులొలుకుచున్న మోములను, ఉత్సుకత్వమునన్ = ఉత్సాహాతిశయముచే, పలుమఱు = పెక్కుతడవలు (అదేపనిగ), పాఱన్ + కన్ + చూచి=తుదముట్టఁజూచి, బలితపుసిగ్గుచేత వలెన్ = పెల్లగ సిగ్గిలినాఁడో యనునట్లు, కలువలఱేఁడు = చంద్రుఁడు, నిశాక్షయంబునన్=రాత్రి చివరిభాగమున (వేగుజామున), పాండిమన్ + కాంచున్ = వెలవెలఁబోవుచున్నాఁడు.

తా. రాత్రులందు మేడల పైభాగములందు నిద్రించుచున్న ముద్దియల ముద్దుమోములను గాంచి, చెందురుఁడు తాను వానికి సాటిరానను సిగ్గుచేతనో యనునట్లు వేగుజామున వెల్వెలఁబారుచున్నాఁడు. హాయిగా నిద్రించుచున్న యా జవ్వనుల మోములు చందమామకంటె నందముగా నున్నవి. నిష్కళంకములైన వారి ముఖములంగాంచి కళంకియైన చంద్రుఁడు సిగ్గుపడు చున్నాఁడు.

అసహ్య[1]వాతోద్ధత రేణుమండలా
ప్రచండ సూర్యాతప తాపితా మహీ।
న శక్యతే ద్రష్టుమపి ప్రవాసిభిః
ప్రియావియోగానల దగ్ధమానసైః॥ 10

అంతకు నంతకిత్తఱిఁ బ్రి
యావిరహానలదగ్ధచిత్తులై
వంతకుఁ జిక్కి పొక్కెడు ప్ర
వాసులు దేటి కనంగఁజాల ర
త్యంత ఖరప్రభాకర క
రాతపతాపితయున్ నితాంతదు

1 వాతోద్గత.

ర్దాంతనభస్వదుద్ధతప
రాగవితానయు నౌవసుంధరన్.

టీ. ఈ + తఱిఁ = ఈ గ్రీష్మమున, ప్రియావిరహ + అనల = ప్రియులతో నెడఁబాసియుండుట అనెడి నిప్పుచేత, దగ్ధ = దహింపఁబడిన, చిత్తులై =మనస్సుకలవారై, ప్రవాసులు= కార్యవశమున వేర్వేఱు తావులను జిక్కియుండు ప్రేయసీప్రియులు, వంతకున్ =(మన్మథ) బాధకు, చిక్కి= లొంగి, పొక్కుడు = దుఃఖించుచున్నవారై, అంతకున్ + అంతకున్ = ప్రొద్దెక్కుకొలఁది, అత్యంతఖర=మిక్కిలి తీక్ష్ణమైన, ప్రభాకరకర=సూర్య కిరణములయొక్క, ఆతప = వేఁడిచే, తాపితయున్ = క్రాఁగినదియు, నితాంత = ఎడతెగని, దుర్దాంత = నివారింపరాని, నభస్వత్ + ఉత్ + ధత = గాలిచే మిక్కిలి లేపఁబడిన, పరాగవితానయున్ = ధూళి సంచయముతోఁ గూడినదియు, ఔ = అయినట్టి, వసుంధరన్=భూమిని, తేఱి = ఎదుటనిలిచి, కనన్ + చాలరు = చూడలేరు.

తా. ప్రొద్దెక్కుకొలంది వేఁడియైన సూర్యకిరణములచేఁ గ్రాఁగి నదియు, వేఁడి గాడ్పులచే లేపఁబడిన దుమ్ముతో నిండినదియు నగు భూమిని విరహానల తప్తులైన ప్రవాసులు చూడలేకున్నారు. [మొదలే విరహానల తప్తులగుటచే నంతకంటె వేఁడియైన భూమిపై వారడుగిడలేకున్నారు. తక్కిన వారన్ననో, రాఁబోవు రాత్రినిఁ దమకు లభింపనున్న ప్రియాలింగన సౌఖ్యమును దలంచుకొని, యెట్టకేల కాకాఁక నోర్చుకొనుచున్నారు. ప్రవాసులకన్న నట్టియాశ లేదుగదా!]

మృగాః ప్రచండాతప తాపితాభృశం
తృషామహాత్యా పరిశుష్కతాలవః।
వనాంతరే తోయమితి ప్రధావితా
నిరీక్ష్య భిన్నాంజన సన్నిభం నభః॥ 11

మిగుల నెండలఁ దపియించి మృగకులంబు
పెల్లు దప్పిని దౌడలు బెండువాఱ

భిన్నకజ్జలనిభనభోవీథిఁ గాంచి
వారి యని వనాంతరములఁ బరువులెత్తు.

టీ. మిగులన్ = మిక్కుటమైన, ఎండలన్ = ఎండవేఁడిమికి, తపియించి = తాపమునొంది, పెల్లు = అధికమైన, దప్పిని = దాహముచేత, దౌడలు = తాలువులు, బెండువాఱన్ = ఎండిపోవఁగా, మృగకులంబు = జింకలగుంపు, భిన్నకజ్జలనిభ = నూరఁబడిన కాటుకతో సమానమైన, నభోవీథిన్ + కాంచి = ఆకాశమును జూచి, వారియని = నీళ్లని భ్రమపడి, వన + అంతరములన్ = అడవులలో, పరువులెత్తున్ = పరుగిడుచున్నవి.

తా. ఎండవేఁడిమికి సైఁపలేక దప్పిఁ దీర్చుకొనుటకు నీళ్లెందుఁ గలవో యని యరయు జింకలు, ఎండవెలుఁగులలోఁ బ్రతిఫలించిన నల్లని యాకాశపురంగును గని జలము లను భ్రాంతిచే నడవులలో నటునిటుఁ బరు గెత్తుచున్నవి.

సవిభ్రమైః సస్మిత జిహ్మవీక్షితైః
విలాసవత్యో మనసి ప్రవాసినాం।
అనంగ సందీపన మాశు కుర్వతే
యథా ప్రదోషాః శుచిచారుభూషణాః॥ 12

సలలితవిభ్రమంబులగు
సస్మితవక్రవిలోకనంబులం
బలుమఱు ముద్దుగుమ్మలు ప్ర
వాసుల చిత్తములన్ క్షణంబులో
పల వనవిల్తుబాణముల
పాల్పడఁజేయుదు రిష్టు: యామినీ
శ లసితభూషణంబులయి
సాగుప్రదోషము లట్లు నెచ్చెలీ!

టీ. నెచ్చెలీ!=ప్రియురాలా! ఇప్డు=ఈ గ్రీష్మఋతువునందు, ముద్దుగుమ్మలు = అందకత్తెలు, యామినీశలసితభూషణంబులు + అయి = చంద్రుఁడను మనోహరమైన యాభరణముతోఁ గూడినవై, సాగు = కడచుచున్న, ప్రదోషములు + అట్లు = సంధ్యాకాలములవలె, సలలితవిభ్రమంబులు + అగు = మనోజ్ఞ చలనముగలిగిన, సస్మిత = చిఱునవ్వుతోఁగూడిన, వక్రవిలోకనంబులన్ = వాలుఁజూపులచే, పలుమఱు= మాటిమాటికి, ప్రవాసులచిత్తములను=వియోగుల మానసంబులను, క్షణంబులోపలన్ = క్షణకాలములోనే, ననవిల్తు బాణముల=మన్మథబాణములకు, పాల్పడన్ + చేయుదురు= గుఱిగావించెదరు.

తా. నెచ్చెలీ! ఈ గ్రీష్మమున, వియోగులు పగలెల్ల నెండవేఁడిమి నెట్లో యోర్చి, సంజవేళలనైనఁ జల్లగాలికి శ్రమదీర్చుకొందురనినఁ జంద్రోదయము కాఁగానే వారి చిత్తములు ప్రియాయత్తములై మఱింత క్షోభిల్లుచున్నవి. అట్టితఱి, నెలనవ్వోలకఁబోయుచు ఱెప్పలల్లార్చుచు, వాలుఁజూపులఁ దమ్ముఁగను పెఱముద్దియలఁ గాంచినంతనే వారితాప మినుమడిఁగొనుచున్నది.

రవేర్మయూఖైరభితాపితో భృశం
విదహ్యమానః పథి తప్తపాంసుభిః।
అవాఙ్ముఖో జిహ్మగతిః శ్వసన్ముహుః
ఫణీ మయూరస్యతలే నిషీదతి॥ 13

వెలుఁగుల తేని వెల్లునెఱ
వేఁడిమికిన్ గడుఁ జిక్కి త్రోవలన్
నెలకొను తప్తపాంసువుల
నిర్భరతం దపియించు చూర్పుచున్
బలుమఱు వక్రరీతుల న
వాఙ్ముఖమై చనుచున్న పాము ల

ర్శిలిని మయూరబర్హముల
క్రిందఁ బరున్నవి విశ్రమార్థమై.

టీ. వెలుఁగులతేని = సూర్యునియొక్క, వెల్గు = కాంతి (ఎండ) వలనఁబుట్టిన, నెఱవేఁడిమికిన్ = మిక్కుటమైన సెగకు, కడున్ + చిక్కి = మిక్కిలి కృశించి, త్రోవలన్ = దారియందు, నెలకొను = ఉన్నట్టి, తప్తపాంసువులన్ = క్రాఁగిన దుమ్మువలన, నిర్భరతన్ = ఓర్వరానట్లు, తపియించుచున్ = తాపమునొందుచు, ఊర్పుచున్ = రొజుచు, పలుమఱున్ = మాటిమాటికి, వక్రరీతులన్ = వంకరగా, అవాక్ + ముఖము + ఐ = తలను (పడగను) వంచినదై, విశ్రమ + అర్థము + ఐ = నీడపట్టునఁజేరి శ్రమ దీర్చుకొను తలంపుతో, పాములు, అర్కిలిన్ = ప్రీతితో భయ ముడిగి, మయూరబర్హముల క్రిందన్ = నెమిలి పింఛములనీడను, పరున్నవి = పండుకొని యున్నవి.

తా. సూర్యకిరణములు పైనఁ గాల్చుచుండ, వేఁడిదుమ్ము క్రిందఁ గాల్చుచుండ తీక్ష్ణతకుఁ దట్టుకొనలేక, పాములు పడగలను వాల్చి, రొజుచు నెమిళ్ల పింఛములనీడన శ్రమదీర్చుకొనుచున్నవి. తమ్ముఁ జంపునవని యెఱిఁగియుఁ బాములు నెమిళ్లపజ్జకే పోవుటకుఁ గారణము మిక్కుటమైన యెండకోర్వలేకపోవుటయే. శత్రుభయముకంటె నెండవేఁడియే బాధాకరముగా నున్నది. ఎండకుసొమ్మసిల్లిన నెమిళ్లచెంతకుఁ బాములు వచ్చుటయు గమనింపలేకున్నవి.

తృషా మహత్యా హతవిక్రమోద్యమః
శ్వసన్ముహు[1]ర్దూర విదారితాననః।
న హంత్యదూరేపి [2]గజా[3]న్మృగేశ్వరో
విలోల జిహ్వా[4]శ్చలితాగ్రకేసరాః॥ 14

1 భూరి. 2 మృగం. 3 మృగాధిపః. 4 చలితస్య కేసరః

చుఱచుఱఁ గాల్చు వేఁడిమికి
స్రుక్కి తృషన్ దనవిక్రమోద్యమ
స్ఫురణము దూల మాటికిని
జూలకొనన్ నరాఁచుచు నాల్కనార్చుచున్
విరివిగ నోరు విచ్చుచు వ
నిం జరియించు మృగాధిపుండు ద
గ్గఱఁ జెరలాడు నేన్గులను
గాంచియుఁ జీల్పఁడు నేఁడు కోమలీ!

టీ. కోమలీ! నేఁడు = ఈ గ్రీష్మమున, చుఱచుఱన్ (మండుట యందు ధ్వన్యనుకరణము), కాల్చు = దహించుచున్న, వేఁడిమికిన్ = ఎండకు, స్రుక్కి = అలసిపోయి, తృషన్ = దప్పిచేత, తన = తన యొక్క విక్రమ + ఉద్యమస్ఫురణము = పరాక్రమ విజృంభణ ప్రదర్శనము, తూలన్ = నశియింపఁగా, మాటికిని = అదేపనిగ, జూల్ కొనన్ + ఊఁచుచున్ = జూలువెండ్రుకల కొనల నూఁచుచు, నాల్కన్ + అర్చుచున్ = (దప్పిచే) నాలుక వెళ్లఁబెట్టుచు, విరివిగ నోరువిచ్చుచున్ = పెద్దగ నోరు తెఱచుచు, వనిన్ + చరియించు = (నీడపట్టుల వెదుకుచు) అడవిలోఁ దిరుగుచుండు, మృగ + అధిపుండు = సింహము, దగ్గఱన్ + చెరలాడు = తన సమీపమున నే తిరుగుచున్న, ఏన్గులను గాంచియున్ = ఏనుఁగులను చూచినదయ్యు, చీల్పఁడు = వానిని చీల్చి చంపదు.

తా. ఎండవేఁడిని సైఁపలేక, దప్పిచే నాల్క వెళ్లఁబెట్టి రోజుచున్న సింహము, తన చెంతనే తిరుగుచుండు నేనుఁగులఁ గాంచియు వానిఁ జంపు తలంపు నుడిగి యున్నది. సింహము స్వప్నమందు దగుపడినంతనే గుండెలుపగిలి చచ్చు నేనుఁగులు, ఎండకు సొమ్మసిల్లి, ఆ సంగతిని మఱచి సింహముల పజ్జనే చరించుచున్నవి. గ్రీష్మాతపము, క్షుధార్తినేని ప్రాణభీతినేనిఁ దలంపనీయని విధముగా జీవరాశిని స్రుక్కఁజేయుచున్నదని భావము.

విశుష్క[1]కంఠాహృత సీకరాంభసో
గభస్తిభిర్భానుమతోఽభితాపితాః।
ప్రవృద్ధ తృష్ణోపహతా జలార్థినో
న దంతినః కేసరిణోఽపి బిభ్యతి॥ 15

తరణిగభస్తికాండపరి
తప్తములై సరసీవితానశీ
కరసలిలంబు శుష్కతర
కంఠములన్ గొనియుం దృషార్తియే
పారిఁబారి వృద్ధిగాఁగ జల
మున్గొనువాంఛ గజంబులెన్నొ డ
గ్గఱఁ జరియించు కేసరులఁ
గాంచియు నివ్వెఱ నొందవియ్యెడన్.

టీ. ఇయ్యెడన్ = ఈ గ్రీష్మమున, తరణి గభస్తికాండ = సూర్య కిరణ సమూహముచే, పరితప్తములై = మిక్కిలి క్రాఁగినవై, సరసీవితాన = కొలంకులలోని, శీకరసలిలంబులన్ = (ఇంకిపోవుటచే కొలఁదిగానున్న) నీటిబిందువులను, శుష్కతరకంఠములన్ + కొనియున్ = ఎండిపోయిన తొండములతోఁ బీల్చియు, తృష + ఆర్తి + ఏ = దప్పివలని బాధయే, పారిన్ + పారిన్ = మిక్కుటముగా, వృద్ధిగాఁగన్ = ఎక్కువయగుచుండ, జలమున్ + కొను + వాంఛన్ = ఇంకను నీళ్లు ద్రావవలెనను ఆశతో, గజంబులు + ఎన్నొ = ఎన్నో ఏనుఁగులు, డగ్గఱన్ + చరియించు = దాపుననే తిరుగుచున్న, కేసరులన్ + కాంచియున్ = సింహములను జూచియు, నివ్వెఱన్ + ఒందవు = భయపడవు.

తా. ఎండవేఁడిమికి దప్పిగొని, తడియాఱిపోయిన తొండములతోఁ గొలఁకులలోని స్వల్పజలంబులఁ బీల్చియు, దప్పి యడుగమి నింకను నీరు

1 కంఠాహృత, కంఠోద్గత.

ద్రావవలెనని యొక సరస్సునుండి మఱియొక సరస్సునకుఁ బోవుచున్న ఏనుఁగులు, త్రోవలోనున్న సింగములనుగాంచి యించుకయు భయపడకున్నవి. తృషార్తి ప్రాణభీతికంటె నెక్కుడు బాధగూర్చుచున్నది.

హుతాగ్నికల్పైః సవితు[1]ర్గభస్తిభిః
కలాపినః క్లాంతశరీర[2]చేతసః।
న భోగినం ఘ్నన్తి సమీపవర్తినం
కలాపచక్రేషు నివేశితాననమ్॥ 16

అరరె! హుతాగ్నికల్పహరి
దశ్వకరాళికి గాత్రముల్ హృదం
తరములు క్లాంతతం గనఁగఁ
దందరనొందు మయూరవారముల్
స్ఫురితకలాపచక్రముల
లోన ఫణంబులువెట్టు పన్నగో
త్కరములఁ జంపకున్నయవి
దగ్గఱనున్నను నేఁడు కోమలీ!

టీ. అరె + అరె = ఎంత యాశ్చర్యము!, నేఁడు, హుత + అగ్ని కల్ప = మండెడు నిప్పువంటి, హరిత్ + అశ్వ=సూర్యునియొక్క, కర + ఆళికిన్ = కిరణసమూహమువలన, గాత్రముల్ = శరీరములును, హృత్ + అంతరములు = హృదయము లోపలిభాగములును, క్లాంతతన్ + కనన్ + కన్ = వాడిపోవుచుండఁగా, తందరన్ + ఒందుచు = తత్తఱపడుచు, మయూరవారముల్ = నెమిళ్లు, స్ఫురిత=ప్రకాశించుచున్న, కలాపచక్రముల లోనన్ = నెమిలి పురిసముదాయములో, ఫణంబులువెట్టు = పడగలను

1 మరీచిభిః. 2 చేతనాః.

బెట్టుకొనియున్న, పన్నగ + ఉత్కరములన్=పాములగుంపును, దగ్ధఅన్ + ఉన్నను=(తమ) చెంతనే యున్నను, చంపక + ఉన్నయవి=చంపుట మానియున్నవి.

తా. మండుటెండకు వాడిపోయిన యంగములతోఁ దత్తఱపడుచున్న నెమిళ్లు, తమ కాహారములైన పాములు, తమ పింఛములందే పడగలు ముడుచుకొని యున్నను, వానిఁ జంపి తినఁ జాలకున్నవి. పాములు ప్రాణభయమును లెక్కింపక నెమిళ్ల పింఛములలోఁ దల దాఁచుకొనుచున్నవి. కాఁకకు గ్రుక్కిన నెమిళ్లు ఆ సంగతినే గమనింపఁజాలకున్నవి; గమనించినను వానిం జంప శక్తి లేకున్నవి.

[1]సభద్రముస్తం పరిపాండుకర్దమం
సరః ఖనన్నాయత [2]పోత్రమండలైః।
[3]ప్రదీప్తభాసా రవిణాభితాపితో
వరాహయూథో విశతీవ భూతలమ్॥ 17

మహితకిటికోటి, తతపోత్రమండలముల
భద్రముస్తయుతము శుష్కపంకమైన
సరసిఁ ద్రవ్వుచు సూర్యతీక్ష్ణతకుఁ జిక్కి
భూతలములోనఁజొరఁబాఱురీతిఁ దోఁచె.

టీ. మహిత కిటికోటి=పెద్ద పందులు, తతపోత్రమండలములన్=విస్తారమైన (బలిష్ఠమైన) గుండ్రనిముట్టె (మూతికొన)లతో, భద్రముస్తయుతము=భద్రముస్తలతోఁ గూడినదియు, శుష్కపంకము=ఎండిన బురదగలదియు, ఐన=అయినట్టి, సరసిన్=నీటిపడియను, త్రవ్వుచున్=(తుంగముస్తలఁ బెఱుకుటకై మూతితో నేలను) త్రవ్వుచు, సూర్య

1 సుభద్రముస్తం. 2 పోత్ర. 3 రవేర్మయూఖై రభితాపితో భృశం.

తీక్ష్ణతకున్ = సూర్యుని వేడికి, చిక్కి = అలసిపోయి, భూతలములోనన్ = భూమిలోపలికి, చొరన్ + పాఱు = చొచ్చునట్టి, రీతిన్ = విధముగా, తోఁచెన్ = కనఁబడుచున్నవి.

తా. ఎండకుఁ బడియులలోని నీరెల్ల నింకిపోవ, బురదయు నెండి గట్టిపడియుండుటచే నందులోని తుంగముస్తలను బందులు మిక్కిలి శ్రమతోఁ బెల్లగించుచున్నవి. ఆ పందులు ముట్టెలతో నేలం ద్రవ్వుట చూడ, నెండవేడికిఁ దట్టుకొనలేక భూమిలో దాఁగుకొనుటకై మార్గము నేర్పరచుకొనుచున్నవో యనునట్లున్నది.

వివస్వతా [1]తీక్ష్ణతరాంశుమాలినా
స పంకతోయాత్సరసోఽభితాపితః।
ఉత్ప్లుత్య భేకస్తృషితస్య భోగినః
ఫణాతపత్రస్య తలే నిషీదతి॥ 18

ఖరకిరణమాలికల నొప్పు కాఁక వేల్పు
కడిమి తపియింప నడుసగు మడుఁగునుండి
మిట్టిమిట్టాడి భేకంబు కట్టకడకు
శ్రాంతిలెఁ దృషిత ఫణిఫణాచ్ఛత్రసీమ.

టీ. ఖరకిరణమాలికలన్ + ఒప్పు = తీక్ష్ణమైన కిరణసహస్రముచే నొప్పు, కాఁకవేల్పు = సూర్యుఁడు, కడిమితపియింపన్ = మిక్కిలి తాపము గలుగఁజేయఁగా, భేకంబు = కప్ప, అడుసు + అగు మడుఁగునుండి = నీరెండిపోవ బురదతో నిండియున్న మడుఁగులోనుండి, మిట్టిమిట్టి + ఆడి = ఎగిరెగిరిపడి, కడకున్ = కట్టకడపటికి, తృషిత = తాపమునొందిన, ఫణి = పాముయొక్క, ఫణా = పడగయనెడు, ఛత్రసీమన్ = గొడుగునీడను, శ్రాంతిలెన్ = విశ్రమించెను.

1 తీవ్రతర.

తా. సూర్యుని కాఁకకు మడుఁగులలోని నీరెల్ల నింకిపోయి, అడుసుమాత్రము మిగిలియున్నది. ఆ యడుసును వేడిగా నుండుటచేఁ గప్ప దానియందు నిల్వలేక యెగిరి బయటఁబడి యెండ్రుని నీడ గానరామిఁ గడకుఁ బాముపడగనీడను దలదాఁచుకొనుచున్నది. ఎండకు సొమ్మసిల్లిన పాము ఆ విషయమును గమనింపకయే యున్నది. ప్రాణభీతిచేనైనఁ దలంపు నీయకున్నది గ్రీష్మాతపము!

సముద్ధృతా శేష[1]మృణాల జాలకం
విపన్నమీనం ద్రుతభీతసారసం।
పరస్పరోత్పీడన సంహతై ర్గజైః
కృతం సరః సాంద్రవిమర్దకర్దమమ్॥ 19

కరిచయంబు పరస్పరం బొరసి చొరఁగ
మిగులవెఱ బెగ్గురులు పాఱె మీలు మడిసెఁ
దమ్మితూండ్లన్నియు సముద్ధృతమ్ములయ్యె
మడుఁగు దట్టంపు టడుసయ్యె మవ్వమేది.

టీ. కరిచయంబు = ఏనుఁగుల గుంపు, పరస్పరంబు = ఒండొంటిని, ఒరసి = రాచుకొని, చొరఁగన్ = ప్రవేశింపఁగా, బెగ్గురులు = బెగ్గురులను నీటిపక్షులు, మిగుల వెఱన్ = మిక్కిలి భయముతో, పాఱెన్ = పరుగెత్తిపోయెను, మీలు = చేఁపలు, మడిసెన్ = చచ్చెను, తమ్మితూండ్లు + అన్నియు = తామరకాడలన్నియు, సమ్యక్ + ఉత్ + ధృతంబులు + అయ్యెన్ = మొదలంటఁ బెకలింపఁబడిన వయ్యెను, (ఇందువలన) మడుఁగు, మవ్వము + ఏది = సొంపుదఱిగి, దట్టంపు + అడుసు + అయ్యె = దట్టమైన బురదతో నిండిన దయ్యెను.

1 మృణాళ.

తా. ఎండకుఁ దాళలేక యేనుఁగులు గుంపులు గుంపులుగా మడుఁగులలోఁ జొరఁబడి పొరలాడుచున్నవి. వానింగాంచి బెగ్గురుపిట్టలు భయపడి పాఱిపోవుచున్నవి. ఆ యేనుఁగుల కాళ్లక్రింద నలిఁగి చేఁపలు చచ్చిపోవుచున్నవి. ఇట్లు అల్లకల్లోలమై మడుఁగంతయు బురదతో నిండి పోయినది.

రవిప్రభోద్భిన్న శిరోమణిప్రభో
విలోలజిహ్వాద్వయలీఢమారుతః।
విషాగ్ని సూర్యాతపతాపితః ఫణీ
నహన్తి మండూకకులం తృషాకులః॥ 20

రవివిభోద్భిన్ననిజఫణారత్నకాంతి
అతిచల రసనాద్వయవిలీఢానిలమ్ము
విషదహనరవిద్యోతతాపితమునైన
సర్పము తృషార్తిఁ బ్లవతతిం జంపదిపుడు.

టీ. రవివిభ = సూర్యకాంతి (వేఁడి)చే, ఉత్ + భిన్న = మిక్కిలి పగులఁగొట్టఁబడిన (అనఁగా జ్వలింపఁజేయఁబడిన), నిజ = తనదైన, ఫణా = పడగమీఁది, రత్న = మణియొక్క, కాంతి = కాంతిగలదియు, అతిచల = మిక్కిలి చలించు, రసనాద్వయ = రెండు నాల్కలచేతను, విలీఢ = నాకఁబడిన, అనిలమ్ము = గాలి గలదియు, విషదహన = తన నోటిలోని విషమే మండుటచేతను, రవిద్యోత = సూర్యుని యెండచేతను, తాపితమున్ = తాపము నొందినదియు, ఐన, సర్పము = పాము, తృష + ఆర్తిన్ = దాహపీడచే, ఇపుడు = ఈ గ్రీష్మమున, ప్లవతతిన్ = కప్పలను, చంపదు.

తా. మిక్కిలి తీక్ష్ణమైన యీ యెండకుఁ బాము పడగమీఁది మణి వేఁడెక్కి మండుచున్నది. దాని నోటిలోని విషము సైతము కరఁగి వేఁడి నుగుచున్నది. పైనను లోపలనుగూడ వేఁడి దుర్భరమగుటచే సర్పరాజు

నాల్కలల్లార్చుచుఁ జెంతనున్న కప్పలనుగూడ చంపలేని దుస్థితిలో నున్నది.

సఫేన [1]లాలావృతవక్త్రసంపుటం
[2]వినిర్గతాలోహిత జిహ్వా[3]మున్ముఖం।
తృషాకులం నిఃసృతమద్రి [4]గహ్వరా
[5]దవేక్ష్యమాణం మహిషీకులం జలమ్॥ 21

నురుఁగులతోఁడి పెను వెడఁద
నోళుల విచ్చి, చలంతి జేవుఱు
న్మెఱుఁగుల నీనునాలుకలు
మెల్లఁగఁ జాఁచుచు. మోరలెత్తి దు
ర్భరమగు తృష్ణచే నదిగొ
బఱ్ఱెలగుంపు మహోన్నతాద్రిగ
హ్వారములనుండి వెల్వడి జ
లార్థము వచ్చెడుఁ జూడు నెచ్చెలీ!

టీ. నెచ్చెలీ! నురుఁగులతోఁడి = నురుఁగులు గ్రక్కుచున్న, పెన్ వెడఁద = మిక్కిలి పెద్దవైన, నోళులన్ + విచ్చుచున్ = నోళ్లు తెఱచుచు, అలంతి = కొంచెము, జేవుఱున్ + మెఱుఁగులన్ + ఈను = ఎఱ్ఱని కాంతులను వ్యాపింపఁజేయు, నాలుకలు = నాలుకలను, మెల్లఁగన్ + చాఁచుచున్ = మెల్లఁగా వెళ్లఁబెట్టుచు, మోరలు + ఎత్తి = మెడ లెత్తుకొని, బఱ్ఱెలగుంపు, దుర్భరము + అగుతృష్ణన్ = భరింపరాని దాహముచే, మహా + ఉన్నత + అద్రిగహ్వరములనుండి = పెద్ద కొండగుహలలోనుండి, వెల్వడి = వెలుపలికి

1 లోలాయత. 2 వినిస్సృతా. 3 ఉత్సుకం. 4 కందరాత్. 5. గవేషమాణం.

వచ్చి, జలార్థము = నీటికొఱకు, వచ్చెడున్ = వచ్చుచున్నవి, చూడు = కనుఁగొనుము.

తా. చెలీ! ఎండకు నోర్వక, బత్తెలు కొండగుహలలో దాఁగు కొనియు, దప్పికోర్వక నోట నురుఁగులు గ్రక్కుచు, నాల్కల వెళ్లఁ బెట్టుచు, మోర లెత్తుకొని నీళ్లెక్కడ దొరకునాయని గుహలలోనుండి వెలుపలికి వచ్చుచున్నవి చూడుము.

పటుతర[1]దవదాహోచ్ఛుష్క[2]సస్యప్రరోహాః
పరుషపవన[3]వేగోత్క్షిప్త సంశుష్కపర్ణాః।
దినకర[4]పరితాపక్షీణతోయాః సమంతా
ద్విదధతి భయముచ్చైర్వీక్ష్యమాణా వనాంతాః॥ 22

స్ఫురదురుదావపావకవి
శుష్కతృణాంకురజాలముల్ రట
త్పరుషమరుద్రయోద్ధృత త
తద్రుమశీర్ణపలాశముల్ దినే
శ్వరకర కాండపీతజల
సంచయముల్ వనసీమలిప్డు చూ
పఱకును బెట్టువెఱ్ఱి గొలుపుఁ
బైఁబయిఁ గన్గొనినట్ దలోదరీ!

టీ. తలోదరీ! = తన్వీ! స్ఫురత్ = ప్రజ్జ్వలించుచున్న, ఉరు = గొప్పదైన, దావపావక = కాఱుచిచ్చువలన, శుష్క = మాఁడిపోయిన, తృణ + అంకురజాలముల్ = గడ్డిమొక్కలు గలవియు, రటత్ = చలించుచున్న, పరుష = బెట్టుగొన్న, మరుత్ = గాలియొక్క, రయ = వేగము

1 దవదాహోచ్ఛుష్క. 2 శష్ప. 3 వేగాత్. 4 పరితాపాత్.

వలన, ఉత్ + ధృత = పెల్లగింపఁబడిన, తత = విస్తారమైన, ద్రుమ = చెట్లయొక్క, శీర్ణ =(ఎండి) రాలిపోయిన, పలాశముల్ =ఆకులు గలవియు, దినేశ్వర = సూర్యునియొక్క, కరకాండ = కిరణసమూహముచేత, పీత = త్రావఁబడిన, జలసంచయముల్ = జలప్రవాహములు గలవియు, (అగు), వనసీమలు = అరణ్యములు, ఇప్డు = ఈ గ్రీష్మమున, చూపఱకును = చూచువారలకు, పైఁ + పయిన్ + కన్ + కొనినన్ = పైపయిఁ జూచినంత మాత్రనే, పెన్ + వెఱన్ + కొలుపున్ = మిక్కిలి భయమును గలిగించును.

తా. చెలీ! కార్చిచ్చు మంటలచే గడ్డిమొక్కలు కాలిపోవుచున్నవి. సెగగాలికి పెండుటాకు లెగిరిపోవుచున్నవి. సూర్యుని కాఁకకు మడుఁగులలోని నీరడుగంటుచున్నది. ఇట్టి దారుణదృశ్యములతో నిండి యరణ్యములు చూచుటకు భయము గొల్పుచున్నవి.

శ్వసితి విహగవర్గః శీర్ణపర్ణద్రుమస్థః
కపికులముపయాతి క్లాంతమద్రే[1]ర్నికుంజం।
భ్రమతిగవయయూథః సర్వతస్తోయమిచ్ఛన్
శరభకుల మజిహ్మం ప్రోద్ధరత్యంబుకూపాత్॥ 23

కోఁతులగుంపు దప్పిగొని
కొండపొదళ్ళను జేరె, విష్కిర
వ్రాతము శీర్ణపర్ణతరు
పంక్తుల నూర్చుచునుండె, నీటికై
యాతురతన్ భ్రమించె గవ
యవ్రజ మెల్లెడలందుఁ, గూపసం
ఘాతజలంబులన్ శరభ
కాండ మవక్రతఁ బ్రోద్ధరించెడిన్.

1 నికుంజే.

టీ. కోఁతులగుంపు, దప్పిగొని, కొండపాదళ్లను జేరి=కొండలకు ప్రక్కనున్న పొదలలోఁ దూఱుచున్నవి, విష్కిరవ్రాతము = పక్షిసమూహము, శీర్ణపర్ణ = ఎండు టాకులతోఁ గూడిన, తరుపంక్తులన్ = చెట్ల గుంపులమీఁద, ఊర్చుచున్ + ఉండెన్ = రొజుచున్నవి, గవయవ్రజము = గురుపోతులమందలు, నీటికై = నీటికొఱకు, ఎల్ల + ఎడల + అందున్ = అన్నిచోట్లకును, ఆతురతన్ = మిక్కిలి యాశతో, భ్రమించెన్ = తిరుగుచున్నవి, శరభకాండము = శరభమృగసమూహము, అవక్రతన్ = అనాయాసముగా (తెక్కలుండుటచే, కూపసంఘాతజలంబులన్ = బావులలోని నీళ్లను, ప్ర + ఉత్ + ధరించెడిన్ = పైకిఁ దెచ్చుకొనుచున్నవి.

తా. ఎండతాఁకునకు నోర్వక, కోఁతులు పొదలలో దాఁగుచున్నవి. పక్షు లెండిపోయిన చెట్లపైఁ గూర్చుండి రొజుచున్నవి. గురుపోతులు నీటికై యాతురతతో వెదుకుచున్నవి. శరభములుమాత్రము తెక్కలు గలవగుటచే, బావియడుగున నుండు నీటినిఁ బైకిఁ గొనివచ్చి త్రాఁగఁ గల్గుచున్నవి.

వికచనవకుసుంభ స్వచ్ఛసిందూరభాసా
[1]ప్రబలపవనవేగోద్భూతవేగేన తూర్ణం।
తరువిటపలతాగ్రా[2]లింగనవ్యాకులేన
దిశిదిశిపరిదగ్ధా భూమయః పావకేన॥ 24

స్ఫుటతరమౌ కుసుంభసుమ
ముఁ వలె నిద్దపుసిందురంపుని
గ్గటుల జ్వలించుచుఁ బృథుబ
లానిల తూర్ణవివృద్ధవేగమై

1 పరుష. 2 లతాగ్రా.

కుటవిటపంబులఁ లతల
క్రొందుదలఁ దమిఁ గౌఁగిలించుచుం
బెటపెట వహ్ని దిక్కులను
బ్రేలుచుఁ గాల్చె మహీస్థలంబులఁ.

టీ. వహ్ని = నిప్పు, పృథుబల = బలవత్తరమైన, అనిలతూర్ణ = గాలి వేగమువలన, వివృద్ధ = వృద్ధిపొందిన, వేగమై = వడికలదియై, స్ఫుటతరము + బో = ప్రకాశించుచున్న, కుసుంభమున్‌వలెన్ = కుసుమ పువ్వువలెను, నిద్దపుసిందురంపునిగ్గు + అటులన్ = దట్టమైన సిందూరపుఁ బూఁతవంటి కాంతి గలదియునై, కుటవిటపంబులన్ = చెట్లకొమ్మలను, లతల = తీఁగెల, క్రొత్త + తుదలన్ = చివుళ్లతో నిండిన కొనలను, తమిన్ = ఆసక్తితో, కాఁగిలించుచున్ = ఆలింగనము చేయుచు (అనఁగా మంటలను వానిపైకిఁ బర్వుచు), పెటపెటప్రేలుచున్ = పెటపెటమను ధ్వనితో మండుచు, మహీస్థలంబులన్ = భూభాగములను (వనభూములను), కాల్చెన్ = కాల్చుచున్నది.

తా. గాలి వేగమునఁ జెలరేఁగిన దావాగ్ని పెటపెటమని మంట లెగయుచు, చెట్లను దీఁగెలను మాడ్చి మసిచేయుచు, నడవులనెల్ల దహించు చున్నది.

[1]ధ్వనతి పవన[2]వృద్ధః [3]పర్వతానాం దరీషు
స్ఫుటతి [4]పటునినాదః శుష్కవంశస్థలీషు
ప్రసరతితృణమధ్యే లబ్ధవృద్ధిః క్షణేన
[5]గ్లపయతి [6]మృగవర్గం ప్రాంతలగ్నో దవాగ్నిః॥ 25

1 జ్వలతి. 2 విద్ధః 3 పర్వతాంతర్ద్వారీషు. 4 పటునినాదైః. 5 క్షపయాతి. 6 మృగయూథం.

గాలికి రేఁగి భూమిధర
కందరసీమలలో జ్వలించు చు
ద్వేలరవాప్తి శుష్కతర
వేణువనంబుల నిర్దహించుచున్
హేళి క్షణాన వర్ధిలి తృ
ణాంతరభూముల నట్టె పర్వి గ
గ్గోలొనరించెడిన్ హరిణ
కోటుల ఘోరదవాగ్ని యియ్యెడన్.

టీ. ఇయ్యెడన్ = ఈ గ్రీష్మమున, ఘోరదవ + అగ్ని = భయంకరమైన కార్చిచ్చు. గాలికిన్ = గాలి వీచుటచే, రేఁగి = పైకెగసి, భూమిధరకందరసీమలలోనన్ = కొండలోయలలో, జ్వలించుచున్ = మండుచు, ఉత్ + వేలరవ + ఆప్తిన్ = పెద్ద ధ్వని కలుగఁజేయుచు, శుష్కతర = ఎండిపోయిన, వేణువనంబులన్ = వెదురుపొదలను, దహించుచున్ = కాల్చుచు, హేళిన్ = అనాయాసముగా, క్షణానన్ = క్షణములో, వర్ధిలి = వృద్ధినొంది, అట్టె = అట్లే మండుచు, తృణ + అంతరభూములన్ = పచ్చికబయళ్లమీఁద, పర్వి = వ్యాపించి, హరిణకోటులన్ = లేళ్ల గుంపులను, గగ్గోలు + ఒనరించెడిన్ = భయపెట్టి పరువు లెత్తించుచున్నది.

తా. దావాగ్ని కొండలోయలలోని వెదురుపొదలను గాల్చుచు నంతకంతకుఁ బెద్దదై పచ్చికబయళ్లపైకి వ్యాపింపఁగాఁ బ్రాణభీతితో లేళ్లు అల్లకల్లోలముగాఁ బరువు లెత్తుచున్నవి.

బహుతర ఇవజాతః శాల్మలీనాం వనేషు
స్ఫురతి కనకగౌరః కోటరేషు ద్రుమాణాం।
[1]పరిణతదలశాఖానుత్పతన్ ప్రాంశువృక్షాన్
భ్రమతి పవనధూతః సర్వతోఽగ్నిర్వనాంతే॥ 26

1 పరిణతదలశాఖా దుత్పతత్యాశు వృక్షాత్.

అనలము శాల్మలీవనుల
యం దధికంబుగఁ దోఁచు, విస్ఫుర
త్కనకరుచిన్ జ్వలించుఁ దరు
కాండము తొఱ్ఱలలోన, శీర్ణప
ర్ణనికరతుంగపాదప గ
ణమ్ములపై కెగఁబ్రాఁకి త్రుళ్ళుచున్
వనముల నెల్లెడం గలయఁ
బాఱు మహోగ్రమరుద్విధూత మై.

టీ. అనలము=నిప్పు (దావాగ్ని), మహా+ఉగ్ర+మరుత్+విధూతము+ఐ=భయంకరముగా వీచు గాలిచే రేఁపఁబడినదై, శాల్మలీవనులయందున్=బూరుగ మ్రాఁకులమీఁద, అధికంబుగన్+తోఁచున్=మిక్కుటముగాఁ గన్పట్టుచున్నది, తరుకాండము తొఱ్ఱలలోనన్=చెట్ల మొదళ్ళందుఁగల తొఱ్ఱలలో, విస్ఫురత్+కనకరుచిన్=మెఱుఁగు బంగారపు వెలుఁగుతో, జ్వలించున్=మండుచున్నది, శీర్ణపర్ణనికర=ఎండుటాకుల గుంపుతోఁ గూడిన, తుంగ=ఎత్తైన, పాదపగణమ్ముల=చెట్ల గుంపుల, పైకిన్+ఎగన్+ప్రాఁకి=పైకి వ్యాపించినదై, త్రుళ్లుచున్=మంటల నెగఁజిమ్ముచు, వనములన్=అడవులందు, ఎల్ల+ఎడన్=అంతటను, కలయన్+పాఱున్=వ్యాపించుచున్నది.

తా. దవానలము శాల్మలీవనములనుండి వ్యాపించి, తరుకోటరములను జొచ్చి, చెట్లపైఁ కెగఁబ్రాఁకి, వనమునంతయు దహించుచున్నది.

గజగవయ మృగేంద్రా వహ్నిసంతప్తదేహాః
సుహృద ఇవ [1]సమేతా ద్వంద్వభావం విహాయ।

1 సమంతాత్.

హుతవహ పరిఖేదాదాశు నిర్గత్య కక్షా
ద్విపుల పులినదేశా న్నిమ్నగాం *ఆశ్రయంతే॥ 27

అగ్నిమెయిఁ గాల్ప గవయహర్యక్షకరులు
జ్వలనపరిఖిన్నకక్షుల వడిగవీడి
ద్వంద్వభావంబు విడి సుహృద్వర్గమట్లు
చేరె విపులపులిననదీసీమ లిపుడు.

టీ. అగ్ని = కాలుచిచ్చు, మెయిన్ + కాల్పన్ = శరీరమును గాల్పఁగా, గవయహర్యక్షకరులు = గురుపోతులు, సింహములు, ఏనుఁగులు, జ్వలనపరిఖిన్నకక్షలన్ = కార్చిచ్చు మంటలచే సెగ లెగయుచున్న కొండగుహలను, వడిగ వీడి = త్వరగా వదలిపెట్టి, ద్వంద్వభావంబున్ విడి=పరస్పరవిరోధములు మాని, సుహృత్ + వర్గము + అట్లు=స్నేహితుల చందమున, ఇపుడు, విపులపులిన = విస్తారమైన యిసుకదిబ్బలుగల, నదీ సీమలన్ = నదీప్రదేశములను, చేరెన్ = చేరెను.

తా. అగ్నిబాధకుఁ దాళలేక సింహములు, ఏనుఁగులు, గురుపోతులు, కొండగుహలను విడిచిపెట్టి, పరస్పరద్వేషభావమును బాసి, స్నేహితులవలె నన్నియు నొక్కచోసమయమున నొడ్డునఁగల నిసుకతిన్నెలపైఁ జేరుచున్నవి. విపత్కాలమున విరోధము లుడుగును.

కమలవనచితాంబుః పాటలామోదరమ్యః
[1]ముఖసలిలనిషేకః సేవ్యచంద్రాంశు[2]హారాః।
వ్రజతు తవ నిదాఘః కామినీభిః సమేతో
నిశి [3]సులలితగీతే హర్మ్యపృష్ఠే [4]ముఖేన॥ 28

* సంవిశన్తి.
1 సుఖసలిల. 2 జాలః. 3 సులలితగీతైః. 4 సుఖేన.

కమలవనచితాంబుకాండమ్ము శుభదమ్ము
చారుపాటలసుమసౌరభమ్ము
సుఖసలిలనిషేక మఖిలలోకహితమ్ము
సేవ్యచంద్రకిరణభవ్యసరము.

సులలితగానంబులుగల
వెలిమేడలమీఁద రూపవిభ్రమవతులౌ
వెలఁదుకలతోడ వేసవి
యలఘుసుఖము గూర్చుఁగాత మనయము మీకున్.

టీ. (గ్రీష్మము), కమలవన = తామరపువ్వుల సమూహముచే, చిత = వ్యాప్తినొందిన, అంబుకాండమ్ము = జలసమూహముగలది, శుభదమ్ము = శుభముల నొసఁగునది, చారు = రమణీయమైన, పాటలసుమ = కలిగొట్టు పూలయొక్క, సౌరభమ్ము = పరిమళముగలది, సుఖసలిలనిషేకము = హాయిగా స్నానము సేయుటకుఁ దగినది, అఖిలలోకహితమ్ము = సర్వప్రాణులకు నభిమతమైనది, సేవ్య = అనుభోగ్యమైన, చంద్రకిరణ = చంద్రుని కిరణముల నెడి, భవ్య = శ్రేష్ఠమైన, సరము = హారముగలది.

తా. తామరపూలతో నిండిన నీళ్లు, పరిమళయుక్తములైన పాటల పుష్పములు, శీతలజలస్నానములు, ముత్తెపుఁ బేరులవంటి వెన్నెలలు — వీనితో గ్రీష్మము మనోరంజకముగా నున్నది.

టీ. సులలిత గానంబులుగల = కర్ణపేయములైన పాటలతోఁగూడిన, వెలిమేడలమీఁద = తెల్లని మిద్దెలపైన, రూపవిభ్రమవతులు + ఔ = అంద చందములు చిందెడి, వెలఁదుకలతోడన్ = జవరాండ్రతో, వేసవి = గ్రీష్మఋతువు, మీకున్ = పాఠకులైన మీకు, అనయమున్ = ఎల్లప్పుడును, అలఘుసుఖమున్ = మిక్కిలి సుఖమును, కూర్చున్ + కాతన్ = కల్గించును గాక.

తా. గ్రీష్మఋతువున మీరెల్లరు తెల్లని మేడలపైఁ హాయిగాఁ బాటలు పాడుచుండెడి జవరాండ్రతోఁగూడి నిరతము సుఖింతురుగాక!

# వర్ష

సశీకరాంభోధర మత్త[1]కుంజర
స్తటిత్పతాకోఽశనిశబ్దమర్దలః।
సమాగతో రాజవ[2]దుద్ధతద్యుతిః
ఘనాగమః కామిజనప్రియః ప్రియే॥ 1

సజలకణపయోదసమదద్విపమ్ము శం
పాధ్వజ మశనిరవమర్దళమ్ము
కామిజనహితమ్ము కాంతియుతము వచ్చెఁ
బ్రావృడాగమంబు ప్రభువుఁబోలె.

టీ. సజలకణ=నీటి తుంపురులతోఁ గూడిన, పయోద=మేఘము లనెడు, సమద = మదముతోఁ గూడిన (మదించిన), ద్విపమ్ము=ఏనుఁగులు గలదియు, శంపాధ్వజము=మెఱపుఁ దీఁగెలనెడు టెక్కెములు గలదియు, అశని రవ మర్దళమ్ము = మేఘగర్జనము (ఉఱుము) లనెడు మద్దెలమ్రోఁత గలదియు, కామిజన = కాముకు లనెడి యాచకులకు, హితమ్ము=కోర్కెలీడేర్చునదియు, కాంతియుతము = కీర్తి ద్యుతులవంటి మెఱపు వెల్గులతోఁ గూడినదియునై, ప్రావృట్ + ఆగమంబు = వర్షర్తు ప్రారంభము, ప్రభువు వోలెన్ = విజయోత్సవమునం దూరేగుచున్న చక్రవర్తివలె, వచ్చెన్ = సంభవించెను.

తా. తొండములతో నీటితుంపురుల నెగఁజిమ్ము మదపుటేనుఁగుల వంటి కాఱుమబ్బులతోను, రథపతాకలవంటి మెఱపుఁ దీఁగెలతోను,

1 వారణః. 2 ఉన్నతధ్వనిః, ఉద్ధతద్యుతిః.

మంగళవాద్యములువోలె నొప్పుచున్న యురుముల మ్రోతతోను, వ్యాప్తి నొందిన కీర్తిద్యుతులవోలె విలసిల్లు మెఱపుఁగాంతులతోను గూడినదై, కాముకులకు నభీష్టసిద్ధినిఁ గూర్చునదై, వర్షాకాలము, విజయోత్సాహియైన చక్రవర్తివలె నరుదెంచుచున్నది.

నితాంతనీలోత్పల పత్రకాంతిభిః
క్వచిత్ప్రభిన్నాంజనరాశిసన్నిభైః।
క్వచిత్సగర్భ ప్రమదా స్తనప్రభైః
సమాచితం వ్యోమ ఘనైః సమంతతః॥ 2

గాఢనీలోత్పలచ్ఛదకాంతిఁ గొన్ని
చారుభిన్నకజ్జలరాశిసమతఁ గొన్ని
గర్భిణీచూచుకప్రభాకలనఁ గొన్ని
నీరదము లంబరంబున నిండుకొనియె.

టీ. నీరదములు = వర్షాకాల మేఘములు, కొన్ని, గాఢ = దట్టమైన, నీల + ఉత్పల = నల్లకలువల, ఛద = ఱేకుల (రంగువంటి), కాంతిన్ = కాంతి గలవియై, కొన్ని, చారు = మనోహరమైన, భిన్న = నూఱఁబడిన, కజ్జలరాశి = కాటుకప్రోవుతో, సమతన్ = సమానమైన కాంతి గలవియై, కొన్ని, గర్భిణీ = గర్భవతియైన స్త్రీయొక్క, చూచుక = చనుమొనల, ప్రభా = కాంతులను, కలనన్ = కలిగియున్నవియునై, అంబరంబునన్ = ఆకాశంబునందు, నిండుకొనియెన్ = దట్టముగాఁ గ్రమ్ముకొన్నవి.

తా. నల్లకల్వపూఱేకుల కాంతితోఁ గొన్నియుఁ, గాటుకప్రోవుల వలె నింకఁ గొన్నియు, గర్భవతియైన జవ్వని చనుమొనల రంగు గలిగి మఱికొన్నియుఁ, దఱిగప్పు మబ్బు లాకసంబెల్ల నిండియున్నవి.

తృషాకులై శ్చాతక పక్షిణాం కులైః
ప్రయాచితాస్తోయభరావలంబినః।
ప్రయాన్తి మందం [1]బహు[2]వారి వర్షిణో
వలాహకాః శ్రోత్రమనోహరస్వనాః॥ 3

చాతకములు దప్పి సలిలమ్ము లర్థింప
జలభరమున వ్రేలు జలధరములు
బహుళధారలిపుడు వర్షించుచల్లన
శ్రవణసుఖరవముల సాగునవిగొ.

టీ. జలభరమునన్ = నీటిబరువుచే, వ్రేలు = వ్రేలాడుచున్నట్టుండెడి, జలధరములు = మేఘములు, చాతకములు = వానకోయిలలు, దప్పిన్ = దాహముగొన్నవై, సలిలమ్ములన్ = నీటిని, అర్థింపన్ = యాచింపఁగా, ఇపుడు = ఈ వర్షాకాలమున, బహుళధారలన్ = ఎడతెగని జల్లులతో, వర్షించుచు = వర్షము నొసఁగుచు, శ్రవణసుఖ = చెవికింపైన, రవములన్ = గర్జనములతో, అల్లనన్ = మెల్లఁగా, సాగున్ = సాగిపోవుచున్నవి, అవిగో = (ఓ చెలీ!) అల్లవే చూడుమా.

తా. ఓ చెలీ! అటు చూడుము, చాతకముల దప్పిదీర వర్షించుచు, శ్రవణపేయముగ గర్జించుచు, నాకసంబున మెల్లఁగా నీ కాఱుమబ్బులు సాగిపోవుచున్నవి.

వలాహకాశ్చాశని శబ్ద[3]మర్దలాః
సురేంద్రచాపం దధత స్తటిద్గుణం।
[4]సుతీవ్రధారా పతనోగ్ర[5]సాయకై
స్తుదంతి చేతః [6]ప్రసభం ప్రవాసినామ్॥ 4

1 నవ. 2 ధార.
3 భీషణాః. 4. సుతీక్ష్ణ. 5 సాయకాః. 6 ధ్వనిభిః.

అశనిరవమర్దలములు నూత్నాంబుదములు
కోమలేంద్రచాపము తటిద్గుణముఁ దాల్చి
చటులధారాపతనచండసాయకములఁ
బ్రసభగతిఁ బ్రవాసులమదిఁ బాధవెట్టు.

టీ. నూత్న + అంబుదములు = తొలకరి మబ్బులు, అశనిరవ = ఉఱుముల ధ్వనిని, మర్దలములు (ఐ) = భేరీధ్వనులనుగాఁ జేసికొని, కోమల + ఇంద్రచాపము = మనోహరమైన యింద్రధనుస్సును విల్లుగాను, తటిత్ గుణమును = మెఱుపుఁదీఁగె యనెడి యల్లెత్రాటిని, తాల్చి = ధరించి, (యుద్ధవీరులవలె) చటులధారాపతన=ఎడతెగక వేగముగాఁబడు వర్ష ధారలనెడి, చండసాయకములన్ = వాఁడి యమ్ములతో, ప్రవాసుల మదిన్ = కార్యాంతరమున నొండొరుల నెడఁబాసిన ప్రేయసీ ప్రియులయొక్క చిత్తములను, ప్రభసగతిన్ = మిక్కిలి రభసముగా, బాధవెట్టున్ = క్షోభ పెట్టుచున్నవి.

తా. తొలకరిమబ్బులనెడి యోధులు, ఉఱుములనెడి భేరీరావములు చెలఁగఁగా, నింద్రధనుస్సనెడి బాణదండమున మెఱుపుఁదీఁగె యను నల్లెత్రాటిని సంధించి వర్షధారలనెడి కఱకుటమ్ములతో వియోగిజనచిత్తములను గాసివెట్టుచున్నారు.

ప్రభిన్నవైడూర్యనిభైస్తృణాంకురైః
సమాచితా ప్రోత్థితకందలీదళైః।
విభాతి శుక్లేతరరత్నభూషితా
వరాంగనేవ క్షితిరింద్రగోపకైః॥

క్షుణ్ణవైదూర్యనిభతృణాంకురసమేత,
సేంద్రగోపక, ప్రోత్థితకందళీద

శాన్వితయగు వసుంధర యలరు నిప్పు
డసితమణిభూషితయగు వరాంగివోలె.

టీ. ఇప్పుడు = ఈ వర్షర్తువునందు, వసుంధర = రత్నగర్భయైన భూమి, తుణ్ణ = సగులఁగొట్టఁబడిన, వైదూర్య = వైదూర్యమణితో, నిభ = సమానమైన (గౌరవర్ణములగల), తృణ + అంకుర = గడ్డిమొక్కలతో, సమేత = కూడుకొనినదియు, స + ఇంద్రగోపక = ఆరుద్ర పురుగులతో నిండినదియు, ప్ర + రూఢితకందళీదళ = విరివిగా మొలకెత్తిన నేల తాటి యాకులతో, అన్విత = కూడినదియు, అగు = అయినట్టి, అసిత = తెల్లనివి కానట్టి, మణి = మణుల చేత, భూషిత యగు = అలంకృతయైన, వరాంగి వోలె = విలాసినివలె, అలరు = ఒప్పుచున్నది.

తా. వైదూర్యపు ముక్కలవలె పీతవర్ణములైన గడ్డిమొక్కల తోను, నీలమణులవలె నల్లనైన నేలతాటియాకులతోను, పద్మరాగమణుల వలె నెఱ్ఱనైన యారుద్రపురుగులతోను, గూడియున్న వర్షాకాలపు భూమి, సితేతరమణిభూషణాలంకృతయైన విలాసినివలె నొప్పుచున్నది.

సదా [1]మనోజ్ఞం స్వనదుత్సవోత్సుకం
[2]వికీర్ణవిస్తీర్ణ కలాపశోభితం।
[3]ససంభ్రమాలింగన చుంబనాకులం
ప్రవృత్తనృత్యం కులమద్య బర్హిణామ్॥ 6

ఉదితమంజుస్వనం బుత్సవోత్సుకంబు
లలితకీర్ణవిస్తీర్ణకలాపశోభి
తంబు సత్వరాలింగనచుంబనాకు
లంబు శిఖికులంబిపుడు నృత్యంబు సేయు.

1 మనోజ్ఞ స్తనితోత్సుఖోత్సుకం, మనోజ్ఞాంబుదనాదసోత్సుకం.
2 విభాతి. 3 సవిభ్రమా.

టీ. ఇపుడు = ఈ వర్షాకాలమున, శిఖికులంబు=మగనెమిళ్లగుంపు, ఉదిత = బయల్వెడలిన, మంజు = మనోహరమైన, స్వనంబు = శబ్దము కలదియు, ఉత్సవ = మేఘదర్శనోత్సవమువలని, ఉత్సుకంబు = విలాసము గలదియు, లలిత = మనోహరమైన, కీర్ణ = విస్తరింపఁబడిన, విస్తీర్ణ = విశాలమైన, కలాప = పింఛములతోఁ, శోభితంబు=ప్రకాశించునదియు, సత్వర = హర్షసంరంభముతోఁగూడిన, ఆలింగనచుంబన + ఆకులంబు = (చెంతనున్న యాఁడు నెమిళ్లను) కౌఁగిలించుకొనుట ముద్దుపెట్టుకొనుట మొదలైన శృంగారచేష్టలను జేయుచున్నదియునై, నృత్యంబుఁ జేయుఁ = నాట్యమాడును.

తా. నెమిళ్లు గుంపులుగట్టి చెవికింపుగఁగూయుచుఁ బింఛములను విప్పి, కౌఁగిలించి ముద్దుపెట్టుకొనుటకో యనునట్లు చెంతనున్న యాఁడు నెమిళ్ళచుట్టును దిరుగుచుఁ, గనులపండువుగ నృత్యము సేయుచున్నవి.

[1]నిపాతయన్త్యః పరితస్తటద్రుమాన్
ప్రవృద్ధవేగైః సలిలైరనిర్మలైః।
స్త్రియః [2]ప్రహృష్టా ఇవ జాతవిభ్రమాః
ప్రయాన్తి నద్యస్త్వరితం పయోనిధిమ్॥ 7

అధికరయముల్లైన యావిలాంబువులచే
దరులఁ బరుల నన్నిదారలఁ జేసి
జాతవిభ్రమలగు స్రోతస్వినులు వార్ధిఁ
జేరనరుగు వడిగఁ జెడిపెలట్లు.

టీ. స్రోతస్వినులు = నదులు, వడిగన్ = శీఘ్రముగా, చెడిపెలట్లు= అంకటాంఁడ్రవలె, అధికరయములైన = మిక్కిలి వేగముగలిగిన (కామావేశముగలిగిన యని చెడిపెపరమైన యర్థము), ఆవిల + అంబువులచేఁ =

1 విపాటయన్త్యః. 2 ప్రకామాః, సుదుష్టా.

కలుషితములైన జలములచే (బహుపురుషస్పర్శనమున మలినములైన సౌందర్యగులచే ననియు), దరులన్=గట్టులమీఁది, తరులన్ + అన్నిన్= చెట్లు నన్నింటిని, దొరలన్ + చేసి=కూలఁద్రోసి, (కులగౌరవములను బాడు సేసి యనియు), జాతవిభ్రమలగు(చు) = సుడిగుండములు పడునట్లు ప్రవహించుచు (పురుషాకర్షణమునకై నేత్రసంజ్ఞాహస్తచాలనాగల నొనరించుచు), వార్ధిన్ = సముద్రమును (మిండగానిని), చేరన్=కలయుటకు (సంగమించుటకు), అరుగున్ = పోవుచున్నవి.

తా. ఈ వర్షాకాలమున బురదనీటితోఁగూడిన నదీప్రవాహములు, ఒడ్డులనున్న చెట్లను కూలఁద్రోయుచు, సుడిగుండములు పడఁజేయుచు, మిక్కిలి వేగముగా సాగరాభిముఖములై పోవుచున్నవి. ఇది యెట్లున్న దనఁగా, కామావేశితయైన జారిణి, కలుషితమైన యంగలావణ్యమును హస్తనేత్రాదిసంజ్ఞలచేఁ బ్రకటించుచుఁ, గులగౌరవములఁ బోనాడి, సిగ్గు విడిచి, బహిరంగముగాఁ బరపురుషునిఁ గలియుటకై శీఘ్రముగా పోవుచున్నట్లున్నది.

[1]తృణోత్కరై రుద్గతకోమలాంకురైః
విచిత్ర[2]నీలై ర్హరిణీ ముఖక్షతైః।
వనాని [3]వైన్ధ్యాని హరంతి మానసం
విభూషితాన్యుద్గత [4]పల్లవై ర్ద్రుమైః॥ 8

అలఘువిచిత్రనీలరుచు
  లై విలసన్మృదులోదితాంకురం
బులయు మృగీముఖక్షతులఁ
  బొల్పెసలారు తృణాళిచే, సము

1 తృణోద్గమైః. 2 లేఖైః. 3 రమ్యాణి. 4 పల్లవద్రుమైః.

జ్వలనవపల్లవక్షితిజ
సంహతిచేఁ, దగు వింధ్యకాననం
బులు చెలి! మానసంబునకు
మోదముగూర్చుచు నున్నవియ్యెడన్.

టీ. చెలి = ఓ ప్రియురాలా! ఇయ్యెడన్ = ఈ వర్షర్తువునందు, అలఘు = మిక్కుటమైన, విచిత్ర = ఆశ్చర్యకరమైన, నీలరుచులు + ఐ = నీలకాంతులు గలవియై, మృదుల = మెత్తనైన, ఉదిత = మొలచిన, అంకురంబులు + ఐ = మొలకలు గలవియై, మృగీముఖక్షతులన్ = ఆఁడు లేళ్లు కొనలను గొఱుకుటచే, పొల్పు + ఎసలు + ఆరు = మిక్కిలి యందముగానున్న, తృణాళిచేన్ = గడ్డిమొక్కలచేతను, నవపల్లవ = క్రొంజిగురుటాకులతోఁ గూడిన, క్షితిజసంహతిచేన్ = చెట్లసమూహముచేతను, తగు = ఒప్పుచున్న, వింధ్యకాననంబులు = వింధ్యపర్వతప్రాంతారణ్యములు, మానసంబునకున్ = చూచువారి మదికి, మోదమున్ = సంతోషమును, కూర్చుచున్ + ఉన్నవి = కలిగించుచున్నవి.

తా. ప్రేయసీ! లేళ్లు కొఱికినకొలఁది చిగుర్చుచున్న గడ్డిమొక్కల నీలకాంతులతోను, క్రొంజిగురుటాకులతోనిండిన చెట్లతోను ఈ వింధ్యారణ్యము ఎంతయు మనోరంజకమై యున్నదిగదా!

విలోలనేత్రోత్పలశోభితాననైః
మృగైః సమన్తాదుపజాతసాధ్వసైః।
సమాచితా [1]సైకతినీ వనస్థలీ
సముత్సుకత్వం ప్రకరోతి చేతసః॥ 9

జాతసాధ్వసములు చలవీక్షణోత్పల
రమ్యవదనముల్ కురంగచయము

1 శైవలినీ.

లెల్లెడం జరింప నిసుకతిన్నెలతోడి
వనము చిత్తమునకుఁ బ్రమదమిడియె.

టీ. జాతసాధ్వసములు (ఐన) = పుట్టిన భయము గల్గినవియైన (భీతినొందినవైన), కురంగచయము = జింకలగుంపులు, చలవీక్షణ + ఉత్పల రమ్యవదనముల్ = చలించుచున్న తామరరేకులవంటి కన్నులచే మనోహరమైన ముఖములు గలవియై, ఎల్లెడలన్ = అంతటను, చరింపన్ = తిరుగఁగా, ఇసుకతిన్నెలతోడి = ఇసుకదిబ్బలతోఁ గూడియున్న, వనము = ఈ వింధ్యాటవి, చిత్తమునకున్ = మనస్సునకు, ప్రమదమున్ = సంతోషమును, ఇడియెన్ = కలిగించెను.

తా. వ్యాఘ్రాదిక్రూరజంతుభయముచే బిత్తరిచూపులతోఁ బర్వెత్తు జింకలతోను, ఇసుకదిబ్బలతోను గూడియున్న యీ వింధ్యాటవి నా మది కెంతయు హాయినిఁ గూర్చుచున్నది.

[1]సుతీక్ష్ణ ముచ్చై[2]ర్ధ్వనతాం [3]పయోముచాం
[4]ఘనాంధకారీకృత శర్వరీష్వపి।
తటిత్ప్రభాదర్శిత మార్గభూమయః
ప్రయాన్తి రాగా దభిసారికాః స్త్రియః॥ 10

వనిత! పునఃపునరుచ్చై
స్స్వనితఘనఘనాంధకారితక్షపలఁ దటి
జ్జనితద్యుతిదర్శితపథ
మున నభిసారికలు రాగమునఁ జనెద రహో!

1 అభీక్ష్ణం. 2 ధ్వనతా, ఘనతా. 3 పయోముచా. 4 ఘనాంధకారావృత.

టీ. వనిత = ఓ చెలీ, పునఃపునః = మాటిమాటికి, ఉచ్చైః = గట్టిగా, స్తనిత = గర్జించుచున్న, ఘన = మేఘములచేత, ఘన + అంధకారిత = మిక్కిలి చీకటిగా నొనరింపఁబడిన, క్షపలన్ = ఈ వర్షాకాలపు రాత్రులందు సైతము, అభిసారికలు = ప్రియునికొఱకై నిర్దిష్ట స్థలమునకుఁ బోవు కామినులు, రాగమునన్ = కామాతిశయమునఁ జేసి, తటిత్ = మెఱపులవలన, జనిత = పుట్టిన, ద్యుతి = కాంతిచేత, దర్శిత = చూడఁబడిన, పథమునన్ = మార్గమున, చనెదరు = పోవుచున్నారు, అహో = ఇది యెంత ఆశ్చర్యముగా నున్నది.

తా. ఎడతెగక భయంకరముగా గర్జించు కాఱుమబ్బు లాకసమంతయు నిండుటచే నీ వర్షాకాలపురాత్రులు కటికచీఁకటితో నిండి యున్నవి. అట్లయ్యును మెఱుంగులవెలుంగునఁ ద్రోవ తెలిసింగి యభిసారికలు ప్రియులంగూడఁ బోవుచున్నారు. ప్రేయసీ! చూచితివా వారి సాహసము; వర్షాగమ మెంతటి కామోద్రేకజనకమోగదా!

పయోధరై ర్భీమగభీరనిస్వనైః
[1]ధ్వనద్భిరుద్వేజితచేతసో భృశం।
కృతాపరాధానపి యోషితః ప్రియా
న్పరిష్వజన్తే శయనే నిరంతరమ్॥ 11

ఘనగభీరరావఘనముల మెఱపుల
నెంతో వెఱపుగొన్న యెదలఁ జెలులు
అలరుసెజ్జలం గృతాపరాధులై యైన
కాంతులను భృశమ్ము గాఁగిలింత్రు

టీ. చెలులు = జవ్వనులు, ఘన = దీర్ఘములైన, గభీర = గంభీరములైన, రావ = గర్జనములతోఁగూడిన, ఘనములన్ = మేఘములవలనను,

1 తటిద్భిః.

మెఱపులన్ = మెఱపులవలనను, ఎంతో = మిక్కిలిగా, వెఱపుగొన్నయెదలన్ = భీతినొందిన హృదయములతో, అలరుసెజ్జలన్ = ఒప్పిదమైన పాన్పులందు (లేక పూఁబాన్పులందు), కాంతులను = భర్తలను, కృత + అపరాధులు + ఎ + ఐనన్ = చేయఁబడిన యపరాధముగల్గినవారైనప్పటికిని, అనఁగా నన్యకాంతాయత్తచిత్తులైనను గోపగింపక, భృశమ్ము = గాఢముగా, గాఁగిలింత్రు = ఆలింగనము చేసికొందురు.

తా. వర్షాకాలపు రాత్రులయందు, నుఱుములకు మెఱుములకు భయపడి యబలలు, పరకాంతావలోకనాపరాధులైనను గినియక తమ ప్రియులను బిగికౌఁగిటం బొదువుకొందురు. అట్లు సేయుట కేవలము భీతివలననే గాదు; ఋతుప్రేరితమైన కామోత్కర్షమున సహితము!

విలోచనేందీవర వారి బిందుభిః
నిషిక్తబింబాధర చారుపల్లవాః।
నిరస్త మాల్యాభరణానులేపనాః
స్థితా[1] నిరాశాః ప్రమదాః ప్రవాసినామ్॥ 12

వరవిలోచనేందీవరవారిబిందు
చయనిషిక్త బింబాధరచారుకిసలు
ముక్తమాల్యానులేపనభూషలైన
పాంథయువతులు కొందలపడిరి నేఁడు.

టీ. నేఁడు = ఈ వర్షాకాలమున, వర = శ్రేష్ఠమైన, విలోచన = కనులనెడు, ఇందీవర = నల్లగల్వలనుండి జాఱుచున్న, వారి బిందుచయ = కన్నీటిబిందుసమూహముచే, నిషిక్త = తడుపఁబడిన, బింబ + అధర = దొండపండువలె నెఱ్ఱనైన మోవియనెడు, చారు = రమ్యమైన, కిసలు = చిగురాకులుగలవారైన (మోవి దొండపండువలె నెఱ్ఱనిదియుఁ దియ్యనిదియుఁ

1 కృతాః.

జిగురాకువలె మృదువైనదియు నని భావము), పాంథయువతులు = విదేశవాసులైన భర్తలుగల స్త్రీలు, ముక్త = విడువఁబడిన, మాల్య = పువ్వుమాలికలును, అనులేపన = చందనాద్యంగరాగములును, భూషలు = నగలును (గలవారై), కొందలపడుచుఁ + ఉండిరి = దుఃఖించుచున్నారు.

తా. కార్యార్థులై భర్తలు దేశాంతర మరిగియుండ, వర్షాగమ మయ్యెను. విరహోద్దీపితలైన స్త్రీలు, భర్త లెంతకును రాకుండుటచే, నిస్పృహఁ జెంది యలంకారములను విసర్జించి పెదవులు తడియు పర్యంతము కన్నీరుగాఱునట్లు ఏడ్చుచున్నారు.

[1]విపాండురం కీటరజస్తృణాన్వితం
భుజంగవద్వక్రగతి ప్రసర్పితం॥
ససాధ్వసైర్భేకకులైర్నిరీక్షితం
ప్రయాతి నిమ్నాభిముఖం నవోదకమ్॥ 13

కీటతృణరజోవికీర్ణమై పాండువై
వక్రగతులఁ బాముపగిదిఁ బాఱి
భేకకులము వెఱచి వీక్షించుచుండ ని
మ్నాభిముఖ మరుగు నవాంబు వబల!

టీ. అబల = ఓ ప్రియురాలా! నవ + అంబువు = వర్షాకాలపుఁ గ్రొత్తనీరు, కీట = పురుగులతోను, తృణ = గడ్డితోను, రజస్ = ధూళితోను, వికీర్ణ = వ్యాప్తినొందినదై, పాండువై = ఇంచుక పసుపువన్నెతోఁ గలసిన తెలుపురంగు గలదియై, పాముపగిదిన్ = పామువలె, వక్రగతులన్ = వంకలు దిరిగిన పాయలతో, పాఱి = ప్రవహించి, భేకకులము = కప్పల గుంపు, వెఱచి = ప్రవాహమునఁ గొట్టుకొనిపోవుదుమని భయపడి, వీక్షించు

1 విపాండవం. 2 విలోకితం:

చుండఁగా = చూచుచుండఁగా, నిమ్న + అభిముఖము = మిట్టలనుండి పల్లములకు, అరుగుఁగా = ప్రవహించుచున్నది.

తా. ఓ చెలీ! పాండువర్ణమైన యీ వర్షాకాల జలప్రవాహము, ధూళి ధూసరితమై, గడ్డిపోఁచలతోను బురుగులతోను గూడినదై మిట్టల నుండి పల్లములకు దుముకుచున్నది. ఈ ప్రవాహములను గాంచి కొట్టుకొని పోవుదుమేమో యని కప్పలు బెదరి చూచుచుండుట గమనించితివా!

[1]విపత్రపుష్పాం నలినీం [2]సముత్సుకా
విహాయభృంగాః శ్రుతిహారి నిస్వనాః।
పతంతి మూఢాః శిఖినాం [3]ప్రనృత్యతాం
కలాపచక్రేషు నవోత్పలాశయా॥ 14

విదళసుమను నళిని విడి వేడ్క శ్రుతిహారి
నిస్వనముల భృంగనిచయ మిపుడు
నవ్యకువలయాశ నటన కేకి కలాప
చక్రములను మూఢసరణి వ్రాలె.

టీ. ఇపుడు=వర్షాగమమున, భృంగనిచయము=తుమ్మెదలదండు, విదళసుమను = రాలిపోయిన పూవులుగల, నళినిఁ = తామరను, విడి = వదలిపెట్టి, వేడ్కఁ = సంతోషముతో, శ్రుతిహారినిస్వనములఁ=శ్రోత్రపేయమైన ధ్వనులఁ జేయుచు, నవ్యకువలయ + ఆశఁ = క్రొత్తగా వికసించిన కల్వపూవు లనెడి భ్రాంతిచే, మూఢసరణిఁ = వస్తునిర్దేశజ్ఞానము లేకపోవుటచే, నటనకేకి=నృత్యము సేయుచుండు నెమిళ్లయొక్క, కలాపచక్రములను = పింఛముల సమూహమునందు, వ్రాలెఁ=వ్రాలుచున్నవి.

1 ప్రఫుల్లపత్రాం, విపన్నపుష్పాం. 2 సముత్సుకాం. 3 నివర్తతాం.

తా. వర్షారంభము కాఁగానే తామరలు కృశించినవి. తుమ్మెదలు తామరలను విడిచి, కలువపూవులను భ్రాంతిచే పురివిప్పి యాడుచున్న నెమిళ్ల పింఛములందు మూఁగుచున్నవి. చూచితివా! వాని మూఢత్వము.

వనద్విపానాం నవ[1]నీరదస్వనైః
మదాన్వితానాం [2]ధ్వనతాం ముహుర్ముహుః।
కపోలదేశా విమలోత్పలప్రభాః
సభృంగయూథైర్మదవారిభి[3]శ్చితాః॥ 15

నవ్యజలదనిస్వనములకుఁ బోరి మ్రోయు
గంధవనగజేంద్రగండచయము
ప్రవిమలోత్పలప్రభాసమేతము, సరో
లంబచయగళన్మదాంబుచితము.

టీ. నవ్య = క్రొత్తవైన, జలద = మేఘములయొక్క, నిస్వనములకున్ = శబ్దములకు (ఉఱుములకు), పోరిన్ = ప్రతిగా, మ్రోయు = ఘీంకారము చేయుచున్న, వనగజ + ఇంద్ర = శ్రేష్ఠమైన యడవి ఏనుఁగుల యొక్క, గండచయము = కపోలముల సమూహము, ప్రవిమల = మిక్కిలి శుభ్రమైన, ఉత్పలప్రభా = కలువకాంతులతో, సమేతము = కూడినదియు, సరోలంబచయ = తుమ్మెద గుంపులను గలిగి, గళత్ = జాఱుచున్న, మద + అంబు = మదజలముచేత, చితము = వ్యాప్తమైనదియు (నైయున్నది.)

తా. వర్షాకాలమేఘగర్జనములను విని, మదించిన యడవి యేనుఁగులు, వేఱొక మదగజము అఱచుచున్నదను భ్రాంతితో, గంభీరముగా ఘీంకారము సేయుచున్నవి. మహాతిశయమున వాని గండస్థలములు పగిలి మదజలము స్రవించుచుండఁ దుమ్మెదలు మదజలవాసనలకై యా ఏనుఁగుల కపోలములందు మూఁగుచున్నవి.

1 తోయద, వారిద. 2 స్వనతాం. 3 శ్రితాః.

[1]సితోత్పలాభాంబుద చుంబితోపలాః
[2]సమాచితాః ప్రస్రవణైః [3]సమంతతః।
ప్రవృత్త నృత్యైః శిఖిభిః సమాకులాః
సముత్సుకత్వం జనయంతి భూధరాః॥ 16

తెలితొవపోలు మేఘములు
తీయనిముద్దులు గొన్న తాలచే,
వలనుగ నెల్లెడం దొరఁగు
ప్రస్రవణంబులచేఁ, గలాపముల్
నలువుగ విచ్చి యగ్గలిక
నాట్యములం బొనరించు బర్హిణం
బులగమిచే నగంబులు స
ముత్సుకతం గొలుపుఁ జనాళికిఁ.

టీ. నగంబులు = కొండలు, తెలితొవపోలు మేఘములు = తెల్లకలువల కాంతివంటి కాంతిగల మేఘములు (విగతజలములై నైల్యము బాసిన మేఘములు), తీయనిముద్దులు గొన్న = చుంబించుచున్నట్లుంటుకొని యుండెడు, తాలచేఁ = తాళ్లచేతను, వలనుగఁ = నేర్పుతో (నిరాటంకముగా), అంతటను, ఎల్ల + ఎడఁ + తొరఁగు = అంతటఁ బ్రవహించు, ప్రస్రవణంబులచేఁ = ఊటనీటి ధారలతోను, కలాపముల్ = పింఛములను, నలువుగఁ = అందముగ, విచ్చి = విరియఁజేసి, అగ్గలికఁ = మిక్కిలి యుత్సాహముతో, నాట్యములఁ = నృత్యములను, పొనరించు = చేయుచున్న, బర్హిణంబుల గమిచేఁ = మగ నెమిళ్లగుంపుచేతను, జన + ఆళికిఁ = ప్రేక్షక సమూహమునకు, సమ్యక్ + ఉత్సుకతఁ = మిక్కిలి యుత్సాహమును, గొలుపుఁ = కలిగించుచున్నవి.

1 నీలోత్పలాభాంబుద, సతోయనమ్రాంబుద. 2 సుభూషితాః. 3 అపింగలైః.

తా. వర్షించినపిదప మేఘములు నిర్జలములై నైల్యమును బాసి, తెల్ల గల్వపూలువోలె నొప్పారుచుఁ, గొండకొనలను ముద్దువెట్టుకొనినట్లు తాఁకుచున్నవి. అట్టి గిరిసానువులనుండి సెలయేళ్లు నిరర్గళముగాఁ బ్రవహించుచున్నవి. కొండ నెత్తమ్ములఁ బురులు విప్పి నెమిళ్లాడుచున్నవి. ఇట్టి మనోహరదృశ్యములతో నిండిన కొండలు చూపఱ కెంతయు నానందమును గొల్పుచున్నవి.

కదంబ సర్జార్జున[1] కేతకీవనం
[2]వికంపయంస్త[3]త్కుసుమాధివాసితః।
సశీకరాంభోధరసంగశీతలః
సమీరణఃకిం న కరోతి సోత్సుకమ్॥ 17

అర్జునకదంబకేతకీ సర్జతరులఁ
గంప మొందించి తత్సుమగంధమెనసి
సజలకణమేఘసంగతిఁ జల్లనైన
వాయువెవ్వాని నుత్సుకుం జేయ దిపుడు ?

టీ. అర్జునకదంబకేతకీసర్జతరులన్ = మద్ది, కడిమి, మొగలి, గోరంటచెట్లను, కంపమొందించి = కంపింపఁజేసి, తత్ + సుమగంధమున్ + ఎనసి = ఆ పూల పరిమళములతో నిండి, సజలకణమేఘసంగతిన్ = నీటి తుంపురులతోఁ గూడిన మేఘములపైన వీచుటచేత, చల్లనైన = చల్లఁదనము నొందిన, వాయువు = గాలి, ఇపుడు = ఈ సమయమున, ఎవ్వానికిన్ = ఎవ్వనిని, ఉత్సుకున్ + చేయదు = ఉత్సాహవంతునిఁగాఁ జేయదు.

తా. కమ్మని విరితావుల నెగఁజిమ్ముచు, వర్ష జలబిందు స్పర్శనమునఁ జల్లనై, మెల్లఁగా వీచు నీ గాలి యెట్టివారినైనను ఉత్సాహభరితులఁ జేయునుగదా!

1 నీపకేతకీః. 2 ప్రకంపయన్. 3 అధివాసినః.

శిరోరుహైః శ్రోణితటావలంబిభిః
కృతావతంసైః కుసుమైః సుగంధిభిః
స్తనైః[1]సుపీనైర్వదనైః ససీధుభిః।
స్త్రియోరతిం సంజనయంతి కామినామ్॥ 18

పిఱుఁదు దరులవ్రేలు కురులఁ, దావులఁ జిమ్ము
కచ్చునవల, సరులఁ గ్రాలుచనులఁ,
బూవుఁగల్లు వలచుమోముల, ముద్దియల్
వలపుకాండ్రకు రతిఁ గొలుపుచుంద్రు.

టీ. ముద్దియల్ =ఎలజవ్వనులు, పిఱుఁదు దరులన్ వ్రేలుకురులన్ = పిఱుఁదుల వఱకు వ్రేలాడు పొడవైన శిరోజములతోను, తావులన్ + చిమ్ము = వాసనలను వ్యాపింపఁజేయు, కచ్చునవలన్ = సిగబంతులతోను, సరులన్ = హారములచే, క్రాలు = ఒప్పుచున్న, చనులన్ = గుబ్బలతోను, పూవుఁగల్లు వలచు మోములన్ =పూవుఁగల్లు (పుష్పాసవము) వాసనలతోఁ గూడిన మోములతోను, వలపుకాండ్రకున్ = విటులకు, రతిన్=సంభోగ వాంఛను, కొలుపుచుంద్రు = రేకెత్తించుచుందురు.

తా. పిఱుఁదులఁదాఁకు పొడవైన జడలతోను, బూవుఁగల్లు వాసనలతోఁగూడిన నెమ్మోములతోను, గమ్మని వాసనలఁ జిమ్ము సిగబంతులతోను, హారములతో నొప్పువిగిగుబ్బలతోను, విలాసము లొలకఁబోయు ముద్దుగుమ్మలు, విటులకు నగ్గలమైన రత్యుత్సుకతను గల్గించుచున్నారు.

తటిల్లతా శక్రధనుర్విభూషితాః
పయోధరాస్తోయభరావలంబినః।

1 సహారైః.

స్త్రియశ్చ కాంచీమణికుండలోజ్జ్వలా
హరంతి చేతో యుగపత్ప్రవాసినామ్॥ 19

సురధనుశ్చంచలాలతాశోభితములు
తోయభారానతమ్ములు తోయదములు
సారసన మణికుండలోజ్జ్వలలు చెలులు
ప్రోషితులచేతముల నొక్కమొగి హరింత్రు.

టీ. సురధనుః = ఇంద్రధనుస్సుతోను, చంచలాలతా = మెఱపుఁదీఁగెలతోను, శోభితములు = ప్రకాశించునవియు, తోయభార + ఆనతమ్ములు = నీటిబరువుచే వంగియుండునవియు (నైన), తోయదములు = తొలకరి మబ్బులును, సారసన = మొలనూళ్లతోను, మణికుండల = మానికపుఁగమ్మలతోను, ఉత్ + జ్వలలు = ప్రకాశించువారైన (ఇంపుగొల్పుచున్న), చెలులు = పడుచులును, ఒక్కమొగిన్ = ఏకకాలమందే, ప్రోషితుల చేతములన్ = ప్రియురాండ్ర నెడఁబాసినవారి చిత్తములను, హరింత్రు = కలఁతఁ బెట్టుచున్నవి.

తా. ఇంద్రధనుస్సులతోను, మెఱపుఁదీఁగెలతోను గూడి, తొలకరి మబ్బులు శోభిల్లుచున్నవి. ఋతుప్రేరితలైన జవ్వనులు, మణికుండలములతోను గాంచీదామములతోను నలంకృతలై యొప్పుచున్నారు. వర్షాగమమునఁ, బ్రియురాలింగనాతురులైన ప్రవాసులు, జవ్వనులను గాంచినంతనే, తమ ప్రియురాండ్రు స్మృతిపథమునందగుల వారిం జేర నుత్కంఠులగుచున్నారు. [ఒకవంకఁ దొలకరిమబ్బులును వేఱొకవంక నెలజవ్వనులును ఏకకాలముననే పాంథులచిత్తములు గలంచుచున్నవని భావము.]

మాలాః కదంబనవకేసరకేతకీభి
రాయోజితాః శిరసి బిభ్రతి యోషితోఽద్య।

కర్ణాంతరేషు కకుభద్రుమ [1]మంజరీభి
[2]రిచ్ఛానుకూలరచితా॰ నవతంసకాంశ్చ॥ 20

శిరములఁ గదంబనవకే
సర కేతకసరములఁ జెవిసందుల నిచ్ఛా
విరచిత కకుభద్రుమ మం
జరీవతంసములఁ దాల్తు సారసనయనల్.

టీ. సారసనయనల్ = తామరపూవు ఱేకులం బోలిన కన్నులుగల కాంతలు, శిరములన్ = తలలందు (క్రొమ్ముడులందు), కదంబ = కడిమి, నవకేసర = క్రొంబొగడ, కేతక = మొగిలి, సరములన్ = దండలను, చెవిసందులన్, ఇచ్ఛావిరచిత=ఇచ్ఛవచ్చినట్లలంకరింపఁబడిన, కకుభద్రుమ = మద్దిచెట్లయొక్క, మంజరీవతంసములన్ = శ్రేష్ఠమైన చిగురుగుత్తులను, తాల్తు = ధరియింతురు.

తా. తామరఱేకులవంటి కన్నులుగల స్త్రీలు, కడిమి, క్రొంబొగడ, మొగలిపూవులను గొప్పులందుఁ దాల్చి, వింతవింతగఁ గ్రుంపఁబడిన మద్ది చివురుగుత్తులను గర్ణావతంసములుగ నలంకరించుకొని, మిక్కిలి మనోహరలై యొప్పుచున్నారు.

కాలాగురు ప్రచురచందనచర్చితాంగాః
పుష్పావతంస సురభీకృతకేశపాశాః।
శ్రుత్వా ధ్వనిం జలముచాం త్వరితం ప్రదోషే
శయ్యాగృహం గురుగృహాత్ప్రవిశంతినార్యః॥ 21

1 మంజరీణాం. 2 శ్రోత్రానుకూల.

వరకుసుమావతంసపరి
వాసితకేశము లొప్పఁ, జందనా
గురుభర చర్చితంబులగు
కోమలగాత్రము లింపుమీఱ, మే
ఘురవము నాలకించి త్వర
గా గురుగేహముల వీడి కేళిమం
దిరములఁ జొచ్చుచుండిరి వి
నీలకచల్ రజనీముఖంబునన్.

టీ. వినీలకచల్ = నల్లని వెండ్రుకలుగల స్త్రీలు (జవ్వనులు), వరకుసుమ = శ్రేష్ఠములైన పుష్పములతోఁ గూర్పఁబడిన, అవతంస = సిగబంతులచే, పరివాసిత = నివసింపఁబడిన, (అలంకరింపఁబడిన) కేశములు = శిరోజములు, ఒప్పన్ = విలసిల్లఁగా, చందన + అగురుభర = చందనము, అగురు మొదలగు సుగంధద్రవ్యములచే, చర్చితములు = పూయఁబడినవియగు, కోమలగాత్రములు = మనోహరాంగములు, ఇంపుమీఱన్ = ఒప్పిదమై యుండఁగా, మేఘురవమున్ + ఆలకించి = మేఘగర్జనములను విని, గురుగేములన్ = అత్తమామలుండు నిండ్లను, త్వరగా, వీడి, కేళిమందిరములన్ = (తమ ప్రియులుండెడి) శయ్యాగృహము, చొచ్చుచున్ + ఉండిరి = ప్రవేశించుచున్నారు.

తా. ఎలజవ్వనులు, తొలిజాము రేయి నత్తమామలకు సపర్య సేయువారైయుండి, మేఘగర్జనము వినఁబడినంతనే కామోద్రిక్తలై, సపర్యలను త్వరితముగ ముగించి, క్రొమ్ముడులఁ బూవుబంతులు పెట్టుకొనియు, మేనెల్లఁ జందనాగురులేపంబులఁ బూసికొనియుఁ దమ ప్రియులుండెడి పడకటిండ్లలోనికిఁ జేరుచున్నారు.

కువలయదళనీలై రున్నతై స్తోయనమ్రైః
మృదుపవనవిధూతై ర్మందమందం చలద్భిః।

అపహృత మివ చేతస్తోయదైః సేంద్రచాపైః
పథికజనవధూనాం [1]తద్వియోగాకులానామ్॥ 22

కలువల తేకు లట్లసిత
కాంతి వహించి, సమున్నతంబులై
జలముల వ్రాలి, మందముగ
సాగెడు గాడ్పుల కల్లనల్లన౯
మలఁగుచు, సేంద్రచాపములు
మబ్బులు పర్వెఁ వియోగవేదన౯
గలఁగెడు పాంథకాంతలమ
నంబుల వేగ హరింపనో యనన్.

టీ. స+ఇంద్రచాపములు = ఇంద్ర ధనుస్సులతోఁ గూడిన, మబ్బులు = తొలకరిమబ్బులు, కలువల రేకులు+అట్లు = నల్ల కల్వరేకుల వలె, [1]అసిత కాంతి౯ వహించి = నల్లని కాంతినిఁ గల్గి, సమ్యక్+ఉన్నతంబులు+ఐ = మిక్కిలి గొప్పవియై, జలముల౯ వ్రాలి = నీటిబరువుచేత వంగి, మందముగ౯ సాగెడు గాడ్పులకు౯ = మెల్లఁగా వీచు గాలులకు, అల్ల౯+అల్లన౯ = మిక్కిలి మెల్లఁగా, మలఁగుచు = కంపించుచు, వియోగవేదన౯ కలఁగెడు = ప్రియుల యెడఁబాటువలని దుఃఖముచే క్రుళ్ళు చున్న, పాంథకాంతల మనంబుల౯ = విరహిణుల చిత్తములను, వేగ = శీఘ్రముగా, హరింప౯+ఓ+అనునట్లు = (శూన్యహృదయులను జేసి) దుఃఖపెట్టుటకో యనునట్లు, పర్వె౯ = సాగిపోవుచున్నవి.

తా. ఇంద్రధనుస్సుతోఁగూడిన తొలుకారు మబ్బులంగనినంత నే ప్రియాలింగనోత్కంఠలైన పాంథయువతులు, ఎడఁబాటును సహింపలేక కరము పరితపించుచుండ, నట్టివారి నింకను నేడ్పించుటకో యనునట్లు నల్లని మబ్బులు పిల్లగాడ్పుతాఁకున మెల్లఁగా సాగిపోవుచున్నవి.

1 తద్వియోగాకులానామ్.

ముదిత ఇవ కదంబై [1]ర్జాతపుష్పైః సమన్తా
త్పవన చలితశాఖై శాఖిభిర్నృత్యతీవ।
హసితమివ విధత్తే సూచిభిః కేతకీనాం
నవసలిలనిషేకా [2]చ్ఛాంతతాపో వనాంతః॥ 23

వనితరో! ఫుల్లసూనముల
భాసిలునీపములన్ బ్రహర్షముం
గనినయట్టుల్, మరుచ్చలిత
కమ్రలతాగమపంక్తి నృత్యముం
బూనరిచినట్లు, గేదఁగిపు
వ్వుంగమితేకుల నవ్వినట్లు, నూ
తనజలసేకశాంతపరి
తాపము కాననమొప్పె నెల్లెడన్.

టీ. వనితరో = ఓ వనితా! నూతన జలసేక = క్రొత్త వాననీటిచేఁ దడుపఁబడిన, శాంత = నిల్లాతీన, పరితాపము = (గ్రీష్మఋతువునందలి) కాఁక గలదియైన, కాననము = అడవి, ఎల్లెడన్ = అంతటను, ఫుల్లసూనములన్ భాసిలు = వికసించిన పూవులచేఁ బ్రకాశించు, నీపములన్ = కదంబ వృక్షములచే, ప్రహర్షమున్ + కనిన + అట్టుల్ = మిక్కిలి సంతోషమును గాంచినట్లును, మరుత్ + చలిత = గాలికిఁ గదలెడు, కమ్ర=మనోజ్ఞమైన, లత + అగమపంక్తిన్ = చెట్లు, తీఁగెలచాలులు గలిగి, నృత్యమున్ + పొనరిచిన + అట్లు = నాట్యము సేయుచున్నట్లును, గేదఁగిపువ్వుంగమి తేకులన్ = మొగలిరేకుగుంపులనుగల్గి, నవ్వినట్లున్, ఒప్పెన్ = అలరుచున్నది.

తా. ఓ చెలీ! ఇంతకుమును నిదాఘతప్తయైన కాననలక్ష్మి, నేఁటి జలధారలచేఁ దాపముడిగి, యానందమున వెల్లివిరిసిన ముఖకాంతులో

1 జాతి. 2 ఛిన్నతాపః.

యన నొప్పు వికసితకదంబపుష్పములతోను, సంతోషాతిశయమున నృత్యము సేయుచున్నదో యన నొప్పెడు మందమారుతసంచలిత లతాతరు పంక్తులతోను, నవ్వుటచే బయల్పడిన దంతకాంతులో యన నొప్పు మొగలి పూరేకులతోను, మిక్కిలి యలరారుచున్నది.

శిరసివకులమాలాం మాలతీభిస్సమేతాం
[1]వికసిత నవపుష్పైర్యూథికా కుడ్మలైశ్చ।
వికచనవకదంబైః కర్ణపూరం వధూనాం
రచయతి జలదౌఘః కాంతవత్కాల ఏషః ॥24

జలదయుతంబు, వల్లభుని
చందమునన్ దొలుకారు, జాజిపూ
వులఁ జెలువారు క్రొంబొగడ
పూసరులన్ బువుఁబోండ్లకున్ శిరం
బులఁ గయిసేసె; యూథికల
మొగ్గల, విచ్చిన క్రొత్తపూలఁ, బే
శలనవఫుల్లనీపములఁ
జక్క రచించెను గర్ణపూరముల్.

టీ. జలదయుతంబు=కారుమబ్బులతోఁ గూడినదగు, తొలుకారు = నూతనవర్షాగమము, వల్లభుని చందమునన్ = ప్రియునివలె, పువుఁబోండ్లకున్ = పుష్పగాత్రలైన స్త్రీలను, శిరంబులన్ = శిరస్సులను (నొప్పు లంగు), జాజిపూవులన్ + చెలువు + ఆరు = జాజిపూవులతో మిక్కిలి యొప్పు, క్రొత్త + పొగడపూసరులన్ = అప్పుడే వికసించిన పొగడపూల దండలతో, కయిసేసెన్ = అలంకరించెను, యూథికల మొగ్గలన్ = కొండ మల్లియ మొగ్గలతోను, విచ్చినపూలన్ = వికసించిన పుష్పములతోను,

1 కుసుమితనవపుష్పైః.

పేశల = మృదువైన, నవ = అప్పటి, ఫుల్ల = వికసించిన, నీపములన్ = కడిమిపూలతోను, కర్ణపూరములన్ = కర్ణావతంసములను, చక్రన్ = ముచ్చటగా, రచించెను = కూర్చెను.

తా. వర్షాగమమునఁ బూచిన జాజిపొగడపూలను దండలుగా గ్రుచ్చి, స్త్రీలు సిగల నలంకరించుకొనుచున్నారు. కడిమి కొండమల్లియ పూలను గర్ణభూషణములుగాఁ జేసికొనుచున్నారు. ప్రియుఁడు తనవిదీఱఁ దన ప్రియురాలిం గయిసేసినట్లు వర్షాగమము జవరాండ్ర నెల్ల నలంకరించు చున్నది.

దధతి [1]వరకుచాగ్రైరున్నతైర్హారయష్టిం
ప్రతనుసితదుకూలాన్యాయతైః శ్రోణిబింబైః।
నవజలకణసేకా దుద్గతాం రోమ[2]రాజీం
[3]లలితవలివిభంగైః మధ్యదేశై[4]శ్చనార్యః॥ 25

కలికి! మనోహర ప్రతను
గౌరదుకూలము లాయతంబులై
యలరునితంబబింబముల,
హారము లున్నతసుస్తనాగ్రసీ
మల, నవవాఃకణప్రసర
మంజులసేకసముత్థరోమరే
ఖలు వళిభంగరమ్యమగు
కౌనులఁ. జానలు దాల్తు రిత్తఱిన్.

1 కుచయుగాగ్రైః, పృథుకుచాగ్రైః. 2 రాజిం. 3 త్రివలివలి విభంగైః. 4 దేశైను.

టీ. కలికి = ఓ జవ్వనీ! ఇత్తఱిన్ = ఈ వర్షరుతువునందు, చానలు = స్త్రీలు, ఆయతంబులు + ఐ + అలరు = విశాలములై యొప్పు, నితంబ బింబములన్ = పిఱుఁదులపైన, మనోహర = అందమైన, ప్రతను=మిక్కిలి సన్నమైన, గౌరదుకూలములన్ = పీతవర్ణముగల పట్టుచీరెలను, ఉన్నత కుస్తన + అగ్రసీమలన్ = బలుపైన బిగిగుబ్బల మొనలపైన, హారములన్= ముత్తెపు సరులను, వళిభంగరమ్యము + అగు=బొడ్డునకుఁబైనుండు వలలవంటి ముడుఁతల (త్రివళుల)చే రమ్యమైన, కౌనులన్=నడుములందు, నవవాఃకణ ప్రసర = క్రొత్తనీటి తుంపురులు వ్యాపించుటవలన, మంజులసేక = మనోజ్ఞ ముగాఁ దడుపఁబడి, సమ్యక్ + ఉత్థ=బాగుగా నిగిడికొన్న, రోమరాజిన్ = నూగారును, తాల్తురు = కలిగియుందురు.

తా. ఓ చెలీ! ఈ వర్షరువున, నెలజవ్వనులు, గొప్ప పిఱుందులను గప్పెడు సన్నని పట్టుచీరెలను ధరింతురు. వట్రువగుబ్బలపై ముత్తెపుసరుల నిడికొందురు. తొలకరి వాన తుంపురులు సోఁకి, త్రివళీభిన్నమైన యా పూవుఁబోండ్ల నూగారులమీఁది రోమరాజి నిక్కఁబొడుచుకొనుచున్నది. (నూగారు నిక్కఁబొడుచుకొనుట కామోద్రేక చిహ్నము.)

నవజలకణ [1]సంగాచ్ఛీతతా మాదధానః
కుసుమభరనతానాం [2]లాసకః పాదపానాం।
[3]జనితరుచిరగంధః కేతకీనాం రజోభిః
[4]పరిహరతి నభస్వాన్ ప్రోషితానాం మనాంసి॥ 26

నూతనోదకకణసంగశీతలమ్ము
లలితసుమభారనతసాలలాసకమ్ము
కేతకీ సుమనఃపాంశుజాతగంధ
మనిల మిది ప్రోషితులచిత్త మపహరించు.

1 సేకాత్. 2 లాలసః, నాశకః. 3 సురభి. 4 వ్యవహరతి, ఉపహరతి.

టీ. నూతన + ఉదకకణ = క్రొత్త నీటిబిందువులయొక్క, సంగ = స్పర్శనమున, శీతలము = చల్లనిదియు, లలితకుసుమభార = అందములగు పువ్వుల బరువుచే, నత = వంగిన, సాల = చెట్లచే, లాసకము = వీవఁబడినదియు, కేతకీకుసుమనః = మొగలి పూవులయొక్క, పాంసు = పుష్పొడివలన, జాత = పుట్టిన, గంధము = పరిమళము గలదియునైన, అనిలము + ఇది = ఈ గాలి, ప్రోషితుల చిత్తములఁ = వియోగుల మానసములను, హారించుఁ = కలఁచును.

తా. క్రొన్నీటి తుంపురులచేఁ జల్లనై, విరుల బరువుచే వంగిన తరువులచే వీవఁబడి మెల్లనై, మొగలిపుప్పొడులఁ దాఁకి కమ్మనై, యీ గాలి వియోగిజనచిత్తముల నెంతయుఁ గలవరపెట్టుచున్నది.

[1]జలధరవినతానామాశ్రయోఽస్మాకముచ్చై
రయమితి జలసేకైస్తోయదాస్తోయనమ్రాః।
అతిశయపరుషాభిర్గ్రీష్మవహ్నేః శిఖాభిః
సముపజనితతాపం హ్లాదయన్తీవ వింధ్యమ్॥ 27

'జలభరవినమ్రులకు మహాశ్రయమితండు
మాక' నుచుఁ దోయనతములు మబ్బు లిపుడు
తత దవాగ్నిశిఖాతాపతప్తు వింధ్యు
సలిలసేకమునఁ బ్రహృష్టు సలుపఁబోలు.

టీ. ఇపుడు, తోయనతములు = నీటిబరువునకు వంగిన, మబ్బులు, జలభరవినమ్రులకుఁ = నీటిబరువున కోర్వలేక వంగిన, మాకుఁ, ఇతండు = ఈ వింధ్యనగరాజు, మహా + ఆశ్రయము = గొప్ప అండగా నిల్చియున్నాఁడు, అనుచు = అనుకొని, సలిలసేకమునఁ = వర్షధారలచే, తత = విస్తారమైన, దవ + అగ్నిశిఖ = కార్చిచ్చు మంటలయొక్క, తాప = వేఁడిమికి, తప్తుఁ =

1 జలభరనమితానాం.

క్రాఁగిపోయిన, వింధ్యః = వింధ్యనగరాజము, ప్రహృష్టః = సంతోష స్వాంతునిఁగా, సలుపన్ + పోలు = చేయుచున్నట్లున్నవి.

తా. వింధ్యనగముపైఁ దొలకరిమబ్బులు వర్షించుచుండఁ, దత్సమీపారణ్యమున దావాగ్నులు చల్లారుచున్నవి. నీటిబరువునకు వంగిపోయిన తమకు నండఁగా నిల్చిన వింధ్యాద్రికిఁ బ్రత్యుపకారము సేయుటకో యనునట్లు, మేఘములు కౌఁగిలించుచుఁ గాలిన యాతని తాప ముడుగునట్లు ధారాపాతముగ వర్షించుచున్నవి.

బహుగుణ రమణీయః [1]కామినీచిత్తహారీ
తరువిటపలతానాం బాంధవో నిర్వికారః।
జలదసమయ [2]ఏష [3]ప్రాణినాం ప్రాణభూతో
దిశతు తవ హితాని ప్రాయశో వాంఛితాని॥ 28

బహుగుణరుచిరమ్ము పాదపశాఖికా
వల్లి నిర్వికార బాంధవమ్ము
ప్రాణికోటికెల్లఁ బ్రాణభూతం బిది
జలదసమయ మెపుడు జలజనయన!

కమ్రమై సతంబు కామినీమానస
హారి సౌఖ్యకారి యగుచు నెగడు
వానకారు విహితవాంఛితముల మీకు
బహుముఖముల నొసఁగి వఱలుఁగాత!

టీ. జలజనయన = ఓ తమ్మికంటీ! జలద సమయము + ఇది = ఈ వర్షాగమము, ఎప్పుడున్ = అన్నివేళలయందును, బహుగుణరుచిరమ్ము =

1 యోషితాం. 2 ఏషాం. 3 ప్రాణినః.

వివిధగుణములచే రమ్యమైనది, పాదపశాఖికావల్లి = చెట్లకుఁ గొమ్మలకుఁ దీఁగెలకును, నిర్వ్యాకార బాంధవమ్ము=ప్రతిఫలాపేక్షలేకయే హితమొనర్చు నట్టిది, ప్రాణికోటికి + ఎల్లన్ = సర్వ జీవులకును, ప్రాణభూతంబు = ప్రాణముతో సమానమైనది.

తా. ఓ చెలీ! ఈ వర్షాగమము, వివిధ దృశ్యములచే రమ్యమైనది. తరులతాదులకు నత్యంతహితమైనది. ఇంతయేల! సర్వప్రాణులకును బ్రాణము వంటిదే యగును.

టీ. క్రమమై = మనోహరమై, సతంబు = ఎల్లప్పుడు, కామినీ మానసహారి = కామినుల చిత్తములను హరించునదియు, సౌఖ్యకారి సుఖదాయకమును, అగుచు, నెగడు = విలసిల్లు, వానకారు=తొలకరి, మీకు= పాఠకులైన మీకు, విహిత వాంఛితములన్ = కోరిన కోర్కులనెల్ల, బహుముఖములన్ = అనేకముగ, ఒసఁగు=ఇచ్చునట్టిదై, వఱలుఁగాక + కాతన్= వర్ధిల్లును గాత.

తా. కామినీమానసహారియుఁ, సౌఖ్యకారియునైన ప్రావృణ్మేఘము, మీకు నెల్లప్పుడు నభిమతార్థంబులను గూర్చునట్టిదై వర్ధిల్లును గాత!



# శరత్తు

కాశాంశుకా వికచపద్మమనోజ్ఞవక్త్రా
సోన్మాదహంసరవనూపురనాదరమ్యా।
ఆపక్వశాలి [1]రుచిరా [2]తనుగాత్రయష్టిః
ప్రాప్తా శరన్నవ వధూరివ [3]హారిరూపా॥ 1

కాశవసన విస్ఫుటమంజుకంజవదన
ప్రోన్మదమరాళరావనూపురవిరావ
ఫలితశాలివినతగాత్ర ప్రాప్తమయ్యె
వరశరద్వేళ నూతనవధువువోలె.

టీ. కాశ = తెల్లుపూవు లనియెడి, వసన = వస్త్రము గలదియు, విస్ఫుట = వికసించిన, మంజు = మనోహరమైన, కంజ = తామరపూవనెడి, వదన = ముఖము గలదియు, ప్ర + ఉత్ + మద = మిక్కిలి మదించిన, మరాళ = హంసలయొక్క, రావ = కలరవము (కూజితము) అనెడు, నూపుర రావ = కాలియందెల మ్రోఁతగలదియు, ఫలితశాలి = పండిన వరి యనెడు, వినతగాత్ర = వంగిన శరీరము గలదియు (ఐ), వరశరత్ + వేళ = శ్రేష్ఠమైన శరత్కాలము, నూతన వధువువోలెన్ = క్రొత్తగా సత్తవారింటికి వచ్చెడు జోడలివలె, ప్రాప్తము + అయ్యెన్ = వచ్చెను.

తా. తెల్లుపూవులనెడి సన్నని తెల్లచీర గట్టుకొని, వికసించిన తెలితమ్మిపూవనెడి నగుమోముతో, మదించిన రాయంచలకూఁతలనెడి యందియల మ్రోఁతతోఁ, బండిన వరిపైరు కట్టయనెడి యించుక వంగిన

1 లలితా. 2 నత. 3 రమ్యరూపా.

యంగముతో, నత్తవారింటికి వచ్చెడు క్రొత్త కోడలివలె శరత్కాలము వచ్చినది.

కాశైర్మహీ శిశిరదీధితినా రజన్యో
హంసైర్జలాని సరితాం కుముదైః సరాంసి।
సప్తచ్ఛదైః కుసుమభారనతైర్వనాంతాః
శుక్లీకృతాన్యుపవనాని చ మాలతీభిః 2

కలువలతేనిచే నిశలు,
కైరవవారముచేఁ గొలంకు లు
జ్జ్వలసుమభారనమ్రనవ
శారదభూరుహపంక్తిచే వన
మ్ములు, నునుతెల్లు పూఁబొదల
భూతల, మంచలబారులన్ స్రవం
తులు, విరిజాజిపూల నన
తోఁటలు తెల్లనివయ్యె నెల్లెడన్.

టీ. ఎల్ల + ఎడన్ = అంతటను, కలువలతేనిచేన్ = చంద్రునిచే, నిశలు = రాత్రులును, కైరవవారముచేన్ = కలువపూవుల సమూహముచే, కొలంకులు = సరస్సులును, ఉత్ + జ్వల = మిక్కిలి ప్రకాశించెడు, సుమ భార = పూలగుత్తుల బరువుచే, నమ్ర = వంగిన, నవ = క్రొత్తవియైన, శారదభూరుహపంక్తిచేన్ = ఏడాకుల యరఁటిచెట్ల చాళ్లచే; వనమ్ములు= తోఁటలును, నునుతెల్లు పూఁబొదలన్ = మృదువైన తెల్లుపూల పొదలచే, భూతలము=భూమియును, అంచలబారులన్=హంసలగుంపులచే, స్రవంతులు = నదులును, విరిజాజిపూలన్ = వికసించిన జాజిపూలచే, ననతోఁటలు = పూఁదోఁటలును, తెల్లనివి + అయ్యెన్ = తెల్లనికాంతితో నిండినవై యున్నవి.

తా. శరత్కాలము రాఁగనే, మొయిలుమాటు దొలంగి చంద మామ ప్రకాశించుచున్నాఁడు. కొలంకులయందుఁ గలువలు వికసించినవి. పూవుగుత్తి బరువునకు వంగిన యేడాకులయరఁటిచెట్లు కప్పురపుఁ బుప్పొడిని వెదఁజల్లుచున్నవి. ప్రవాహములుడిగిన నదులలో రాయంచలు బారులుతీఱి చెలఁగుచున్నవి. తెల్లుపాదలు పూచినవి. ఉద్యానవనములలోని జాజి మొగ్గలు విచ్చి కమ్మనితావుల నెగఁజిమ్ముచున్నవి. ఇట్లగుటచే భూతల మంతయుఁ దెలని కాంతులతో నిండినటున్నది.

[1]వనాన్మనోజ్ఞ శఫరీరశనాకలాపాః
పర్యంతసంస్థితసితాండజ [2]పంక్తిహారాః।
నద్యో విశాల[3]పులినాంతనితంబబింబాః
మందం ప్రయాంతి సమదాః ప్రమదా ఇవాద్య॥ 3

నిగనిగకళలీను నీటఁ దుళ్లెడుమీలు
కమనీయకాంతి మేఖలలుగాఁగఁ,
బర్యంతసంస్థితపాండురాండజపంక్తు
లమలమణిమయహారములుగాఁగ,
లలితవిశాలాచ్ఛపులినాంతసీమలు
మహితనితంబబింబములుగాఁగ,
సలిలబింబితవినిర్మలవారిధరకాంతి
తనువున మేలిచందనముగాఁగఁ,

గూలముల జాలుగొను తెల్లుపూలపొలుపు
నవదుకూలంపు టవగుంఠనమ్ముగాఁగ

1 చఞ్చన్మనోజ్ఞ. 2 భక్తి. 3 పులినోరు.

మెల్లఁగా మెల్లఁగా నదులెల్ల నిపుడు
సమదలౌ ప్రమదలటులు సాగునవిగో!

టీ. ఇపుడు = ఈ శరత్కాలమున, నదులు + ఎల్లన్ = నదులన్నియు, నిగనిగ కళలు + ఈను = నిగనిగమను కాంతులను వ్యాపింపఁజేయుచున్న, నీటన్ + ద్రుళ్లెడు = నీటిలో నెగిరిపడుచున్న, మీలు = చేఁపలు, కమనీయ = మనోజ్ఞమైన, కాంతి = కాంతిగల, మేఖలలుగాఁగన్ = ఒడ్డాణములవలె నుండఁగా,

పర్యంతసంస్థిత = సమీపమునందున్న, పాండుర + అండజపంక్తులు = తెల్లని పిట్టలగుంపులు, అమల = నిర్మలమైన, మణిహారములుగాఁగన్ = మణిసరములవలె నుండఁగా,

లలిత = రమణీయమైన, విశాల = విస్తారమైన, అచ్ఛ = తెల్లని, పులిన + అంతసీమలు = ఇసుకదిబ్బల పైభాగములు, మహిత = కొనియాడఁదగిన, నితంబబింబములుగాఁగన్ = గుండ్రని పిఱుఁదులువోలె విలసిల్లఁగా,

సలిలబింబిత = నీటిలోఁ బ్రతిబింబించిన, వినిర్మల = స్వచ్ఛమైన, వారిధర కాంతి = మేఘముల కాంతి, తనువున = శరీరమునఁ బూసికొన్న, మేలిచందనముగాఁగన్ = శ్రేష్ఠమైన చందనలేపమువలెనుండఁగా,

కూలములన్ = ఒడ్డులమీఁద, జాలుకొను = ఒప్పిదమైయున్న, జెల్లుపూలసొంపు = జెల్లుపూవుల సొబగు, నవదుకూలంపు = క్రొంబట్టు, అవగుంఠనమ్ముగాఁగన్ = మేలిముసుఁగువలెనుండఁగా, సమదలు + ఔ = యౌవనోన్మత్తలైన, ప్రమదలు + అట్లు = యువతులవలె, మెల్లఁగా మెల్లఁగా = మెల్లమెల్లఁగా (నెమ్మదిగా), సాగున్ = సాగిపోవుచున్నవి, అవిగో = (ఓ చెలీ) అవిగో! చూచితివా!

తా. నిగనిగమని మెఱయు నీటిలోఁ ద్రుళ్లిపడెడు చేఁపలు ఒడ్డాణములుగాను, గట్లమీఁది తెల్లని పిట్టచాళ్లు మణిసరములుగాను, విశాలములగు నిసుకతిన్నెలు పిఱుఁదులుగాను, నీళ్లలోఁ బ్రతిబింబించిన వెల్లమబ్బుల కాంతి మేనెలఁ బూసికొనిన గంధముగాను, దరులపై నిల్చి పూచిన జెలు

పూలకాంతి మేలిముసుఁగుగాను దనరారుచుండ, నీ శరత్కాలమున నదులు యౌవనోన్మత్తలైన మందయానలవలె మెల్లఁగా సాగిపోవుచున్నవి. ఓ చెలీ! వానిఁ జూడుము.

వ్యోమ క్వచిద్రజతశంఖమృణాలగౌరైః
[1]పీతాంబుభిర్లఘుతయా శతశః ప్రయాతైః।
[2]సంలక్ష్యతే పవనవేగచలైః పయోదైః
రాజేవ [3]చామరవరై [4]రుపవీజ్యమానః॥ 4

జలముల వీడి చుల్కనయి
స్పర్శనవేగముచే శతంబులై
లలితమృణాళకాండముల
లాగున నొక్కెడ శంఖరూప్యలీ
లల నొకటన్ వెలుంగుచుఁ జ
లత్త్వము నొందు మొగిళ్లచే నభ
స్స్థలము గనంగనయ్యె వర
చామరవీజితుఁడౌ నృపుండునాన్.

టీ. జలములన్ + వీడి = (వర్షించిన పిమ్మట)' నీళ్లులేనివై, (అందువలననే) చుల్కన + అయి = తేలికను గాంచినవై, స్పర్శనవేగము చేన్ = ఒండొంటిని రాచుకొనుట యందలి త్వరచే, శతంబులు + ఐ = పెక్కు తునియలై, ఒక్క + ఎడన్ = ఒకచోట, లలితమృణాళకాండ ముల లాగునన్ = సొంపైన తామరతూఁడులవలెను, ఒకటన్=మఱియొక చోట, శంఖరూప్య లీలలన్ = శంఖమును వెండినిఁబోలిన కాంతిగలవై, వెలుంగుచున్ = ప్రకాశించుచు, చలత్త్వమున్ + ఒందు=(గాలితాఁకునకు)

1 వ్యక్తాంబుభిః, త్యక్తాంబుభిః. 2 ఉత్ప్రేక్ష్యతే. 3 చామరశతైః. 4 అపివీజమానః.

కదలుచున్న, మొగిళ్ల చేఁ = మబ్బులతో, నభస్ + స్థలము = ఆకాశము, వరచామరవీజితుఁడు + ఔ = శ్రేష్ఠమైన వింజామరలతో వీవఁబడుచుండెడి, నృపుండునాఁ = చక్రవర్తియో యనునట్లు, కనఁ + కఁ + అయ్యెఁ = కనఁబడుచున్నది

తా. వర్షించినపిదప జలభారమునుబాసి, యొండొంటితో రాచుకొని ముక్కలై, శంఖము, వెండి, తామరతూఁడులవలె తెల్లని కాంతిగలవై గాలితాఁకునకు నించుకించుక కంపించుచుండెడి శరన్మేఘములతో నిండిన యాకాశము, చామరములచే వీవఁబడుచున్న మహారాజును బోలియున్నది.

భిన్నాంజన ప్రచయకాన్తి నభోమనోజ్ఞం
బంధూకపుష్ప[1]నికరై రుచిరా చ భూమిః।
వప్రాశ్చ [2]చారుకలమాకరభూమిభాగాః
[3]ప్రోత్కంఠయన్తి న మనోభువి కస్య యూనః॥ 5

భిన్నకజ్జలచయనీలవిభము నభము,
నిబిడబంధూకకుసుమారుణితము ధరణి,
పక్వకలమాచితక్షితుల్ వప్రతతులు,
తరుణులమనంబులకు మహోత్కంఠఁ గూర్చు.

టీ. నభము = ఆకాశము, భిన్న = నూరఁబడిన, కజ్జలచయ = కాటుక ప్రోవువంటి, నీలవిభము = నల్లని కాంతి గలది, ధరణి = భూమి, నిబిడ = దట్టమైన (ఎక్కువగా పూచిన), బంధూకకుసుమ = మంకెన పూలచే, అరుణితము = ఎఱ్ఱగాఁ జేయఁబడినది, వప్రతతులు = వరిమళ్లు, పక్వకలమ = పండిన వరిపైరులచే, ఆచిత = కప్పఁబడిన, క్షితుల్ = భూ

1 రజసారుణితా, రచితారుణతా. 2 పక్వకలమా, కమలావృత. 3 ఉత్కంఠయన్తి.

భాగములు గలవి, (ఇట్టి దృశ్యములు), తరుణుల మనంబులకున్ = యువతీ యువకుల చిత్తములకు, మహా + ఉత్కంఠన్ = గొప్ప యుత్సాహమును, కూర్చున్ = కలిగించును.

తా. చిక్కఁగా నూరఁబడిన కాటుకవలె నల్లనైన యాకాశమును, మంకెనపూలకాంతిచే నెఱ్ఱనైన భూమియు, పండిన పైరుచేఁ గప్పఁబడిన వరిమళ్లును, యువకజనచిత్తమునకు నుత్సాహమును గల్గించుచున్నవి.

మందానిలాకులిత [1]చారుమనోజ్ఞశాఖః
పుష్పోద్గమప్రచయకోమలపల్లవాగ్రః।
మత్తద్విరేఫపరిపీతమధుప్రసేక
శ్చిత్తం విదారయతి కస్య న కోవిదారః। 6

లలితలతాచయాంచలము
లన్ మృదులానిలముల్ గదల్పఁ, జే
తలకిసలాగ్రముల్ కుసుమ
జాతసమున్నతి సొంపునింప, నె
చ్చెలి! సముదాలిపీతమధు
సేకభరంబగు కోవిదార మ
గ్గలముగ నేనిచిత్తము న
గల్పదు? శారదవాసరంబులన్.

టీ. నెచ్చెలీ! శారదవాసరంబులన్ = శరత్కాలమున, లలిత = మనోజ్ఞమైన, లతాచయ + అంచలములన్ = తీఁగెమొత్తముల కొనలను, మృదుల + అనిలముల్ = మెల్లని గాలులు, కదల్పన్ = కదలించుచుండఁగా,

1 చారువిశాల, చారుతరాగ్ర.

పేశల = మృదువైన, కిసల + అగ్రముల్ = చిగుళ్లతో నిండిన కొనకొమ్మలు, కుసుమజాత సమున్నతిన్ = పూలు పూచుటచేఁ గల్గిన శోభతో, సొంపు నింపన్ = అందమును గూర్పఁగా, సమద + అలి = మదించిన తుమ్మెదలచే, పీత = త్రాఁగఁబడిన, మధుసేకభరంబు + అగు = పూవుఁదేనెతోఁ దడుపఁబడినదగు, కోవిదారము = ఎఱ్ఱకాంచనపుఁజెట్టు, ఏనిచిత్తమున్ = ఎవ్వని మనస్సును, అగ్గలమునన్ = మిక్కిలిగా, అగల్పదు = కలవరపెట్టదు.

తా. చెలీ! ఈ శరత్కాలమున నెఱ్ఱకాంచనపుఁజెట్టు కొనగొమ్మలఁ బూర్తిగాఁ జిగిర్చియున్నది. ఆ చివుళ్లు మెల్లనిగాలి తాఁకున కించించుక చలించుచున్నవి. కొనగొమ్మలనుండు పూలలోని తేనెను దుమ్మెదలు గ్రోలుచుండ నా తేనియ జాఱి చెట్టునంతయుఁ దడుపుచున్నది. ఇట్టిదృశ్య మెవ్వనికైనను బ్రీతినించునుగదా!

తారాగణప్రవరభూషణముద్వహన్తీ
[1]మేఘావరోధపరిముక్తశశాంకవక్త్రా।
జ్యోత్స్నాదుకూల మమలం రజనీదధానా
వృద్ధిం ప్రయాత్యనుదినం ప్రమదేవ బాలా। 7

చుక్కలను చారుభూషణశ్రేణిఁ దాల్చి
వెలఁది నెలవెలుంగను పట్టువలువఁ గట్టి
మొగులుముసుఁ గేదు చందురుమోముతోడఁ
బ్రమదయగు బాలవలె రాత్రి ప్రబలు నిపుడు.

టీ. వెలఁదీ = ఓ చెలీ! ఇపుడు = ఈ శరత్కాలమున, రాత్రి, చుక్కలు + అను = నక్షత్రములనెడు, చారుభూషణశ్రేణిన్ + దాల్చి = మనోజ్ఞములైన సొమ్ములను ధరించి, నెలవెలుంగు + అను = వెన్నెలయనెడు, పట్టువలువన్ = పట్టుచీరను, కట్టి = ధరించి, మొగులుముసుఁగు + ఏగు =

1 మేఘోపరోధ.

మబ్బులనెడి మేలిముసుంగును దాలంగఁద్రోసికొని బయల్వెడలుచున్న, చందరు మోముతోడన్ = చందమామయనెడి మొగముతో, ప్రమద యగు = యౌవనావిర్భావముగల్గిన, బాలవలెన్ = బాలికవలె, ప్రబలున్ = దిన దినాభివృద్ధి గాంచుచున్నది.

తా. ఓ చెలీ! శరత్కాలపురాత్రి, చుక్కలనెడి సొమ్ములను ధరించి, వెన్నెలయను తెల్లని చీరను గట్టుకొని, మబ్బులనెడి మేలిముసుఁగును దాలంచికొని, బయల్వెడుచున్న చందురుఁ డనెడి మోముతోఁగూడినదై, యౌవనారంభదశలోనున్న బాలికవలె దినదినప్రవర్ధమాన యగుచున్నది. అనఁగా వెన్నెల నానాఁటికి నతిశయ మగుచున్నదని భావము.

కారండవాననవిఘట్టితవీచిమాలాః।
కాదంబసారస[1]కులాకుల తీర దేశాః।
కుర్వన్తి హంసవిరుతైః పరితో జనస్య
ప్రీతిం [2]పరాం కమల రేణువృతా స్తటిన్యః॥ 8

కారండవాననకఠినవిఘట్టిత
ప్రకటతరంగమాలికలతోడ,
సారసకలహంససముదయానారత
సంకీర్ణ తీర దేశములతోడ,
సర్వోపనిర్భిన్న శతపత్త్ర పుష్కర
జక్షోణిత మనోజ్ఞ జలముతోడఁ,
బ్రత్యగ్ర సంఫుల్ల వనజప్లవస్థిత
చక్రాంగ విరుతిసంచయముతోడఁ,

1 చయాకుల. 2 సరోరుహరజోఽరుణితాశ్చనద్యః, సరోరుహరజోఽరుణితా స్తటిన్యః.

బవనపోతచలితసవిధపాదపగళత్
సురభిళప్రసూనభరముతోడ,
నవ్యశోభ గన్ననదులెన్నొ జనులకు
సంతసమ్ము గూర్చు సంతతమ్ము.

టీ. కారండవ + ఆనన = కన్నె లేడిపిట్టల ముక్కులచే, కఠినవి ఘట్టిత = గట్టిగాఁ బొడువఁబడిన, ప్రకట = స్ఫుటమైన, తరంగమాలికల తోడన్ = అలల వరుసలతోను,

సారస = బెగురుపిట్టల, కలహంస = అంచల, సముదయ = సమూహముచే, అనారత = ఎల్లప్పుడును, సంకీర్ణ = నిండిన, తీరదేశములతోడన్ = గట్టులతోడను,

సద్యఃవినిర్భిన్న = అప్పుడే వికసించిన, శతపత్రపుష్ప = తామర పుష్పములయొక్క, రజస్ = పుప్పొడిచేత, శోణిత = ఎఱ్ఱగాఁ జేయఁబడిన, మనోజ్ఞ = రమణీయమైన, జలముతోడన్ = నీటితోను, ప్రత్యగ్ర = క్రొత్తగా, సంఫుల్ల = లెస్సగా వికసించిన, వనజప్లవ = తామరపూవుల నెడి తెప్పలయందు, స్థిత = ఉండునట్టి, చక్రాంగ = చక్రవాకపక్షులయొక్క, విరుతిసంచయముతోడన్ = కలకలారవములతోడను,

పవనపోత = పిల్లగాలి తాఁకునకు, చలిత = కదల్పఁబడిన, సవిధ = సమీపమునందున్న, పాదప = చెట్లనుండి, గళత్ = రాలుచున్న, సురభిళ = పరిమళయుక్తమైన, ప్రసూనభరముతోడన్ = పుష్పసమూహముతోడను (కూడినవియై), నవ్యశోభన్ + కన్న = క్రొత్తకాంతిని వహించిన, నదులు + ఎన్నొ = ఎన్నియో నదులు, సంతతమ్ము = ఎల్లవేళలయందును, జనులకున్ = చూచువారలకు, సంతసమ్మున్ = ఆనందమును, కూర్చున్ = కల్గించుచున్నవి.

తా. కన్నె లేడిపిట్టల ముక్కులచే గట్టిగాఁ బొడువఁబడిన యలల తోను, ఎల్లప్పుడు గట్టులమీఁద నిలచియుండు నంచ, బెగురుపిట్టలతోను, అప్పుడే వికసించిన తామరపూలనుండి రాలిన పుప్పొడిచే నెఱ్ఱనైన నీళ్ల

తోను, క్రొత్తగా వికసించిన తమ్మిపూల దొప్పలయందుఁ గూర్చుండి కల కలార్భటులు లొనర్చుచుండు జక్కవగమిలోను, చిల్లగాలి తాఁకునకుఁ జెంత నున్న చెట్లనుండి రాలిన పూవుల కమ్మనితావులతోను గూడి నదులన్నియు సర్వజనానందకరముగా నున్నవి.

నేత్రోత్సవో హృదయహారి మరీచిమాలః
ప్రహ్లాదకః శిశిరశీకరవారివర్షీ ।
పత్యుర్వియోగవిషదిగ్ధశరక్షతానాం
చంద్రో దహ[1]త్యనుదినం తనుమంగనానామ్॥ 9

అతివమిన్న! శిశిరశీక
రాంబువర్షి, దృక్ప్రియుం,
డతిమనోహరాంశుయుతుఁడు,
హర్షకుండు, విధుఁ డహో!
పతివియోగవిషవిలిప్త
బాణహతుల నొగులు గు
బ్బెతల తనువులం గరంబు
వేఁచుచుండె నిత్తఱిన్.

టీ. అతివమిన్న=ఓ ప్రేయసీ (స్త్రీలలో నుత్తమురాలవైనదానా!) ఈ + తఱిన్ = ఇప్పుడు, శిశిరశీకర + అంబువర్షి = చల్లని నీటితుంపురలను జిలకరించువాఁడును, దృక్ + ప్రియుండు = చూచుట కింపైనవాఁడును, అతిమనోహర + అంశుయుతుఁడు = మిక్కిలి సొంపైన కిరణములతోఁ గూడినవాఁడును, హర్షకుండు = సంతోషదాయియు, (అగు), విధుఁడు= చంద్రుఁడు, అహో = అయ్యో, పతివియోగ = ప్రియుని యెడఁబాటనెడి, విషవిలిప్త = విషములో ముంచియెత్తిన, బాణహతులన్ = అమ్ముప్రేటులకు,

1 అతితరాం.

నొగులు = బాధపడుచుండు, గుబ్బెతలతనువులన్ = జవ్వనుల శరీరములను, కరంబు = ఎక్కువగా, వేఁచుచుండెన్ = బాధపెట్టుచున్నాఁడు.

తా. ఓ చెలీ! ఈ శరత్కాలమున విరహిణులు, మన్మథబాణక్షత గాత్రలై మిక్కిలి పరితపించుచున్నారు. చల్లని జలబిందువులను వర్షించుచుఁ గనులపండువుగా వెలుఁగుచున్న యీ జాబిల్లి యట్టివారల నింకను వేధించుచున్నాఁడు.

ఆకంపయ న్ఫలభరానతశాలిజాలా
నానర్తయం [1]స్తరువరా న్కుసుమావనమ్రాన్।
[2]ఉత్ఫుల్లపంకజవనాం నలినీం విధున్వ
న్యూనాం [3]మనశ్చలయతి ప్రసభం నభస్వాన్॥ 10

ఫలభరానతశాలిపంక్తులను నూఁచు,
నర్తిలం జేయుఁ గుసుమావనమ్రతరుల,
మొనసి వికచాబ్జవనను నళినిఁ గదల్చుఁ,
బవనుఁడు, యువమానసముల బలిమిఁ గలఁచు.

టీ. పవనుఁడు = గాలి, ఫలభర + ఆనత = కంకులబరువుచే వంగిన, శాలిపంక్తులన్ = వరిపైరులను, ఊఁచున్ = మెల్లఁగాఁ గదలించును, కుసుమ + అవనమ్ర = పువ్వుల బరువుచే వంగిన, తరులన్ = వృక్షములను, నర్తిలన్ + చేయున్ = ఆడుచున్నవో యనునట్లు కదలించుచున్నాఁడు, మొనసి = ఎగుర్కొని (తాఁకి), వికచ + అబ్జవనను = వికసించిన తామరపూవులతోఁ గూడిన, నళినిన్ = తామరతీఁగెను, కదల్చున్ = కదలించును, బలిమిన్ = బలాత్కారముగ, యువమానసములన్ = యువతీయువకుల చిత్తములను, కలఁచున్ = కలవరపెట్టుచున్నాఁడు.

1 కురవకాన్. 2 ప్రోత్ఫుల్ల. 3 స్ఖలయతి, మదయతి.

తా. శరత్కాలమున వరిపైర్లు పండి కంకుల బరువునకు వంగి గాలి తాఁకునకు మెల్లఁగాఁ గదలుచున్నవి. పువ్వుల బరువునకు వంగిన చెట్లును గాలికిఁ దలలూఁచుచున్నవి. వికసించిన పుష్పములతోఁ గూడిన తామరయు నట్లే చలించుచున్నది. ఇట్టి మనోజ్ఞదృశ్యములతో నిండిన మందమారుతము యువకజనచిత్తములను గలవరపెట్టుచున్నది.

సోన్మాదహంసమిథునై రుపశోభితాని
[1]స్వచ్ఛాని ఫుల్లకమలోత్పలభూషితాని।
[2]మందప్రభాత [3]పవనాహతవీచిమాలా
న్యుత్కంఠయన్తి [4]సహసాహృదయం సరాంసి॥ 11

మహితమదమరాళమిథునమండితములు,
స్వచ్ఛములు, స్ఫుటోత్పలకంజబంధురములు,
ప్రాతరనిలార్భకోద్గతభంగతతులు,
కొలఁకులు బలిమి మదికి నుత్కలికఁ గూర్చు.

టీ. మహిత = కొనియాడఁదగిన, మదమరాళమిథున = మత్తిలిన రాయంచకవలచే, మండితములు = అలంకరింపఁబడినవియు, స్వచ్ఛములు = నిర్మలజలములుగలవియు, స్ఫుట + ఉత్పల = వికసించిన కలువలతోను, కంజ=తామరలతోను, బంధురములు=మనోహరములైనట్టివియు, ప్రాతః + అనిల + అర్భక = ప్రాతఃకాలపుఁ జిఱుగాడ్పులచే, ఉద్గత = పైకెగురుచున్న, భంగతతులు = అలలగుంపులు గలవియు (ఐన) కొలఁకులు = సరస్సులు, బలిమిన్ = బలాత్కారముగా, మదికిన్ = మనస్సునకు, ఉత్కలికన్ + కూర్చున్ = ఉత్సాహమును గల్గించుచున్నవి.

తా. శరత్కాలము రాఁగానే రాయంచలు జంటలుగట్టి కొలఁకులలో విహరించుచున్నవి. తామరలు కల్వలు దట్టముగాఁ [redacted]న

1 స్వచ్ఛానిఫుల్ల. 2 మందంప్రభాత, మందప్రచార। పవనోద్గత. 4 హృదయం ప్రసభం.

జామునవీచు పిల్లగాలులకుఁ గొలఁకులలోని యలలు దరులనుదాఁకి మిట్టిపడు చున్నవి. ఇట్టి దృశ్యములు చూచువారి కెంతయో వేడుకగొల్పుచున్నవి.

నష్టం [1]ధనుర్వలభిదో జలదోదరేషు
సౌదామినీ స్ఫురతి [2]నాద్యవియత్పతాకా।
ధున్వన్తి పక్షపవనైఃన నభోబలాకాః
పశ్యన్తి నోన్నతముఖా గగనం మయూరాః॥ 12

జలధరోదరమున శక్రచాపము డింగె
మింటిసిడము మెఱపు మెఱయదిపుడు,
తెక్కగాలి నింగిఁ గొక్కెరలూఁప, వా
ననము నెత్తి నెమ్మి నభముఁ గనదు.

టీ. శక్రచాపము = ఇంద్రధనుస్సు, జలధర + ఉదరమున = మేఘగర్భమున, డింగెన్ = అడఁగిపోయెను, మింటిసిడము = ఆకాశమునఁ బతాకవలెనుండు, మెఱపు, ఇపుడు = ఈ శరత్కాలమున, మెఱయదు, కొక్కెరలు = కొంగలు, తెక్కగాలిన్ = తెక్కలను విదిలించుటవలనఁ బుట్టు గాలిచే, నింగిన్ = ఆకాశమును, ఊఁపవు = కదలింపవు, నెమ్మి = నెమిలి, ఆననము + ఎత్తి = మొగమెత్తి, నభమ్మున్ + కనదు = ఆకసము వంకఁ జూడదు.

తా. వర్షర్తువందు మేఘములతో నల్లుకొనియున్న యింద్రధనుస్సు శరత్కాలము రాఁగానే మాయమైనది. ఆకాశమునఁ బతాకవలె నెగురుచున్న మెఱపును నేఁడు గానరాదు; వర్షజలబిందుస్నానాతురములై యాకాశమున నెగయుచుండు కొక్కెరలీనాఁడు గానరావు. తొలకరి మబ్బులనుగాంచి తలలెత్తి యాడు నెమిళ్లు నేఁడాకసమువంకనైనఁ జూడకున్నవి. (ఆకసము మేఘాడంబరరహితమై స్వచ్ఛముగా నున్నదని భావము.)

1 ధనుర్బలభిదో. 2 నాపి.

న్నృత్యప్రయోగరహితాంచ్ఛిఖినోవిహాయ
హంసానుపైతి మదనో మధురప్రగీతాన్।
[1]త్యక్త్వాకదంబకుటజార్జునసర్జనీపా
న్సప్తచ్ఛదానుపగతా కుసుమోద్గమశ్రీః॥ 13

స్మరుఁడు విధుతనృత్యమయూరసమితి విడిచి
మధురగీతమ్ములైన హంసములఁ గదిసెఁ,
కుసుమలక్ష్మి నీపకదంబకుటజసర్జ
కకుభముల వీడి శారదాగములఁ జేరె.

టీ. స్మరుఁడు=మన్మథుఁడు, విధుతనృత్య=విడువఁబడిన నృత్యము గల, మయూరసమితిన్ = నెమిళ్ల గుంపును, విడిచి = వదిలిపెట్టి, మధుర గీతమ్ములు + ఐన=కలరవములు చేయుచున్న, హంసములన్ =రాయంచలను, కదిసెన్ = చేరెను, కుసుమలక్ష్మి = పుష్పశోభ, నీపకదంబకుటజసర్జ కకుభములన్ + వీడి=కడిమి, కొండిసె, ఏపి, మద్ది మొదలైన చెట్లను వదలి; శారద + అగములన్ = ఏడాకులరఁటిచెట్లను, చేరెన్ = చేరినది.

తా. వర్షాకాలమున మయూరనృత్యములు, పుష్పితకదంబకకుభాదివృక్షములు మన్మథోద్దీపకములై యుండినవి. ఇప్పుడు వానికిమారుగా రాయంచల కలరవములు, ఏడాకులరఁటిచెట్లు కామదోహదములై యున్నవి.

శేఫాలికా కుసుమ [2]గంధమనోహరాణి
స్వస్థస్థితాండజ [3]కులప్రతినాదితాని।
పర్యంతసంస్థితమృగీనయనోత్పలాని
ప్రోత్కంఠయంత్యుపవనాని మనాంసి పుంసామ్॥ 14

1 ముక్త్వా.
2 రాగ. 3 గణ.

భవ్యశేఫాలికాగంధబంధురములు,
స్వస్థసంస్థితాండజకుల ప్రతిరవములు,
నొకట సవిధస్థితమృగీదృగుత్పలమ్ము,
లుపవనమ్ములు హృదయ ముఱ్ఱూఁతలూఁచు.

టీ. భవ్య = కొనియాడఁదగిన, శేఫాలికాగంధ=నల్లవావిలిపూల వాసనలతో, బంధురములు = మనోహరములైనవి, స్వస్థసంస్థిత = భయరహితములై కూర్చొనియున్న, అండజకుల = పక్షిసమూహములయొక్క, ప్రతిరవములు = ప్రతిధ్వనించునట్టి కూఁతలుగలవి; ఒకటన్ = ఒక్కొక్కతావులందు, సవిధస్థిత = సమీపమున (తిరుగుచుండు), మృగీదృక్ + ఉత్పలములు = నల్లని కన్నులుగల యాఁడులేళ్లతోఁ గూడినవి, (ఐ) ఉపవనమ్ములు = ఉద్యానవనమ్ములు, హృదయమున్, ఉఱ్ఱు + ఊఁతలు= ఊఁచున్ =(ఆనంద) డోలికలలో నూఁచుచున్నవి.

తా. శరత్కాలము రాఁగానే ఉద్యానవనములనిండ నల్లవావిలి పూలు పూచినవి. పిట్టలు లేళ్లు దవానలభీతి దొలంగి హాయిగాఁ దిరుగుచున్నవి. ఇట్టి దృశ్యములు చూపఱ హృదయమున కెంతో సంతసము గూర్చుచున్నవి.

కహ్లార పద్మ[1]కుముదాని [2]ముహుర్విధున్వన్
తత్సంగమా దధికశీతలతా[3]ముపేతః।
[4]సోత్కంఠం కరోతి వనితాం పవనః ప్రభాతే
పత్రాంత లగ్నతుహినాంబు విధూయమానః। 15

జలజకహ్లారకైరవంబులఁ గదల్చి,
వానిసోఁకున మఱియుఁజల్వను వహించి,

1 కుసుమాని. 2 ముదా. 3 ఉపేత్య. 4 ఉత్కంఠయా న్వితరాం.
5 తుహినాని హారం సరూణాం.

రాల్చుచు దళాంతహిమబిందురాజి నిపుడు
కల్యపవమాన మతితరోత్కలికఁ గూర్చె.

టీ. కల్యపవమానము = వేగుజామున వీచుగాలి, జంజకహ్లార కైరవంబులన్ + కదల్చి తామరలను, ఎఱ్ఱకల్వలను, తెల్లకల్వలను గదలించి, వాని సోఁకునన్ = వాని స్పర్శవలన, మతియున్ + చల్వను వహించి = మిక్కిలి చల్లనై, దళ + అంతహిమబిందురాజిన్ = (ఆ పూవుల) ఱేకుల కొనకంటియున్న మంచుబొట్లను, రాల్చుచు, ఇపుడు, ఉత్కలికన్ + కూర్చెన్ = సంతోషమును గలిగించెను.

తా. ప్రత్యూషవాతపోతములు, కమలకహ్లారకైరవముల పైనఁ బర్వి, దళాగ్రహిమబిందువుల రాల్చుచు, సురభిశీతలశోభితములై యత్యంత సంతోషమును గూర్చుచున్నవి.

సంపన్నశాలినిచయావృత భూతలాని
[1]స్వస్థస్థిత ప్రచురగోకులశోభితాని।
హంసైః [2]ససారసకులైః ప్రతినాదితాని
సీమాంతరాణి జనయన్తి [3]నృణాం ప్రమోదమ్॥ 16

ప్రచురశాలిపరీవృతావనితలములు,
స్వస్థసంస్థితగోబృందబంధురములు,
సారసకలహంస ప్రతిశబ్దితములు,
హర్షమిడు జనంబులకు సీమాంతరములు.

టీ. సీమ + అంతరములు = ఊరి పొలిమేరలు, ప్రచుర = దట్టముగా, శాలి = వరిపైరుచేత, పరీవృత = కప్పఁబడిన, అవనితలములు = భూభాగ

1 సుస. 2 చ పారప. 3 సుఖా

ములు గలవియు, స్వస్థ=నెమ్మదిగ, స్థిత=ఉన్న, గోబృంద=ఆవులమందచే, బంధురములు=మనోజ్ఞములైనవియు, సారసకలహంస=అంచ బెగ్గురుపిట్టల ప్రతిశబ్దితములు = కలరవ ప్రతిశబ్దము గలవియు (ఐ), జనంబులకున్ = జనులకు, హర్షమున్ + ఇడున్=సంతోషమును గలిగించుచున్నవి.

తా. పండిన పైర్లచేఁ గప్పఁబడిన వరిమళ్లతోను, దావదవానల భీతి దొలఁగి నెమ్మదిగనున్న గోవులతోను, గొలంకులఁ గలకలార్భటులొనరించు హంససారసములతోను గూడిన, గ్రామోపకంఠములు చూడ వేడుక గొల్పుచున్నవి.

హంసైర్జితా సలలితా గతిరంగనానా
మంభోరుహైర్వికసితైర్ముఖ చన్ద్రకాంతిః।
నీ లోత్పలైర్మదకలాని [1]విలోకితాని
భ్రూవిభ్రమాశ్చ [2]రుచిరాస్తనుభిస్తరంగైః॥ 17

సతుల సులలితగతుల హంసములు గెలిచె,
సమదవీక్షల నీలోత్పలములు గెలిచె,
వదనశశికాంతుల వికచాబ్జములు గెలిచె,
బొమబెడంగులఁ జిఱుతరంగములు గెలిచె.

టీ. సతుల=స్త్రీలయొక్క, సులలితగతులన్=మనోజ్ఞమైన నడకలను, హంసములు=అంచలు, గెలిచెన్=అతిక్రమించినవి, సమదవీక్షలన్ మదించిన చూపులను, నీల + ఉత్పలములు = నల్లకల్వలు, గెలిచెన్, వదనశశికాంతిన్ = చంద్రునివంటి మోమునయొక్క శోభను, వికచ + అబ్జములు = వికసించిన తామరపూలు, గెలిచెన్, బొమబెడంగులన్ = కనుబొమల విలాసమును, చిఱుతరంగములు = చిన్నయలలు, గెలిచెన్.

1 విలోచనాని. 2 సరితాం.

తా. రాయంచల నడబెడంగులు విలాసినీమందయానముల నధిగమించుచున్నవి. వికసించిన నల్లగల్వల శోభ, స్మరమదోద్దీపితమైన జవరాండ్ర నేత్రశోభను దిరస్కరించుచున్నది. వికసించిన తామరపూవులు చంద్రవదనల ముఖసౌందర్యమును బరిహసించుచున్నవి. కొలంకులలోని చిఱుత యలలతీరు, కామినుల కనుబొమల వక్రతను మించియున్నది. ఇట్లు, శరదిందిర సౌందర్యము సామాన్యస్త్రీ సౌందర్యమును మించియున్నదని భావము.

శ్యామాలతాః కుసుమభార నతప్రవాళాః
స్త్రీణాం హరన్తి [1]ధృతభూషణబాహుకాన్తిమ్।
[2]దంతావభాసవిశదస్మిత [3]చంద్రకాన్తిం
[4]కంకేళి పుష్ప[5]రుచిరా నవ[6]మాలతీ చ॥ 18

పడఁతుకల చారుభూషణబాహుశోభఁ
గుసుమనతపల్లవప్రియంగులు హరించె,
రదనభాసాచ్ఛదరహాసరాజకాంతిఁ
గలితకంకేళినవమాలతులు హరించె.

టీ. కుసుమనత = పూలబరువునకు వంగిన, పల్లవ ప్రియంగులు = చివురాకులతోఁగూడిన తీఁగెలు, పడఁతుకల = స్త్రీలయొక్క, చారుభూషణ = అందమైన నగలతో నలంకరింపఁబడిన, బాహుశోభఁ=చేతుల కాంతిని, హరించెఁ = అతిక్రమించెను, కలిత=రమణీయములైన, కంకేళి= అశోకపుష్పములను, నవమాలతులు = క్రొత్త జాజులును, రదనభాస = దంతకాంతులతో నొప్పు, అచ్ఛ = తెల్లని, దరహాసకాంతిఁ=చిఱునవ్వు శోభను, హరించెఁ = గెలిచెను.

1 భృత. 2 దంతేవిభాస. 3 వస్త్రకాన్తిం. 4 సాశోక. 5 రచితా. 6 నవమాలికా చ.

తా. శరత్కాలమునఁ జిగిర్చి పుష్పభారమునకు వంగిన తీఁగెలు, భూషణాలంకృతమైన వనితాహస్తములకంటె విలాసవంతములుగా నున్నవి. వికసించిన యశోకపుష్పములతోఁగూడిన జాజిమొగ్గలు కామినుల చిఱునవ్వుఁ జెలువు నపహసించుచున్నవి. ఇచ్చట ఎఱ్ఱని అశోకపుష్పములు పెదవులకును, తెల్లని జాజిమొగ్గలు దంతములకును బోలికగాఁ జెప్పఁబడినవి.

కేశాన్నితాంత ఘననీలవికుంచితాగ్రా
నాపూరయన్తి వనితా నవమాలతీభిః।
కర్ణేషు చ [1]ప్రసర కాంచన[2]కుట్మలేషు
నీలోత్పలాని [3]వివిధాని [4]నివేశయన్తి॥ 19

పసిఁడికమ్మదోయి పరఁగువీనులఁ జెలుల్
పలువితంపునల్లకలువవిరుల,
శ్యామసాంద్రకుంచితాగ్ర కేశమ్ములఁ
గ్రొత్తజాజిపూలఁ గూర్చినారు.

టీ. చెలుల్ = స్త్రీలు, పసిఁడికమ్మదోయిన్ = బంగరుకమ్మజతతో, పరఁగు = ఒప్పుచున్న, వీనులన్ = చెవులందు, పలువితంపు = అనేకవిధములైన, నల్లకలువవిరులన్ = నల్లకల్వ పూలను, శ్యామ = నల్ల, సాంద్ర = దట్టమైన, కుంచిత + అగ్ర = ముడివేయఁబడిన కొనలతోఁ గూడిన, కేశమ్ములన్ = వెండ్రుకలందు, క్రొత్తజాజి పూలన్ = అప్పు వికసించిన జాజిపూవులను, కూర్చినారు = ధరించియున్నారు.

తా. శరత్కాలము రాఁగానే నల్లగల్వలు, జాజులు విరివి బూచినవి. విలాసినులు, చెవులలోఁ గమ్మలతోఁబాటు కల్వలను, కొప్పులఁ జాజిపూలను బెట్టుకొనుచున్నారు.

1 ప్రచుర, ప్రచల. 2 కుండలేషు. 3 వికచాని. 4 నివేశయన్తే

హారైః సచందనరసైః స్తనమండలాని
శ్రోణీతటం సువిపులం రశనాకలాపైః।
పాదాంబుజాని [1]కలనూపురశేఖరైశ్చ
నార్యః ప్రహృష్టమనసోఽద్య విభూషయన్తి॥ 20

జలజదళాక్షి! చందనర
సమ్ము సరమ్ము లురోజమండలం
బుల, రశనాకలాపముల
భూరివిశాలకటీతటంబులం,
గలరవనూపురంబులను
గమ్రపదాబ్జములన్, సరోజనే
త్రలు గయిసేయుచుండిరి ని
రర్గళహర్ష భరాంతరంగలై.

టీ. జలజదళ + అక్షి! = తామర రేకులవంటి కన్నులుగలదానా! సరోజనేత్రలు = పద్మపత్రములవంటి కన్నులుగల స్త్రీలు, నిరర్గళ=అడ్డు లేని, హర్ష భర = సంతోషాతిశయముగల, అంతరంగలు = మనస్సులు కల వారై, ఉరోజమండలములన్=గుండ్రని చన్నులపైన, చందనరసమ్మున్ = చందనద్రవమును, సరమ్ములున్ = ముత్యాల హారములను, భూరివిశాల = మిక్కిలి విస్తారములైన, కటీతటంబులన్ = పిఱుఁదులపైన, రశనాకలాప ములన్ = కాంచీభూషలను, క్రమపద + అబ్జములన్ = రమణీయములైన తామరపూవులనుబోలు పాదములందు, కలరవ = ఇంపుగాఁ జప్పుడుసేయు, నూపురంబులను = గజ్జెలకడియాలను, కయిసేయుచుండిరి = అలంకరించు చున్నారు.

1 వర.

తా. కాంతా! శరత్కాలమున సీమంతినులు సంతోషాతిశయము గలవారై, కుచమండలములపైఁ జందనపంకముక్తాహారములను, బిఱుఁదులపైఁ గాంచీమాలికలను, పాదములపై ఘల్లు ఘల్లు మని చెవి కింపుగ సద్దుచేయు గజ్జెల కడియాలను అలంకరించుకొనుచున్నారు.

స్ఫుటకుముదచితానాం రాజహం[1]సస్థితానాం
[2]మరకతమణిభాసా వారిణాభూషితానాం।
శ్రియమతిశయరూపాం వ్యోమ తోయాశయానాం
వహతి విగతమేఘం చంద్రతారావకీర్ణమ్॥ 21

సమదహంసాశ్రితము ఫుల్లకుముదచితము
స్ఫురితమరకతద్యుతివారిభూషితమ్ము
నగు జలాశయతతిశోభ నందు నభము
విగతజలదమ్ము తారేందువిలసితమ్ము.

టీ. సమదహంస = మదించిన హంసలచే, ఆశ్రితము = ఆశ్రయింపఁబడినదియు, ఫుల్లకుముదచితము = వికసించిన కల్వపూలచే వ్యాప్తమైనదియు, స్ఫురిత = ప్రకాశించు, మరకతద్యుతి = మరకత మణికాంతులవంటి, వారి = నీటిచే, భూషితము = శోభాయమానమైనదియు, అగు = అయినట్టి, జల + ఆశయతతిశోభ = కొలఁకులశోభను, విగతజలదమ్ము = వర్షమేఘరహితమైనదియు, తార + ఇందు విలసితమ్ము = చుక్కలతోను జంద్రునితోను దీపించునట్టిదియు (ఐన), నభము = ఆకాశము, అందుఁ = కలిగియున్నది.

తా. శరత్కాలమున, రాయంచలకు నునికిపట్టులై, పూచిన తామరలతోఁగూడ, మరకత మణులవలె స్వచ్ఛమైన నీటితో నిండిన కొలఁకులును, మేఘరహితమై నక్షత్రచంద్రదీపితమైన యాకాశమును బరస్పరసదృశశోభను దాల్చియున్నవి.

1 సాశ్రితానామ్. 2 మరకతమణిభాసాం వారిణాం భూషితాని.

శరది [1]కుముద[2]సంగాద్వాయవో వాంతిశీతా
[3]విగతజలదబృందా దిగ్విభాగా మనోజ్ఞాః।
విగతకలుషమంభః [4]శ్యానపంకా ధరిత్రీ
విమలకిరణచంద్రం వ్యోమ తారావిచిత్రమ్॥ 22

కలువలతోడిసంగతిని
గాడ్పులు చల్లనివై మెలంగెడున్,
జలదచయంబుపాయుట ది
శాతలముల్ రుచిరంబులై తగున్,
సలిలములెల్ల వీతకలు
షంబులు, ధారణి శుష్కపంకమున్,
జెలియ! వియత్పథం బుడువి
చిత్రము గౌరకరేందుబింబమున్.

టీ. కలువలతోడి సంగతిని=కల్వపూలపై వీచుటచే, గాడ్పులు=గాలులు, చల్లనివి+ఐ, మెలంగెడున్=వీచుచున్నవి, జలదచయంబు పాయుటన్=మేఘములులేక పోవుటచే, దిశాతలముల్=దిక్కులు, రుచిరంబులు+ఐ తగున్=దీప్తివంతములై యొప్పుచున్నవి, సలిలములు+ఎల్లన్=నీళ్లన్నియు, వీతకలుషంబులు=పోయిన మురికిగలవి (నిర్మలములు), ధారణి=భూమి, శుష్కపంకమున్=ఎండిన బురదగలది, వియత్+పథంబు=ఆకాశము, ఉడువిచిత్రము=నక్షత్రముల కాంతిచే చిత్రముగఁ బ్రకాశించునది (మఱియు), గౌరకర+ఇందుబింబము=తెల్లని కిరణములతోఁగూడిన చంద్రబింబము గలిగినదిగా నున్నది.

తా. శరత్కాలమునఁ గల్వపూలపై వీచుటచే గాలి చల్లఁగా నున్నది. మేఘరహితములై దిక్కులు దీప్తివంతములై యున్నవి. వర్షా.

1 కుసుమ. 2 తోయాత్. 3 విశద. 4 శ్యామపంకా.

కాలమునందువలెఁగాక నీళ్లు నిర్మలములై యున్నవి. అడుసు లేక బురద యెండియున్నది. మబ్బు మాటులేక చుక్కలు చందమామ యాకాశమున ప్రజ్వరిల్లుచున్నవి.

దివసకరమయూఖై ర్బోధ్యమానం ప్రభాతే
వరయువతిముఖాభం పంకజం జృంభతే౽ద్య।
కుముదమపిగతే౽స్తం [1]లీయతే చంద్రబింబే
హసితమివ వధూనాం ప్రోషితేషు ప్రియేషు॥ 23

తెలతెలవాఱ భానుకర
దీప్తులకున్ మెలమెల్ల విచ్చు పే
శలజలజంబు సోయగపు
జవ్వని మోముపసం దనర్చెఁ, జు
క్కలగమికాఁడు గ్రుంకువడఁ
గైరవమిప్డు, ప్రియుండు పాయుటన్
గలఁగు మెఱుంగుఁబోఁడి చిఱు
నవ్వుబలెం గడు మందటిల్లెడున్.

టీ. ఇపుడు = ఈశరత్కాలమునందు, తెలతెలవాఱన్ = తెల్లవాఱఁగనే, భానుకరదీప్తులకున్ = సూర్యునికిరణముల కాంతికి, మెలమెల్లఁగా = మెల్లఁగా, విచ్చు = వికసించునట్టి, పేశల = మనోహరమైన, జలజంబు = తామరపువ్వు, సోయగపుజవ్వని = అందకత్తెయైన జవరాలి యొక్క, మోముపసన్ = ముఖమువంటి శోభగలదియై, తనర్చెన్ = ఒప్పెను, చుక్కలగమికాఁడు = చంద్రుఁడు, గ్రుంకువడన్ = అస్తమింపఁగనే, కైరవము = కల్వపూవు. ప్రియుండుపాయుటన్ = ప్రియుని యెడఁబాటువలన, కలంగు = కృశించిన, మెఱుంగుఁబోఁడి = (మెఱపుఁ

1 మ్లాయతే లీలయా చంద్రబింబే.

దీఁగవంటి శరీరముగల) స్త్రీయొక్క, చిఱునవ్వుఁబలెన్ = చిఱునగవువలె, కడున్ = మిక్కిలి, మందటిల్లెడున్ = శోభాహీనముగా నున్నది.

తా. శరత్కాలమున, రాత్రియంతయుఁ బ్రియునితో సుఖించి తెల్లవాఱఁగనే నిద్రమేల్కాన్న జవ్వనుల మోములు, సూర్యోదయము కాఁగానే వికసించిన తామరపూవులవలె సొంపెసలారుచున్నవి. ప్రియుని యెడఁబాటు సహింపక రాత్రియంతయు దుఃఖించిన పాంథయువతుల మోములు, వేగుజామునఁ జంద్రాస్తమయముతోఁబాటు ముకుళించెడు కల్వ పూవులవలెఁ గాంతిహీనములై యున్నవి.

అసితనయనలక్ష్మీం లక్షయిత్వోత్పలేషు
క్వణితకనకకాంచీం మత్తహంసస్వనేషు।
అధరరుచిరశోభాం బంధుజీవే ప్రియాణాం
పథికజన ఇదానీం రోదితి భ్రాన్తచిత్తః॥ 24

నెలఁతల నల్లకన్నులలోని లచ్చినిఁ
గఱికల్వతుటుముల విరియఁజూచి,
ముదితలజాళువామొలనూళ్ళరవములఁ
మదహంసరవముల మలయఁజూచి,
పువ్వుఁబోండ్ల నిద్దంపు మోములకెందమ్ము
బంధుజీవంబులఁ బొటఁజూచి,
మించుఁబోఁడులమేల్మి మేనిసొంపున్నమ్ము
లలితవల్లరులను గలయఁజూచి,

యతులితానందమగు శరదృతువునందు
పథికవిరహార్తి పరిపీడితాత్ములగుచు

## భ్రాంతమానసములతోడఁ బథికజనము లూరకే రోదనము సల్పుచున్న వారు.

టీ. అతులిత + ఆనందము + అగు = సాటిలేని యానందమును గల్గించు, శరదృతువునందు = శరత్కాలమునందు, పథికజనము = ప్రియురాండ్ర నెడఁబాసి యుండవలసివచ్చిన యువకులు, కలికల్వతుటుములన్ = నల్లగల్వఱేకులందు, నెలఁతల = తమ ప్రియురాండ్ర, నల్లకన్నులలోని లచ్చిని = కొలుకకండ్ల సౌభాగ్యమును, విరియన్ + చూచి = విశదముగాఁ జూచియు, మదహంసరవములన్ = రాయంచల కూఁతలయందు, ముదితల = తమ ప్రియురాండ్రయొక్క, జాళువా మొలనూళ్లరవళులన్ = పసిఁడి యొడ్డాణములలోని గజ్జెలమ్రోఁతను, మలయన్ + చూచి = మాటిమాటికిఁ జూచియు, బంధుజీవంబులన్ = మంకెనపూవులందు, పువుఁబోండ్ల = తమ ప్రియురాండ్ర, నిద్దంపుమోవుల = అందమైన పెదవులయొక్క, కెంపు + తళ్కున్ = ఎఱ్ఱని కాంతిని, పాటన్ + చూచి = బాగుగాఁ జూచియు, లలితవల్లరులన్ = సొంపైన తీఁగెలయందు, మించుఁబోఁడుల = (మెఱుపుఁదీఁగవంటి శరీరముగల) తమ ప్రియురాండ్రయొక్క, మేల్మి = శ్రేష్ఠమైన, మేనిసౌందర్యమ్మున్ = శరీరశోభను, కలయన్ + చూచి = విశదముగాఁ జూచియు, అధికవిరహ + ఆర్తిన్ = మిక్కుటమైన వియోగబాధచే, పరిపీడిత = అధికముగా బాధింపఁబడిన, ఆత్మ + అగుచున్ = మనస్సులు గలవారగుచు, భ్రాంతమానసములతోడన్ = కలఁతఁజెందిన చిత్తములతో, ఊరకే = అదేపనిగా, రోదనము సల్పుచున్నవారు = ఏడ్చుచున్నారు.

తా. శరత్కాలమునఁ బ్రియురాండ్ర నెడఁబాసిన యువకులకుఁ బ్రకృతిసౌందర్యములోని ప్రతివస్తువును దమ ప్రియురాండ్రనే జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. అది యెట్లన, విరియఁబూచిన నల్లకల్వలు ప్రియురాలి కొలుకకండ్లను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. రాయంచల కలరవములు ప్రియురాలి యొడ్డాణములోని గజ్జెలమ్రోఁతలఁ దలఁపించుచున్నవి. మంకెనపూవుల కెంపు ప్రియురాలి యెఱ్ఱని పెదవులను దలఁపించుచున్నది. చిగిరించిన తీఁగెలు ప్రియురాలి మనోహరాంగమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. ఇట్లు, శరదృతుశోభ వియోగిజనుల నేడ్పించుచున్నది.

స్త్రీణాం [1]విహాయ వదనేషు శశాంక[2]లక్ష్మీం
[3]కామ్యం చ హంసవచనం మణినూపురేషు।
బంధూక[4]కాంతి మధరేషు మనోహరేషు
క్వాపి ప్రయాతి సుభగా శరదాగమశ్రీః॥ 25

తరుణి! శశాంకశోభఁ బ్రమ
దావదనంబుల, రాజహంసబం
ధురరుతులన్ దదీయమణి
నూపురకోటుల, బంధుజీవభా
స్వరరుచి తద్రదచ్ఛదకి
సాలములన్ విడి యెట్టులో యెటో
యరిగెఁ జుమీ మహాసుభగ
యౌ శరదాగమలక్ష్మి యిత్తఱిన్.

టీ. తరుణి = చెలీ! ఇత్తఱిన్ = ఇప్పుడు, శశాంకశోభన్ = చంద్రుని కాంతిని, ప్రమదావదనంబులన్ = స్త్రీలముఖములందును, రాజహంస బంధుర రుతులన్ = రాయంచల కలరవములను, తదీయమణినూపుర కోటులన్ = వారియొక్క (స్త్రీలయొక్క) రతనాల కడియాలలోను, బంధుజీవభాస్వరరుచిన్ = మంకెనపూవుల కాంతిని, తత్ + రదచ్ఛదకిసాలములన్ = వారియొక్క చివురుటాకువంటి పెదవులలోను, విడి = విడిచిపెట్టి, శరత్ + ఆగమలక్ష్మి = శరత్కాలశోభ, యెట్టులో = ఎంతో కష్టముతో, యెటో = ఎక్కడికో, అరిగెన్ + చుమీ = పోయెనుగదా!

తా. చెలీ! శరత్కాలలక్ష్మి, వెన్నెలను స్త్రీలముఖములందును, రాయంచ రుతములను వారి కడియాల సద్దులలోను, మంకెనపూల కాంతులను

1 వినాయ. 2 లక్ష్మీః. 3 హాస్యేవిశుద్ధవదనే కుముదాకరశ్రీం, హాస్యేవిశుద్ధవదనే కుముదాకరశ్రీః. 4 కాంతిః.

వారి పెదవులలోను లీనముచేసి తా నెక్కడికో పోయినది. (శరదృతువు అంతరించినది. ప్రకృతిసౌందర్య మంతరించినను దాదృశశోభ స్త్రీలయంగము లందుఁ గనఁబడుచున్నది.)

వికచకమలవక్త్రా ఫుల్లనీలోత్పలాక్షీ
[1]వికసిత నవకాశ శ్వేతవాసో వసానా।
కుముదరుచిర[2]కాన్తిః కామినీవోన్మదేయం
[3]ప్రతిదిశతు శరద్వశ్చేతసః ప్రీతి[4]మగ్ర్యామ్॥ 26

వికసితాబ్జవదన, వికచనీలోత్పల
నయన, స్ఫుటశరసితనవ్యవసన,
కుముదరుచిరకాంతి, కొమరాలటు శరత్తు
మించుప్రీతి మీకు నించుఁగాత.

టీ. వికసిత + అబ్జవదన = వికసించిన తామరపూవనెడి ముఖము గలదియు, వికచ + నీల + ఉత్పలనయన = వికసించిన కల్వపూఱేకులనెడి కన్నులు గలదియు, స్ఫుటశరసితవసన = విచ్చిన ఱెల్లుపూవులనెడి తెల్లని చీర గలదియు, కుముదరుచిరకాంతి = తెల్ల కల్వపూవుకాంతి యనెడి శరీరశోభ గలదియు (ఐన), శరత్తు = శరత్కాలము, కొమరాలు + అటు = ఎలజవ్వనివలె, మీకున్ = పాఠకులైన మీకు, మించుప్రీతిన్ = అధికమైన సంతోషమును, నించున్ + కాత = కల్గించునుగాత.

తా. వికసించిన తామరపూవనెడి మోముతోను, విరియఁబూచిన నల్లకల్వఱేకులనెడి కనుంగవతోను, విచ్చిన ఱెల్లుపూలనెడి తెల్లనిచీరతోను, తెలికల్వజిగియనెడి మేనికాంతితోను గూడిన శరదృతువు, తొలిప్రాయంపు మిటారికత్తెవలె మీకు వేడుక గల్గించునుగాత!

1 వికసితనవకాశా సంకులాలంబివస్త్రా, వికసితనవకాశా వ్యాకులాలంబివాసా. 2 హాసా. 3 పరిదిశతు, ఉపదిశతు. 4 మగ్ర్యామ్.

# హేమంతము

నవప్రవాళోద్గమ [1]సస్యరమ్యః
ప్రఫుల్లలోధ్రః పరిపక్వశాలిః।
విలీనపద్మః ప్రపతత్తుషారో
హేమన్తకాలః సముపాగ[2]తః ప్రియే॥ 1

నూత్నకిసజాతసస్యమనోహరంబు
వికచలోధ్రంబు లీనారవిందవనము
ప్రపత దమలతుషారంబు పక్వశాలి
యైన హేమంత మాగతంబయ్యె, నబల.

టీ. అబల = ఓ చెలీ! నూత్న = క్రొత్తవైన, కిసజాత = చిగుళ్ల పుట్టుకచేతను, సస్య = ఫలములచేతను, మనోహరంబు = రమ్యమైనదియు, వికచలోధ్రంబు = వికసించిన లొద్దుగుపూలు గలదియు, లీన + అరవింద వనము = ముకుళించిన తామరపూలు గలదియు, ప్రపతత్ = పడుచున్న, అమల = నిర్మలమైన, తుషారంబు = మంచుకలదియు, పక్వ = పండిన, శాలి = వరిపైరు గలదియు, ఐన, హేమంతము = హేమంతఋతువు, ఆగతంబు + అయ్యెన్ = వచ్చెను.

తా. చెలీ! హేమంతము రాఁగానే చూడుము. చెట్లు చిగుళ్లతోను ఫలములతోను నిండినవి. తామరలు ముకుళించినవి. ఎల్లెడల మంచు పడుచున్నది. లొద్దుగులు పుష్పించినవి. వరిపైరు పండి కోఁతకు సిద్ధముగా నున్నది.

1 పుష్ప. 2 తోఽయమ్.

మనోహరైః [1]కుంకుమరాగపింజరైః
తుషారకుందేందునిభైశ్చ హారైః।
విలాసినీనాం స్తనశాలినీనాం
నాలంక్రియన్తే స్తనమండలాని॥ 2

చందనరసంబుచే నొండెఁ, గుందతుహిన
శిశిరకరశుద్ధహారాళిచేత నొండె,
భాసురకుచశాలినుల విలాసవతుల
స్తనవలయము లిప్పుడు భూషితములు గావు.

టీ. ఇపుడు = ఈ హేమంతమున, భాసురకుచశాలినుల = ప్రకాశించుచుండు కుచములు గల్గిన, విలాసవతుల = అందకత్తెలయొక్క, స్తనవలయములు = వట్రువగుబ్బలు, చందనరసంబుచేన్ + ఒండె = చందనద్రవముచేఁగాని, కుందతుహినశిశిరకరశుద్ధ = మొల్లలు, మంచు, చంద్రుఁడు—వీనివలెఁ దెల్లనైన, హారాళిచేతన్ + ఒండె = ముత్యాలహారములచేఁగాని, భూషితములు గావు = అలంకరింపఁబడుటలేదు.

తా. హేమంతమునఁ జలి యధికమగుటచేఁ బీనపయోధరలైన విలాసినులు గబ్బిగుబ్బలపైఁ జందనద్రవమును బూయరు. ముత్యాలహారములను ధరింపరు. చందనము, ముత్యములుఁ శీతలస్పర్శ గలవియగుటచేఁ జలికాలమున వానిని ధరింపరు.

న బాహుయుగ్మేషు విలాసినీనాం
ప్రయాన్తి సంగం వలయాంగదాని।
నితంబబింబేషు నవం దుకూలం
తన్వంశుకం పీనపయోధరేషు॥ 3

1 చందనరాగగౌరైః, కుంకుమరాగరక్తైః.

బాహుయుగమునందు వలయాంగదంబులు,
బలుపుఁజనులయందు జిలుఁగుఁబాలెలు.
గుదుసుఁబిఱుఁదులందుఁ గ్రొంబట్టుపుట్టముల్
తారుకొనవిపుడు విలాసినులకు.

టీ. ఇపుడు = హేమంతమున, విలాసినులకు = యువతులకు, బాహు యుగమునందుఁ = చేదోయి యందు, వలయ + అంగదంబులు = గుండ్రని కడియములను, బలుపుఁ జనులయందుఁ = బిగిగుబ్బలపైన, జిలుగు + ఒలెలు = సన్నని గుడ్డలు, గుదుసుఁ బిఱుఁదులందుఁ = గుండ్రని పిఱుఁదులపైన, క్రొంబట్టుపుట్టముల్ = క్రొత్త పట్టువస్త్రములు, తారు కొనవు = ఉండవు.

తా. చలి యెక్కువగుటచే స్త్రీలు చేతులకు గాజులు దొడుగరు. చనులపైన సొంపైన సన్నని పైఁటలవేయక దట్టమైన ఆవికెలను దొడుగు చున్నారు. మృదులస్పర్శనముఁ జలి హెచ్చుగుఁ గానఁ బట్టుచీరలను గట్టుకొనరు.

కాంచీగుణైః కాంచన [1]రత్నచిత్రై
ర్నో భూషయన్తి ప్రమదా[2]నితంబం।
న నూపురైర్హంసరుతం భజద్భిః
పాదాంబుజా న్యంబుజకాంతి[3]భాంజి॥ 4

కనకరత్నచిత్రకాంచీగుణంబులఁ
దాల్ప రంగనలు నితంబములను,
నంచరవళిసోనునందెలఁ దొడుగరు
చరణకమలయుగళిఁ దరుణు లిపుడు.

1 రక్త. 2 నితంబాన్. 3 భాన్తి.

టీ. ఇపుడు=హేమంతమున, అంగనలు=స్త్రీలు, నితంబములను = పిఱుఁదులపైన, కనకరత్నచిత్ర = బంగారుతోను రత్నములతోను విచిత్రముగాఁ జేయఁబడిన, కాంచీగుణంబులన్ = మొలనూళ్లను, తాల్పరు = ధరింపరు, తరుణులు = యువతులు, చరణకమలయుగళిన్ = తామరలవంటి కాళ్లజంటలందు, అంచరవళిన్ + ఈను = హంసకూజితములవలె ధ్వని చేయు, అందెలన్ = కడియాలను, తొడుగరు = ధరింపరు.

తా. లోహస్పర్శనము శీతజనకమగుటచే హేమంతమున స్త్రీలు బంగారు మొలనూళ్లనుగాని, కడియాలనుగాని ధరింపరు.

గాత్రాణి కాలీయకచర్చితాని
సపత్రలేఖాని [1]ముఖాంబుజాని।
శిరాంసి కాలాగురుధూపితాని
కుర్వన్తి నార్యః సురతోత్సవాయ॥ 5

మ్రానిపసుపు మెఱుఁగు మేనులపైఁ బూసి,
యగరుపొగలు దలల కలవరించి,
పత్రలేఖికలను వదనాబ్జముల దిద్ది
రతికి నుత్సుకిల్లి రతిన లిపుడు.

టీ. ఇపుడు = హేమంతమున, అతివలు = స్త్రీలు, మేనిపైన్ = దేహమున, మ్రానిపసుపు మెఱుఁగున్ = పచ్చిపసుపుఁ బూఁతను, పూసి = పూసికొనియు, తలలకు = శిరస్సులకు (వెండ్రుకలకు), అగరుపొగలు = అగురుధూపములను, అలవరించి = కలుగఁజేసియు, వదన + అబ్జములన్ = ముఖపద్మములందు, పత్రలేఖికలను = మకరికా పత్త్రములను, దిద్ది=తీర్చియు, రతికిన్ = సంభోగమునకు, ఉత్సుకిల్లి=ఉత్సాహముతో నాయత్తమైరి.

1 నఖాంబుజాని.

తా. చలికాలమగుటచే స్త్రీలు కామోద్దీపనమునకై శరీరమునకు నుష్ణము గలిగించు పచ్చిపసుపును మేనఁబూసికొనియు, కేశముల కగురు ధూపము పట్టించియు, మోమునఁ గస్తురితిలకము దిద్దియు రతిక్రీడకు నాయత్త లగుచున్నారు.

[1]రాత్రిశ్రమక్షామవిపాండువక్త్రాః
[2]సంప్రాప్తహర్షాభ్యుదయా స్తరుణ్యః।
హసన్తినోచ్చైర్దశనాగ్రభిన్నా
[3]న్ప్రపీడ్యమానానధరా నవేక్ష్య॥ 6

వరరతిశ్రమక్షామవిపాండుముఖులు,
ప్రాప్తహర్షాభ్యుదయులు, ప్రాయంపుఁజెలులు
దశనశిఖలను బరిపీడితంబులైన
యధరముల విచ్చి నగరిప్పు డగ్గలముగ.

టీ. ఇపుడు=హేమంతమున, వరరతిశ్రమక్షామవిపాండుముఖులు=శ్రేష్ఠమైన రతిక్రీడలవలని యాయాసముచే వాడి తెల్లఁబాఱిన ముఖములుగల వారును, ప్రాప్తహర్ష+అభ్యుదయులు=సంభోగసుఖమువలనఁ గలిగిన యానందాతిశయము గలవారును (ఐన), ప్రాయంపుఁ జెలులు=జవ్వనులు, దశనశిఖలను=(ప్రియునియొక్క) పంటిమొనలచే, పరిపీడితంబులు+ఐన=నొక్కులి నొక్కఁబడిన, అధరములన్=పెదవులను, విచ్చి=తెఱచి, అగ్గలముగన్=ఎక్కువగా, నగరు=నవ్వరు.

తా. రతిశ్రమమున వాడిన మొగములుగల జవరాండ్రు, సంభోగసుఖమున సంతసించియుఁ బ్రియులు తనివిదీఱ ముద్దిడుకొనినప్పుడు వారి పంటిమొనలకు గాయపడిన పెదవులకుఁ జలి తగిలిన బాధ కల్గునని యెక్కువగా నవ్వకున్నారు.

1 రతిశ్రమ. 2 ప్రాప్తేఽపిహర్షాభ్యుదయే. 3 ప్రసన్నరాగాన్.

పీనస్త[1]నోరుస్థలభాగశోభా
మాసాద్య తత్పీడనజాతఖేదః।
తృణాగ్ర[2]లగ్నైస్తుహినైః పతద్భి
రాక్రందతీవోషసి శీతకాలః॥ 7

గుత్తపుంగుబ్బయెడఁదల కొమరు వడసి,
తత్ప్రపీడన జాతఖేదమునఁ జేసి,
తృణకణాగ్రపతద్ధిమకణమిషమున
సీతు విలపింపఁబోలుఁ బ్రభాతవేళ.

టీ. సీతు=శీతకాలము, ప్రభాతవేళన్=వేగుజామున, గుత్తంపుగుబ్బయెడఁదలన్=(స్త్రీల) గబ్బిగుబ్బల సందున, కొమరువడసి=సొంపును గాంచి, తత్+ప్రపీడనజాత = ఆ గుబ్బల యొత్తిడివలనఁ బుట్టిన, ఖేదమునన్+చేసి=దుఃఖము(నొప్పి)వలన, తృణకణ+అగ్రపతత్=గడ్డిపోఁచల కొనలనుండి రాలుచున్న, హిమకణమిషమునన్=మంచుబొట్లనెడి నెపముతో, విలపింపన్+పోలున్=ఏడ్చుచున్నట్లున్నది.

తా. చలి, జవరాండ్ర చన్గవల సందునఁ బ్రవేశించినదై, రత్యవసరమునఁ బ్రియులు నిబ్బరంపుఁదమి గుబ్బలెదనంట వారిం గౌఁగిలింపఁగా, నట్టిచో వానిక్కుగుబ్బల యొరపిడికిం దాళలేక యేడ్చుచుండఁ గండ్లనుండి రాలు నీటిబొట్లో యనునట్లు తెల్లవాఱుజామున మంచు గడ్డిపోఁచలనుండి రాలుచున్నది.

[1]ప్రభూతశాలి ప్రసవైశ్చితాని
మృగాంగనాయూథ విభూషితాని।

1 నోరః. 2 లంబైః.
1 ప్రసూత.

మనోహర క్రౌంచనినాదితాని
సీమాంతరాణ్యుత్సుకయంతి చేతః॥ 8

పైరుపంటలు మిక్కిలి వ్యాప్తిఁగొనఁగ
నాఁడు లేళ్ళు బారులు దీఱి యాడుచుండ,
జానుక్రౌంచలరవళులు జాలువాఱ
సంతసముఁగూర్చు మదికి సీమాంతరములు.

టీ. సీమ + అంతరములు = ఊరిపొలిమేరలు, పైరుపంటలు, మిక్కిలి, వ్యాప్తిన్ + కొనఁగన్=వృద్ధినొందఁగను, ఆఁడులేళ్లు, బారులు దీఱి ఆడుచుండన్, జానుక్రౌంచల = అందమైన జక్కవపిట్టల, రవళులు = కూఁతలు, జాలువాఱన్ = సొంపై యుండఁగా, మదికిన్ = చిత్తమునకు, సంతసమున్ + కూర్చున్ = సంతోషమును గలిగించును.

తా. సమృద్ధిగాఁ బండిన పైర్లతోను, బారులుదీఱియున్న యాఁడు లేళ్లతోను, గూయుచున్న జక్కవలతోను గ్రామసీమలు వేడుకఁ గొల్పు చున్నవి.

ప్రఫుల్ల నీలోత్పలశోభితాని।
[1]సోన్మాదకాదంబవిభూషితాని।
ప్రసన్నతోయాని [2]సుశీతలాని
[3]సరాంసి చేతాంసి హరంతి పుంసాం॥ 9

ఫుల్లనీలోత్పలములు శోభిల్లుచుండ,
సమదకాదంబములు మండనములుగాఁగ,

1 సరాంసికాదంబవిఘట్టితాని, సహంసకాదంబ విఘట్టితాని. సశైవలాని. 3 మహాంతి.

శీతలామలజలములు చెలువుఁగొలుపఁ
గొలఁకు లిప్పుడెల్లర చిత్తముల హరించె.

టీ. ఇపుడు=హేమంతమున, కొలఁకులు = సరస్సులు, ఫుల్లనీల + ఉత్పలములు = వికసించిన నల్లగల్వలు, శోభిల్లుచుండఁగ = ప్రకాశించు చుండఁగను, సమదకాదంబములు = మదించిన హంసలు, మండనములు గాఁగ = అలంకారముగా నుండఁగను, శీతల + అమలజలములు = చల్లని నిర్మలమైన నీళ్లు, చెలువుఁగ + కొలుపఁగ = అందమును గలుగఁజేయఁగను, ఎల్లరి చిత్తములఁగ = అందఱి మనస్సులను, హరించెఁగ = ఆకర్షించుకొను చున్నవి.

తా. వికసించిన నల్లకల్వలతోను, మదించిన కలహంసలతోను, చల్లని నీటితోను గూడిన సరస్సులు హృదయరంజకములుగా నున్నవి.

పాకం వ్రజన్తీ హిమ[1]జాతశీతై
రాధూయమానా సతతం మరుద్భిః।
ప్రియే ప్రియంగుః ప్రియవిప్రయుక్తా
విపాండుతాం యాతి విలాసినీవ॥ 10

పక్వమగుచుఁ, దుహినపాతశీతమరున్ని
రంతధూతమగు ప్రియంగులతిక,
ప్రియవియోగతప్త విభ్రమవతి రీతి
వెల్లఁదనము గన్నవిధము గాంచె.

టీ. పక్వము + అగుచు = పండినదై, తుహినపాత = మంచు పడుటవలన, శీత - చల్లఁగానున్న, మరుత్ = గాలిచేత, నిరంత = ఎల్లప్పుడును, ధూతము + అగు = కదలింపఁబడినదగు, ప్రియంగులతిక = ప్రేంఖణపుఁ

1 సంగశీతైః.

దీఁగె, ప్రియవియోగతప్త = ప్రియుని యెడఁబాటువలనఁ దాపమునొందిన, విభ్రమవతీరీతిన్ = విలాసినివలె, తెల్లఁదనమున్ + కన్నవిధమునన్ = తెల్లఁగానైన రీతిని, కంటె = చూచితివా!

తా. చలివలనఁ బండి, గాలికిఁ గదలుచున్న ప్రేంఖణపుఁదీఁగె, ప్రియు నెడఁబాసి దుఃఖించు విలాసినివలె తెల్లఁబాఱుచున్నది.

పుష్పాస[1]వామోది సుగంధివక్త్రో
నిఃశ్వాసవాతైః సురభీకృతాంగః।
పరస్పరాంగ [2]వ్యతిరిక్తశాయీ
శేతేజనః కామ[3]రసానువిద్ధః॥ 11

ఫుల్లసూనాసవసుగంధిముఖము, నిశ్వ
సనమరుద్వాసితాంగమ్ము, జనము రమణి!
రతిరసానువిద్ధమ్ము పరస్పరాంగ
సంగతమ్ముగ శయనించు సౌధములను.

టీ. రమణి = ఓ చెలీ! సౌధములను = మిద్దె ఇండ్లలో, జనమ్ము = జనులు, ఫుల్లసూన + ఆసవసుగంధి ముఖము = ప్రఫుల్లించిన పూవులలోని కల్లువాసనలతోఁ గూడిన ముఖములు గలవారును, నిశ్వసనమరుత్ = నిట్టూర్పుగాలిచే, వాసిత = నివాసము చేయఁబడిన, అంగమ్ము = శరీరము గలవారును (ఐ), రతిరస + అనువిద్ధమ్ము = కామోద్రిక్తచిత్తములుగల వారగుచు, పరస్పర + అంగసంగతమ్ముగన్ = ఒండొరుల మేను లంటుకొనునట్లు, శయనించున్ = పండుకొందురు.

తా. హేమంతమున జనులు పూవుఁగల్లు వాసనతో నిండిన మోములుగల వారును, నిట్టూర్పుగాడ్పులు సోఁకు సంగములతోఁ గామోద్రిక్తచిత్తులై యొండొరుల మేనులు గలియఁ బెనవేసికొని పరుండుదురు.

1 ఆమోద. 2 వ్యతిషిక్త, వ్యతిసక్త, వ్యతిసంగ. 3 శరానువిద్ధః.

దంతచ్ఛదైః [1]సవ్రణదంతచిహ్నైః
స్తనైశ్చ పాణ్యగ్రకృతాభిలేఖైః।
సంసూచ్యతే నిర్దయ మంగనానాం
[2]రతోపయోగో నవయౌవనానామ్॥ 12

పల్లుమొనగంటు చిన్నె పల్లవ్వకోనలు,
గోటిగీటులకుం జిక్కుకొనిన చనులు,
నవ్యయౌవనవతులైన నారులొందు
నిర్దయరతోపభోగముఁ దెలుపునిపుడు.

టీ. ఇపుడు = ఈ హేమంతమున, పల్లుమొనగంటు = పంటిమొనగాయముల (దంతక్షతము) వలని, చిన్నె = గుర్తులతోఁ గూడిన, పల్లవ్వకోనలుఁ = మోవికొనలును, గోటిగీటులకుం జిక్కుకొనిన చనులుఁ = గోళ్లతో నొత్తుటచే గాయపడిన చనులును, నవ్యయౌవనవతులైననారులు = ఎలజవ్వనులైన స్త్రీలు, ఒందు = అనుభవించుచుండు, నిర్దయ = కఠినమైన (గాఢమైన), రత + ఉపభోగముఁ = రతిక్రీడను, తెలుపుఁ = సూచించును.

తా. ఈ హేమంతమున నెలజవ్వనులయొక్క దంతక్షతములైన యధరపల్లవములును, నఖముఖక్షతములైన కుచములును, వారనుభవించెడి గాఢతరరతిక్రీడను సూచించుచున్నవి. హేమంతము కామోద్దీపకమై యున్నది.

కాచిద్విభూషయతి దర్పణసక్తహస్తా
[1]బాలాతపేషు వనితా వదనారవిందం।

1 దంతవిఘాతచిహ్నైః. 2 రతోపభోగో.
1 బాలాతపేషు వనితావదనారవిందం.

దంతచ్ఛదం ప్రియతమేన నిపీతసారం
దంతాగ్రభిన్న మవకృష్య నిరీక్షతే చ॥ 13

దర్పణము కేలఁ గొని మోముఁదమ్మి లేఁత
యెండఁ గై సేసి కొను నొక్కయింతి, ప్రియ ని
పీతసారమ్ము రదనాగ్రభిన్నమైన
స్వాధరము విప్పికొని చూచి హర్ష మొందు.

టీ. ఒక్కయింతి = ఒకానొక స్త్రీ, దర్పణమున్ = అద్దమును, కేలన్ + కొని = చేతఁబట్టుకొని, లేఁతయెండన్ = ప్రాతఃకాలమున, మోము దమ్మిన్ = పద్మమువంటి ముఖమును, కై సేసికొనున్ = అలంకరించుకొనును, ప్రియనిపీతసారమ్ము = ప్రియునిచేఁ ద్రావఁబడిన సారము (అధరామృతము) గలదియు, రదన + అగ్రభిన్నము = (ప్రియుని) పంటి మొనగాటులతోఁ గూడినదియు, ఐన = అయినట్టి, స్వ + అధరమున్ = తన పెదవిని, విప్పికొని = లాగి, చూచి, హర్షమున్ + ఒందున్ = సంతోషించుచున్నది.

తా. ఒకానొక స్త్రీ, ఉదయమున నే యద్దము చేతఁబట్టుకొని ముఖమును నలంకరించుకొనుచు, గడచినరాత్రి ప్రియుఁడు అధరామృతము నానుతఱి నాతని పంటి మొనవొక్కులకు గాయపడిన తన పెదవిని ఈడిచి చూచుకొని సంతోషించుచున్నది.

[1]అన్యా ప్రకామసురతశ్రమఖిన్నదేహా
[2]రాత్రిప్రజాగరవిపాటలనేత్ర[3]పద్మా
[4]శయ్యాన్త దేశలులితాకులకేశపాశా
నిద్రాం ప్రయాతి మృదుసూర్య[5]కరాభితప్తా॥ 14

2 అపకృష్య.
1 అన్యాః. 2 నక్త, నక్తం. 3 పద్మాః. 4 ప్రస్తాంసః. 5 అభితప్తాః.

శర్వరీసమయ ప్రజాగర పాటల
చంచలనయనాంబుజములతోడ,
స్రస్తాంసలులిత శశ్వద్వ్యస్త వారిద
శ్యామల కేశపాశమ్ముతోడ,
నతివేలకుసుమాయుధాహవసముదిత
శ్రమఖిన్నమృదులగాత్రంబుతోడఁ,
గాంతకర్కశరదక్షతచిహ్నముద్రిత
రమణీయబింబాధరంబుతోడఁ,

బ్రాగ్గిరోదిత ప్రభాకరమృదుకర
కాండకించిదరుణకాంతిచేత
నలరుఁబోఁణియొక తె యభితప్తయై యిప్పు
డదిగో మెల్ల మెల్ల నిదురపోవు.

టీ. ఇప్పుడు = ఈ హేమంతమున, అలరుఁబోఁణి యొక తె = పూవు వలె మృదువైన శరీరముగల యొక స్త్రీ,

శర్వరీసమయ = రాత్రియందు, ప్రజాగర = బొత్తుగా నిద్రలేని కారణమున, పాటల = ఎఱ్ఱవాఱిన, చంచల = చలించుచున్న, నయన + అంబుజములతోడన్ = తామర రేకులవంటి కన్నులతోను,

స్రస్త = జాఱి, అంసలులిత = భుజములపైఁ బొరలుచుండు, శశ్వత్ + వ్యస్త = ఎల్లప్పుడును వ్రేలాడుచుండు, వారిదశ్యామల = వర్షమేఘమువలె నల్లనైన, కేశపాశమ్ముతోడన్ = కొప్పుతోను,

అతివేల = మిక్కుటమైన, కుసుమ + ఆయుధ + ఆహవ = మన్మథ యుద్ధమువలన, సంజాత = కలిగిన, శ్రమ = బడలికచే, ఖిన్న = వాడిన, మృదుల గాత్రంబులతోడన్ = మెత్తని శరీరములతోను,

కాంత = ప్రియునియొక్క, కర్కశ = కఠినమైన, రదక్షత = పలుగాట్లవలని, చిహ్న = గుర్తులో, ముద్రిత = ముద్రింపఁబడిన, రమణీయ = మనోహరమైన, బింబ + అధరంబులోడఁ = దొండపండువంటి పెదవులతోను (కూడినదై)

ప్రాక్ + దిశ + ఉదిత = తూరుపుఁదెసఁ బుట్టిన, ప్రభాకర = సూర్యునియొక్క, మృదుకరకాండ = మెత్తని (తీక్ష్ణముగాని) కిరణ సమూహముచే, కించిత్ + అరుణ = కొద్దిగా నెఱ్ఱనైన, కాంతిచేతఁ = ఎండలో, అభిత ప్తయై = వేఁడిగొనినదై, మెల్ల మెల్లఁ = నెమ్మదిగా, నిదుర పోవుఁ = నిద్రించుచున్నది, అదిగో = చూచితివా.

తా. రాత్రియంతయు మేల్కొని యుండుటచే నెఱ్ఱవాఱిన కన్నవతోఁ గూడినదియు, వీడి బుజములపై వ్రేలాడుచున్న నల్లని కొప్పు గలదియు, రతిశ్రమమున వాడిన మృదుగాత్రముగలదియుఁ, బ్రియుని దంతక్షతములతో నిండిన యెఱ్ఱని పెదవులుఁగలదియునైన యొక పూవుఁబోఁడి, యప్పుడే యుదయించిన సూర్యుని లేఁత యెండలోఁ జలి గాచుకొనుచున్నది.

నిర్మాల్యదామపరిముక్తమనోజ్ఞగంధం
మూర్ధ్నోఽపనీయ ఘననీలశిరోరుహాన్తాః।
పీనోన్నతస్తనభరానతగాత్రయష్ట్యః
కుర్వన్తి కేశరచనా[1]మపరాస్తరుణ్యః॥ 15

పీవరోన్నతకుచభారవినతతనులు,
ఘనవినీలకచాంతలు కాంత లిపుడు
వలపుదలఁగినమాలలఁ దొలఁచి తలలఁ
జెలియ! కేశరచనముఁ జేసెదరు, గనుమ!

1 అబలాః.

టీ. చెలియ = ఓ చెలీ! ఇపుడు = ఈ హేమంతమున, పీవర = బలుపైన, ఉన్నత = ఎత్తైన, కుచభార = చనుల బరువునకు, వినత = (కొద్దిగా) వంగిన, తనులు = శరీరములు గలవారును, ఘనవినీల = మేఘము వలె నల్లనైన, కచ + అంతలు = వెండ్రుకల కొనలు (క్రొమ్ముడులు) గల వారును, (ఐన), కాంతలు = స్త్రీలు, వలపు + దలఁగిన=వాసన ఉడిగిన, మాలలన్ = పూలదండలను, తొలఁచి = తీసివేసి, తలలన్= శిరములందు, కేశరచనమున్ = వెండ్రుకలను జడగా నల్లుకొనుటను, చేసెదరు=చేసికొను చున్నారు.

తా. కుచభారనమ్రములు, ఘనవినీలకచలునైన స్త్రీలు, గడచిన రాత్రిని వాడిపోయిన పూలదండలను దీసివేసి తలలు దువ్వి జడ లల్లుకొను చున్నారు.

అన్యా ప్రియేణ పరిభుక్తమ[1]వేక్ష్యగాత్రం
హర్షాన్వితా విరచితాధర [2]చారుశోభా।
[3]కూర్పాసకం పరిదధాతి [4]నఖక్షతాంగీ
[5]వ్యాలంబినీలలలితాలక[6]కుంచితాక్షీ॥ 16

లలితవినీలసాంద్రపరి
లంబనకుంతలకుంచితాక్షి, పే
శలనఖరక్షతాంగి, విల
సద్రచితాధరచారుశోభయా
పొలఁతుక యోర్తు, కాంతపరి
భుక్తశరీరము గాంచి హర్షమ
గ్గలముగఁ గ్రొత్తపట్టుఱవి
కన్ దొడుగున్ గనుఁగొమ్ము, నెచ్చెలీ!

1 అపేక్ష్య, 2 రాగశోభా, గండశోభా. 3 రక్తాంశుకం. 4 నవం నతాంగీ. 5 వ్యాలంబితాంగులిలతా. 6 కుంచితాక్షీ.

టీ. నెచ్చెలీ! లలిత = మనోజ్ఞమైన, వినీల = మిక్కిలి నల్లనైన, సాంద్ర = దట్టమైన, పరిలంబన = జారి వ్రేలాడుచుండెడు, కుంతల = ముంగురులచే, కుంచిత = మూయఁబడిన, అక్షి = కన్నులు గలదియు, పేశల = రమణీయముగా, నఖరక్షత = (ప్రియుని) గోళ్లచే నొక్కఁబడిన, అంగి = శరీరముగలదియు, విలసత్ + రచిత=విలాసయుక్తముగా నొనర్పఁబడిన, అధర = మోవియొక్క, చారుశోభ=మనోజ్ఞమైన కాంతిగలదియు (అగు), పాలఁతుకయొౘర్తు = ఒక స్త్రీ, కాంత పరిభుక్తశరీరముఁ + కాంచి = ప్రియునిచే ననుభవింపఁబడిన తన దేహమును జూచుకొని, హర్షము = సంతోషము, అగ్గలముగన్ = అతిశయింపఁగా, క్రొత్త పట్టు అవికన్, తొడుగున్, కనుఁగొమ్ము = చూడుము.

తా. తన దేహముమీఁది ప్రియుని నఖదంతక్షతాదిసంభోగ చిహ్నములనుగాంచి సంతోషించిన యొక స్త్రీ, రతికాలమున వీడిన కొప్పు కన్నుల కడ్డుపడి వ్రేలాడుచుండఁ గండ్లు మూసికొనియే అవికను దొడుగుకొనుచున్నది. (రతికాలమున విగత కంచుకయై యుండి రత్యంతమున అవికం దొడుగుచున్నది.)

అన్యాశ్చిరం సురతకేళిపరిశ్రమేణ
[1]ఖేదంగతాః ప్రశిథిలీకృతగాత్రయష్ట్యః।
[2]సంహృష్యమాణ [3]విపులోరు [4]పయోధరార్తా
[5]అభ్యంజనం విదధతి ప్రమదాః [6]సుశోభాః॥ 17

చిరము రతికేళిచే శ్రమఁజెందుకతనఁ
బ్రశిథిలీకృతగాత్రలు, ప్రమద లిపుడు
పులకితోరుపయోధరాంతలు, సుశోభ
లువిద! యభ్యంజనము సల్పుచున్నవారు.

1 స్వేదం. 2 సంఘృష్యమాణ, సంపీడ్యమాన. 3 పులకోరు. 4 పయోధరాన్తా. 5 ప్రత్యంజనమ్, నేత్రాంజనమ్. 6 సుశోభమ్.

టీ. ఉవిద! చిరము = చాలసేపు, రతికేళిచేఁ = సంభోగము వలన, శ్రమఁ + చెందుకతనఁ = అయాసపడుటవలన, ప్రశిథిలీకృత గాత్రలు=బడలిక చెందిన శరీరములు గలవారును, పులకిత + ఉరు + పయస్ + ధర + అంతలు = పులకరించిన చనుమొనలు గలవారును, సుశోభలు = కాంతివంతమైన శరీరములు గలవారును, (విన), ప్రమదలు = జవ్వనులు, ఇపుడు, అభ్యంజనము సల్పుచున్నారు = శిరస్స్నానము చేయుచున్నారు.

తా. చిరకాల రతిశ్రమముచే బడలికచెందిన జవరాండ్రు చనుమొనలు పులకరించుచుండ రతిశ్రమ ముడుఁగుటకై స్నానము చేయుచున్నారు.

బహుగుణరమణీయో యోషితాం చిత్తహారీ।
పరిణతబహుశాలివ్యాకులగ్రామ[1]సీమా।
[2]సతతమతిమనోజ్ఞః క్రౌంచమాలాపరీతః
ప్రదిశతు హిమయుక్తః [3]కాల ఏషః [4]సుఖంవః॥ 18

బహుగుణమనోజ్ఞ మశ్రాంతభాసురమ్ము
ప్రచురపక్వశాల్యావృతగ్రామసీమ
మంగనాచిత్తహారి క్రౌంచావళీప
రీతము హిమాగమమ్ము మీకిడుత సుఖము.

టీ. బహుగుణమనోజ్ఞము = అనేక దృశ్యములచే రమణీయమైనదియు, అశ్రాంతభాసురమ్ము = ఎల్లప్పుడుఁ బ్రకాశించునదియు, ప్రచుర = దట్టముగా, పక్వ = పండిన, శాలి = వరిపైరుచే, ఆవృత = చుట్టఁబడిన, గ్రామసీమము = ఊరి పొలిమేరలు గలదియు, అంగనాచిత్తహారి = స్త్రీల

1 సీమః. 2 వినిపతితతుషారః క్రౌంచనాదోపగీతః. 3 శ్వేషకాలం. 4 ప్రియం.

చిత్తములను హరించునదియు, క్రౌంచావళీపరీతము = చక్రవాక పక్షులతో నిండినదియు (అగు), హిమ + అగమము = హేమంత ఋతువు, మీకు = పాఠకులరైన మీకు, సుఖముల = సౌఖ్యమును, ఇడుతల = చేకూర్చునుగాత.

తా. పండిన పైర్లతో నిండిన గ్రామోపకంఠభూములు గలదియుఁ, జక్రవాకపక్షులతోఁ గూడినదియు, బహురమ్యమైనదియుఁ, గామినీచిత్తహారియు నగు హేమంతము మీకుఁ బ్రీతి నించుఁగాత.



# శిశిరము

ప్రరూఢశాలీక్షుచయై ర్మనోహరం
[2]క్వచిత్ స్థిత క్రౌంచనినాద[3]రాజితం।
ప్రకామ[4]కామం ప్రమదాజనప్రియం।
వరోరు కాలం శిశిరాహ్వాయం శృణు॥ 1

సుఖదము ప్రరూఢశాలీక్షుసుందరమ్ము
ఒక్కయెడఁ గ్రౌంచనాదమహోజ్జ్వలమ్ము
కామినీప్రియముఁ బ్రకామకామము నగు
. శిశిరమునుగూర్చి చెప్పెదఁజెలిరో! వినుము.

టీ. చెలిరో = ఓ చెలీ! సుఖదము = సౌఖ్యము నొసంగునదియు, ప్రరూఢ = బాగుగా నెదిగిన, శాలి=వరిచేతను, ఇక్షు=చెఱకుగడలచేతను, సుందరమ్ము = మనోహరమైనదియు, ఒక్క + ఎడన్ = అక్కడక్కడ, క్రౌంచనాద = జక్కవపిట్టల కూఁతలచే, మహా + ఉత్ + జ్వలమున్ = మిక్కిలి రమణీయమైనదియు, కామినీప్రియమున్ = కామినులకుఁ బ్రియమైనట్టిదియు, ప్రకామమున్ = కామమును వృద్ధిచేయునట్టిదియు, అగు = అట్టి, శిశిరమున్ + కూర్చి=శిశిరర్తువునుగూర్చి, చెప్పెదన్=వర్ణించెదను, వినుము.

తా. చెలీ! వరిమళ్లతోను, జెఱకుఁదోఁటలతోను నిండి నేత్రానందమై, యచ్చటచ్చటఁ గూయు చక్రవాకపక్షులు గలదియై, కామినులకు సంతోషకాలమై, కామోద్దీపకమై యున్న యీ శిశిరర్తువును వర్ణించెదను, వినుము.

1 ప్రరూఢశాల్యంశుచయైర్మనోహరం. 2 క్వచిత్ స్థితం. 3 శోభితం. 4 కామ.

నిరుద్ధవాతాయనమందిరోదరం
హుతాశనో భానుమతో గభస్తయః।
గురూణి వాసాంస్యబలాః సయౌవనాః
ప్రయాన్తి కాలే౽త్ర[1] జనస్య సేవ్యతామ్॥

వహ్ని, భానుమద్గభస్తులు, రుద్ధవా
తాయనములు మందిరాంతరములు,
గురుతరాంబరములు, తరుణులు, జనులకు
సేవ్యవస్తు లిపుడు చిగురుఁబోణి!

టీ. చిగురుఁబోణి = చిగురువలె మెత్తని శరీరముగలదానా! ఇపుడు = శిశిరమున, జనులకు = మనుజులకు, వహ్ని = అగ్నియు, భానుమత్ + గభస్తులున్ = సూర్యుని వెలుఁగులును, నిరుద్ధవాతాయనములు = మూయఁబడిన కిటికీలుగల, మందిర + అంతరములున్ = ఇండ్ల లోపలిభాగములును గురుతర + అంబరములున్ = దట్టమైన వస్త్రములును, తరుణులున్ యౌవనవతులైన స్త్రీలును, సేవ్యవస్తువులు = అనుభవింపఁ దగినవి.

తా. చెలీ! శిశిరమునఁ జలి యధికమగుటచే జనులు కిటికీ మూసికొని యిండ్లలోపలిభాగమునఁ జలిమంటలముందు దుప్పట్లు గప్పుకొని జవరాండ్ర కౌఁగిళ్లలోఁ గాలము పుచ్చుచున్నారు.

న చందనం చంద్రమరీచిశీతలం
న హర్మ్యపృష్ఠం శరదిందునిర్మలం।
న వాయవః సాంద్రతుషారశీతలాః
జనస్య చిత్తం రమయన్తి సాంప్రతమ్॥

1 అద్య.

చంద్రకిరణశీతమ్మగు చందనమ్ము
సాంద్రహిమశీతలమ్ములు స్పర్శనములు
హర్మ్యపృష్ఠమ్ము శారదాబ్జామలమ్ము
జనులమతి కిత్తఱిని సంతసంబు నిడవు.

టీ. ఇత్తఱిన్ = ఈ శిశిరమున, చంద్రకిరణశీతమ్ము + అగు = చంద్రుని కిరణములవలెఁ జల్లనైన, చందనమున్ = చందనమును, సాంద్ర హిమశీతలమ్ములు = దట్టముగాఁ గురియు మంచువలనఁ జల్లనైన, స్పర్శన ములున్ = గాలులును, శారద + అబ్జ + అమలమ్ము = శరత్కాల చంద్రుని వలె నిర్మలమైన, హర్మ్యపృష్ఠమ్మున్ = సౌధాగ్రమును, జనులమతికిన్ = జనుల చిత్తమునకు, సంతసంబున్ + ఇడవు = సంతోషమును గలిగింపవు.

తా. శిశిరమున మొదలే చలి మిక్కుటమగుటచే, శీతజనకములైన చందనలేపము, చలిగాలి, సౌధాగ్రవిహారమును జనులకు ననుభవయోగ్య ములు గాకున్నవి.

తుషారసంఘాతనిపాత[1]శీతలాః।
శశాంకభాభిః [2]శిశిరీకృతాః పునః।
విపాండుతారాగణ [3]జిహ్మభూషితా
జనస్య సేవ్యా న భవన్తి రాత్రయః॥ 4

స్ఫీతతుహినపాతశీతముల్ వెండియు
రజనికర కరశిశిరములు నిశలు
పాండుతారకాళిభవ్యభూషితములు
చనవు సేవ్యములయి జనులకిపుడు.

1 శీతలా. 2 శిశిరీకృతా. 3 చారుభూషణాః.

టీ. ఇప్పుడు = శిశిరమున, స్ఫీత = ప్రకాశించుచున్న, తుహిన పాతముల్ = మంచు గురియుట గలవియు, రజనికర = చంద్రునియొక్క, కర=కిరణ ప్రసారమువలన, శిశిరములు=చల్లనైనవియు, పాండుతారక + ఆళి = తెల్లని చుక్కలగుంపుచే, భవ్య = యోగ్యమైనట్లు, భూషితములు = అలంకరింపఁబడినవియు (అగు), నిశలు=రాత్రులు, జనులకు=మనుష్యులకు, సేవ్యములు + అయి = అనుభవింపఁదగినవిగా, చనవు = ఉండవు.

తా. శిశిరమున మంచు దట్టముగాఁ గురియుటచేతను, మేఘరహిత మైన యాకాశమునుండి వెడలు చంద్రనక్షత్రకిరణములవలని చలిచేతను, రాత్రులందు యువకులు యథేచ్ఛముగా విహరింపఁజాలకున్నారు. చలికి భయపడి వారు ఇండ్లలోనే యున్నారు.

గృహీతతాంబూలవిలేపనస్రజః।
సురాసవామోదితవక్త్రపంకజాః।
ప్రకామకాలాగురుధూప[2]వాసితం
విశంతి [3]శయ్యాగృహం [4]ముత్సుకాః స్త్రియః। 5

తమ్ములము పూవుసరులు గంధమును గొనుచుఁ
బుష్పమధువాసితాననాంబుజలు వేడ్కఁ
గఱియగురు పొగలవలపుఁ గలిమిఁ గొప్పు
పడకటింట్లఁ జొచ్చెద రిప్డు పడఁతు లతివ!

టీ. అతివ = చెలీ! ఇప్పుడు = శిశిరమున, పుష్పమధువాసిత = పూవుఁగల్లు వాసనలతోఁగూడిన, ఆనన + అంబుజలు = ముఖపద్మములు గలవారైన, పడఁతులు = స్త్రీలు, తమ్ములము = తాంబూలమును, పూవు సరులన్ = పూవు దండలను, గంధమును, గొనుచు = తీసికొని, కఱి

1 సుఖాసవా, పుష్పాసవా. 2 వాసితాం. 3 శయ్యాం. 4 ఉత్సుక స్త్రియః.

యగురు=నల్లని అగురుయొక్క, పొగల వలపుఁగలిమిన్ + ఒప్పు = పొగల వాసనలతో నిండిన, పడకటిండ్లన్ = శయనమందిరములను, వేడ్కన్ = సంతోషముతో, చొచ్చెదరు = ప్రవేశించెదరు.

తా. చెలీ! పడఁతులు తాంబూలమును గస్తురినిఁ బూలదండలను గొని, నల్లయగురు ధూపములతో నిండిన పడకటిండ్లలోనికిఁ బోవుచున్నారు. మేనఁ గస్తురిఁ బూయుటయుఁ దాంబూలము వేసికొనుటయుఁ గల్లు ద్రావుటయు నుష్ణజనకములు. అగురు ధూపములు చలినిఁ దొలఁగించును.

కృతాపరాధా న్బహుశోఽపి [1]తర్జితా
న్సవేపథూన్ సాధ్వస [2]లుప్తచేతసః।
నిరీక్ష్య భర్తౄ న్సురతాభిలాషిణః
స్త్రియోఽపరాధాన్సమదా [3]విసస్మరుః। 6

కృతమంతులఁ, బలుమఱుఁ ద
ర్జితులన్, గంపితుల, భయసకీతహృదయులన్,
రతిలోలురఁగాఁ గనుఁగొని
పతులన్ క్షమియించి రిపుడు ప్రమదలు ప్రీతిన్.

టీ. ఇపుడు=శిశిరమున, ప్రమదలు=యువతులు, కృతమంతులన్ = తప్పుచేసినవారును, పలుమఱుఁ దర్జితులన్=మిక్కిలి భయపడినవారును, కంపితులన్ = (చలికి) వడఁకుచుండువారును, భయసకీతహృదయులన్ = భయముతో నిండిన హృదయములు గలవారును (అగు), పతులన్=భర్తలను, రతిలోలురఁగాన్ = రతియందభిలాష గలవారినిఁగా, కనుఁగొని=ఎఱిఁగి, ప్రీతిన్ = సంతోషముతో, క్షమియించిరి = మన్నించిరి.

1 అభితర్జితాన్. 2 మంద. 3 న సస్మరుః.

తా. పరకాంతా సంగమమువంటి యపరాధముచేసిన పురుషులు, తమ ప్రియురాండ్ర కోపమునకు గుఱియై, చలికి వడఁకుచు భయపడి తమ ప్రియురాండ్రను కౌఁగిలింపలేకున్నారు. కామోన్మత్తలైన జవ్వనులును దమ ప్రియుల యవస్థను జూచి జాలిగొని వారి యపరాధములనెల్ల మన్నించి వారిందఱఁ జేర్చుకొని క్రీడించుచున్నారు.

ప్రకామకామై [1]ర్యువభిః సనిర్దయం
నిశాసు [2]దీర్ఘాస్వభిరామితా శ్చిరం।
[3]భ్రమంతి [4]మందం శ్రమ[5]ఖేదితోరసః
క్షపావసానే నవయౌవనాః స్త్రియః॥ 7

కరుణవీడి యధికకామమ్మునను, యువల్
చిరము నిడుదరేల సురతి సలుప
నలుపుఁదొడల నవ్యయౌవనల్ మెలమెల్ల
మలఁగుచున్నవారు మాపుతుదల.

టీ. యువల్ = యువకులు, కరుణన్ వీడి = దయమాలి, అధిక కామమ్మునన్ = మిక్కుటమైన కామోద్రేకమువలన, నిడుదరేలన్ = దీర్ఘములైన శిశిరరాత్రులయందు, చిరము=చాలసేపు, సురతిన్ + సలుపన్ = రమింపఁగా, మాపుతుదలన్ = రాత్రిచివరను (వేగుజామున), నవ్యయౌవనల్ =క్రొత్తగా యౌవనావిర్భావము గలిగిన స్త్రీలు, అలుపుఁదొడలన్ =(రతిక్రీడయందు) బడలికనుగాంచిన తొడలతో, మెలమెల్లన్ = మెల్లఁగా, మలఁగుచున్నవారు = సంచరించుచున్నారు.

1 సురతేఽతినిర్దయం, యువభిశ్చ నిర్దయం. 2 దీర్ఘాస్వభిభావితా భృశం, గాఢందయితై శ్చిరం దృఢం. 3 భవన్తి, ధమన్తి. 4 మంద. 5 స్వేదితోరవః, మోదితోరసః, స్వేదితోరవః.

తా. గాఢకామోద్రిక్తులైన యువకులు రాత్రియంతయు విడువక రమించుటచే నలిసిపోయిన జవరాండ్రు వేగుతతిని మెల్లఁగాఁ దిరుగుచున్నారు.

మనోజ్ఞ [1]కూర్పాసక పీడిత స్తనాః
సరాగ[2]కౌశేయక భూషితోరసః।
[3]నివేశితాంతః కుసుమైః శిరోరుహైః
విభూషయన్తీవ హిమాగమం స్త్రియః॥ 8

నవురుగొల్పెడు చనుకట్టు చనుల బిగియఁ,
గ్రొత్త జిగిపట్టుపుట్ట మూరువులఁ గ్రాల,
విరులు లోలోనఁ దుఱిమిన కురులతోడఁ
జెలువలు హిమాగమమ్ముగై సేయుఁబోలు.

టీ. నవురుఁ + కొల్పెడు = అందమైన, చనుకట్టు = అవికెలు, చనులఁ + బిగియఁ = చనులపై బిగిసికొనియుండఁగా, ఊరువులఁ = తొడలపై, క్రొత్తజిగిపట్టుపుట్టము = క్రొంబట్టునరిగవలువ, క్రాలఁ = ఒప్పిదమైయుండఁగా, లోలోనఁ = లోపల, విరులు = పూలు, తుఱిమిన = కూర్పఁబడిన, కురులతోడఁ = శిరోజములతోడను, చెలువలు = అందకత్తెలైన స్త్రీలు, హిమ + ఆగమమ్మునఁ = శిశిరఋతువును, కై సేయఁ + పోలుఁ = అలంకరించుచున్నట్లున్నారు.

తా. చనులు బిగియునట్లు అవికెలం దొడిగి, క్రొంబట్టునరిగ చీరలను ధరించి, కొప్పులలోఁ బూలుపెట్టుకొనియున్న జవరాండ్రు శిశిరకాలమునకు నలంకారప్రాయులై యున్నారు.

1 కూర్పాసనిపీడిత. 2 కౌశేయఃభూషితోరసః. 3 వివేశితాన్తః.

పయోధరైః కుంకుమరాగపింజరైః
సుఖోపసేవ్యైర్నవ[1]యౌవనోష్మభిః।
[2]విలాసినీభిః పరిపీడి[3]తోరసః
స్వపంతిశీతం పరిభూయకామినః॥ 9

చెలి! నవయౌవనోష్మములు,
శ్రీకరకుంకుమరాగపింజరం
బులును, సుఖోపసేవ్యములు,
మోదకరంబులునైన గబ్బిగు
బ్బలఁ బరువంపుగుబ్బెతలు
వక్షములం బలుమాఱుఁ గ్రుమ్మఁ బేర్
జలి నెడఁద్రోసి కాముకులు
సౌధములన్ నిదురింతు రిత్తఱిన్.

టీ. చెలీ! ఇత్తఱిన్ = ఈ శిశిరమున, కాముకులు = కామము గలిగిన పురుషులు, పరువంపు గుబ్బెతలు = ఎలజవ్వనులు, నవయౌవన + ఊష్మములు = క్రొత్తగా సంఘటించిన యౌవనమువలనఁ గద్రుష్ణములును, శ్రీకర = శోభాయమానమైన, కుంకుమరాగ = కుంకుమ కాంతిచే, పింజరంబులున్ = పసుపు నెఱుపుఁగలిసిన రంగుతోఁగూడినవియు, సుఖ + ఉపసేవ్యములున్ = సుఖముకొఱకు సేవింపఁదగినవియు, మోదకరంబులున్ = సంతోషమును గూర్చునవియు, ఐన = అయినట్టి, గబ్బిగుబ్బలన్ = బలుపుఁజనులతో, పలుమాఱున్ = మాటిమాటికి, వక్షములన్ = వక్షస్స్థలములను, క్రుమ్మన్ = తాఁకఁగా, చలిన్ + ఎడన్ + త్రోసి = చలినిఁబాపి, సౌధములన్ = మిద్దెలలో, నిదురింతురు.

1 యౌవనోత్సవాః, యౌవనోత్సవః. 2 విలాసినీనాం. 3 భృశం.

తా. శిశిరమున, యువకులు మిద్దెలలోఁ బరుండి, కుంకుమపంక లిప్తములైన ప్రియురాండ్ర గబ్బిగుబ్బల తాఁకునకుఁ జలినిఁబాసి హాయిగా నిదురించుచున్నారు.

సుగంధినిశ్వాసవికంపితోత్పలం
మనోహరం కామరతి [1]ప్రబోధకం।
నిశాసు హృష్టాః సహ కామిభిః స్త్రియః
పిబంతి మద్యం మదనీయ ముత్తమం॥ 10

వలపుటూర్పుగములఁ గలువలు గంపింప,
మదనదీపకమ్ము మధురతరము
మదకరమ్ము శ్రేష్ఠమద్యముం జవరాండ్రు
గ్రోలుచుంద్రు ప్రియులఁ గూడి నిశల.

టీ. నిశలన్ = రాత్రులందు, జవరాండ్రు = యువతులు, ప్రియులన్ + కూడి = తమ ప్రియులతోఁగలసి, వలపుటూర్పుగములన్ = కమ్మని నిట్టూర్పుగాడ్పులకు, కలువలు కంపింపన్ = కలువరేకులు చలించుచుండఁగా, మదనదీపకమ్ము = కామమును గలిగించునదియు, మధురతరము = మిక్కిలి తియ్యనిదియు, మదకరమ్ము = కైపెక్కించునట్టిదియు (ఐన), శ్రేష్ఠమద్యమున్ = మంచికల్లును, గ్రోలుచుంద్రు = త్రాగుచున్నారు.

తా. రాత్రులందు జవ్వనులు తమ ప్రియులతోఁగూడి, నిట్టూర్పు గాడ్పులకు లోని కలువరేకులు గంపింపఁ గామజనకము, మధురతరము మదకరమునైన పుష్పాసవమును గ్రోలుచున్నారు.

1 ప్రబోధనం.

అపగతమదరాగా యోషి[1]దేకా ప్రభాతే
[2]కృతనిబిడకుచాగ్రా పత్యురాలింగనేన।
ప్రియతమపరిభుక్తం వీక్షమాణా స్వదేహం
వ్రజతి శయనవాసా ద్వాస [3]మన్యద్ధసన్తీ॥ 11

విగతమదరాగ యొార్తుక వేగుతఱిని
రమణునాశ్లేషమునఁ గుచాగ్రములు నిక్కఁ
గాంతభుక్త స్వగాత్రమ్ము గాంచి నగుచుఁ
బడకటిల్ వీడి వేఱింటికడకు నడిచె.

టీ. వేగుతఱిని = వేగుజాముస, విగతమదరాగ = మద్యపానము వలని కైపుతగ్గినదైన, ఓర్తుక = ఒక స్త్రీ, రమణునాశ్లేషమునన్ = ప్రియుని యాలింగనమువలన, కుచ + అగ్రములు + ఉబుకన్ = చనుమొన లుబ్బఁగా, కాంతభుక్తస్వగాత్రమ్మున్ = ప్రియునిచే ననుభవింపఁబడిన తన దేహమును, కాంచి = చూచుకొని, నగుచు = నవ్వుకొనుచు, పడకటిల్ వీడి = పడక టింటిని వీడి, వేఱు + ఇంటికడకున్ = మఱియొక గృహములోనికి, నడిచెన్ = పోవుచున్నది.

తా. రాతిరిఁ గ్రోలిన మద్యమువలని మత్తుతగ్గఁగా నొక స్త్రీ తెల్లవాఱ లేచి ప్రియుని గాటంపుఁగౌఁగిలివలన చనుమొన లుబుక, సంభోగచిహ్నములతో నిండిన తన దేహమునుగాంచి నవ్వుకొనుచుఁ బడక టిల్లువీడి వేఱొక యింటిలోనికిఁ బోవుచున్నది.

అగురుసురభిధూపామోదితం కేశపాశం
గళితకుసుమమాలం [4]ధున్వతీకుంచితాగ్రం।

1 ఏవ. 2 కృతవినతకుచాగ్రా, కుచనిబిడకుచాయా. 3 అన్యం హసన్తీ, అన్యద్వ్రిజన్తీ.
4 తన్వతీ.

త్యజతి గురునితంబా [1]నిమ్నమధ్యావసానా
ఉషసి [2]శయన మన్యా కామినీ [3]చారుశోభామ్॥ 12

అగురువలపుఁబొగల ననువొందు వేనలిఁ
బూలసరులఁ దొలఁచి ముడినివైచి
తరుణి గురునితంబ వరశోభ తనుమధ్య
వేగుతఱిని సెజ్జ వీడు నదిగో!

టీ. గురునితంబవరశోభ = గొప్ప పిఱుఁదులచే నొప్పిదమై యున్నదియు, తనుమధ్య = సన్నని నడుముగలదియు (అగు), తరుణి = ఒక జవ్వని, వేగుతఱిని, అగురువలపుఁ బొగలన్ = అగురుధూపపుఁ బొగల వలని పరిమళములచే, అనువు + ఒందు = ఒప్పుచున్న, వేనలిన్ = కొప్పులో, పూలసరులన్ = పూలదండలను, తొలఁచి = తీసివేసి, ముడినివైచి = చెదరిన కొప్పును సరిగా సవరించుకొని, సెజ్జన్ = పడకను, వీడున్ = వదలి పోవు చున్నది, అదిగో = చూడుమా!

తా. వేగుజామున, గురునితంబయు, లఘుమధ్యయు నైన యొక విలాసిని, యగురు పొగవాసనతోఁగూడిన కొప్పులోని పూలదండలను దీసివైచి, కొప్పు సవరించుకొని, పడకవిడి పోవుచున్నది. (రాత్రి వెచ్చఁదనముఁ బరిమళము గలుగుటకై శిరోజములకు నగురు పొగ వేయఁబడుట; వివిధ రతిబంధముల నలిఁగి, వాడి వాసన దొలఁగుటచేఁ బుష్పమాలికలను దీసివేయుట, అట్టితఱినే వీడిపోవుటచేఁ దిరిగి కొప్పును సవరించుకొనుట.)

కనకకమలకాంతైః [4]సద్య ఏవాంబుధౌతైః
[5]శ్రవణతటనిషక్తైః పాటలోపాంతనేత్రైః।

1 నిమ్ననాభిః సుమధ్యా. 2 శయనవాసం, శయనమధ్యా. 3 కామశోభా, కామశోభాం, చారుశోభా.
4 చారుబింబాధరోష్ఠైః. 5 శ్రవణతట నిషిక్తైః, స్మరదమృతనిషిక్తైః.

ఉషసి వదన బింబై రంస[1]సంసక్త కేశైః
శ్రియ ఇవ గృహమధ్యే [2]సంస్థితా యోషితో౽ద్య॥13

చెలువపుఁ గెంపు మోవుల, వి
శిష్టసువర్ణబిసప్రసూన పే
శలముఖమండలంబులను,
స్కంధనిషిక్తకచంబులన్, విపా
టలమృదులాంతముల్ శ్రుతిత
టస్థితరమ్యములౌ విలోచనం
బుల, గృహలక్ష్ములట్లు ననఁ
బోణులుపొల్చిరి ప్రత్యూషంబునన్.

టీ. ప్రత్యూషంబునన్ = ప్రాతఃకాలమున, ననఁబోణులు=(పూవు వలె మృదువైన శరీరముగల) స్త్రీలు, చెలువపుఁ గెంపు మోవులన్ = అందమైన యెఱ్ఱని పెదవులతోను, విశిష్ట=శ్రేష్ఠమైన, సువర్ణ=బంగారపు, బిసప్రసూన = తామరపూవువలె, పేశల = మనోహరమైన, ముఖమండలంబులను = ముఖబింబములతోను, స్కంధనిషిక్త = భుజములపై వ్రేలాడుచుండెడు, కచంబులన్ = వెండ్రుకలతోను, విపాటల మృదుల + అంతముల్ = ఎఱ్ఱని కొనలు గలవియు, శ్రుతితటస్థితరమ్యములు + ఔ = చెవి వఱకు వ్యాపించుటచే సొంపైనవియునగు, విలోచనంబులన్=కన్నులతోను (కూడినవారై), గృహలక్ష్ములు + అట్లు=గృహములందు నెలకొనియున్న లక్ష్ములో యనునట్లు, పొల్చిరి = ఒప్పిరి.

తా. శిశిరమునఁ బ్రత్యూషముననే కాలకృత్యములం దీర్చుకొన్న పూవుఁబోండ్లు, కెమ్మోవులతోను, వికసితకమలసదృశవదనములతోను, అంసాలంబిత కచభరములతోను, ఆకర్ణాయత పాటలాంత నేత్రములతోను గూడినవారై గృహములందుఁ గళకళలాడెడు లక్ష్మివలె నున్నారు.

1 సంయుక్త. 2 సన్మితా.

పృథుజఘనభరార్తాః కించిదానమ్ర[1]మధ్యాః
[2]స్తనభరపరిఖేదాన్మందమందం [3]వ్రజన్త్యః।
[4]సురతసమయవేషం[5]నైశమాశు ప్రహాయ
దధతి దివసయోగ్యం వేష [6]మన్యాస్తరుణ్యః॥ 14

పృథుజఘనభరార్తలు, తనువినతమధ్య,
లధికకుచభరశ్రమ మందయాన లిపుడు
నైశరతికాలవేషము లాశుగతినిఁ
దొలఁచి వాసరోచితవేషముల ధరింత్రు.

టీ. ఇపుడు=ఈ శిశిరకాలమున, పృథుజఘనభర + ఆర్తలున్=గొప్ప పిఱుఁదుల బరువునకు నలిసినవారును, తనువినతమధ్యలున్=సన్నగా నించుక వంగిన నడుముగలవారును, అధికకుచభరశ్రమ = మిక్కుటమైన పాలిండ్ల బరువునకు నలిసిపోవుటచే, మందయానలు = మెల్లఁగా నడచువారును (ఐన స్త్రీలు), ఆశుగతిన్ = శీఘ్రముగా, నైశ = రాత్రి ధరించిన, రతికాలవేషమున్=రతిసమయమునఁ దాల్చిన యలంకారమును, తొలఁచి=తొలఁగఁజేసి, వాసర + ఉచిత వేషములన్ = పగటిపూట ధరింపఁదగిన వేషములను, ధరింత్రు = ధరించుచున్నారు.

తా. ఈ శిశిరకాలమున జఘనకుచభారాలసలైన జవ్వనులు, రాత్రిని ధరించిన సంభోగకాలార్హములైన వేషభూషణములను దీసివేసి, పగటిపూట ధరింప యోగ్యములైన వేషములను దాల్చుచున్నారు.

[7]నఖపదచితభాగాన్వీక్షమాణాః [8]స్తనాగ్రాన్
అధరకిసలయాగ్రం దంతభిన్నం స్పృశన్త్యః।

1 మధ్యా. 2 స్తనయుగ. 3 వ్రజన్త్యాః. 4 సురతసమయఖేదం, సురతశయనవేషం. 5 అంకే, అన్యత్. 6 ఏషాః.
7 నఖపదకృతభంగాన్. 8 స్తనాంతాన్, స్తనాగ్రాన్.

అభి[1]మతరసమేతం నందయన్త్యస్తరుణ్యః
సవితురుదయకాలే భూషయంత్యాననాని॥ 15

గోరుచిన్నెలనొప్పు చన్గొనలఁగాంచి,
రదనభిన్నోష్ఠ పల్లవాగ్రములఁ దాఁకి,
స్వాభిమతవేషకృతహర్షలైన చెలులు
వదనముల దిద్దుచున్నారు ప్రత్యూషమున.

టీ. ప్రత్యూషమునన్ = ప్రాతఃకాలమున, చెలులు = స్త్రీలు, గోరు చిన్నెలన్ + ఒప్పు = (ప్రియుని) గోటి గాటులచే నొప్పుచుండు, చన్ + కొనలన్ + కాంచి = చనుమొనలను జూచుకొనుచు, రదనభిన్న = (ప్రియుని) దంతములచే నొక్కఁబడిన, ఓష్ఠపల్లవ + అగ్రములన్ + తాఁకి = చిగురుటాకువంటి మోవికొనలను జేతఁ దాఁకుకొనుచు, స్వ + అభిమత = తమ కిష్టమైన, వేష = చిహ్నములవలన, కృత = కలిగింపఁబడిన, హర్షలు + ఐ = సంతోషము గలవారై, వదనములన్ = మోములందు, దిద్దుచున్నారు = (తిలకమును) దిద్దుకొనుచున్నారు.

తా. తెల్లవాఱఁగనే స్త్రీలు, కడచినరేయి సంభోగకాలమునఁ బ్రియుని నఖక్షతములచే నొప్పు చనుమొనలఁ గాంచియు, దంతక్షతములచే నొప్పు నెఱ్ఱని పెదవికొనలను దాఁకియు, నట్టి తమకెంతయు సంతసమును గూర్పు, మోములందుఁ దిలకపుబొట్లు దిద్దుకొనుచున్నారు. (ప్రత్యూషమునఁ దిలకము దిద్దుకొనవలసిన యగత్యము రాత్రి దిద్దుకొనినది రతిశ్రమాంబుగళిత మగుటయే).

ప్రచురగుడవికారః స్వాదుశాలీక్షురమ్యః
[2]ప్రబలసురతకేళి[3]ర్జాత కందర్పదర్పః।

1 రతవేశం.
2 ప్రసృత. 3 శాంత.

ప్రియజనరహితానాం చిత్తసంతాపహేతుః
శిశిర సమయ[1] ఏష శ్రేయసే [2] వోఽస్తు నిత్యమ్॥ 16

వరసురతకేళి జాత
స్మరదర్పము ప్రియవియోగిజనమానసదు
ర్భరతాపకారణముస్తై
జరుగుస్ సతతమ్ము శిశిరసమయం బబలా!

స్ఫురితబహుగుడవికారత
వఱలుచు, మధురేక్షుశాలిపంక్తులఁ గనులం
బొరిఁబొరిఁ దనిపెడు శిశిరము
నిరవధికసుఖమ్ము మీకు నిరతంబిడుతన్.

టీ. అబలా = ఓ చెలీ! సతతమ్ము = ఎప్పుడును, శిశిరసమయంబు = శిశిర ఋతువు, వరసురతకేళి = శ్రేష్ఠమైన రతిక్రీడకు, జాత = కలిగిన, స్మరదర్పము = కామోద్రేకము కలదియు, ప్రియవియోగిజన = ప్రియుల నెడఁబాసినవారి, మానస = మనస్సులకు, దుర్భరతాపకారణము=భరింప రాని తాపము కలిగించునదియు, ఐ=అయి, జరుగున్=వర్తిల్లుచుండును.

తా. చెలీ! శిశిరమునఁ బ్రేయసీప్రియులు మిక్కిలి రత్యుత్కంఠ గల్గియుందురు; పాంథులన్ననో దుర్భరతాపపీడితులగుచుందురు.

టీ. స్ఫురిత = ప్రకాశించుచుండెడి, బహు = అనేకములైన, గుడవికారతన్ = బెల్లమునకు సంబంధించిన వస్తువులతో, వఱలుచున్ = వర్ధిల్లుచు, మధుర + ఇక్షు = తియ్యని చెఱకుగడలతోను, శాలిపంక్తులన్ = వరిచాళ్లతోను, పొరిన్ + పొరిన్ = పలుమఱు, కనులన్ + తనిపెడు

1 ఏషః. 2 తేఽస్తు.

= నేత్రానందమును గలిగించెడు, శిశిరము=శిశిరర్తువు, మీకుఁ=పాత్రులరైన మీకు, నిరతంబు=ఎల్లప్పుడును, నిరవధిక=అంతములేని, సుఖమ్ముఁ = సౌఖ్యమును, ఇడుతఁ = కల్గించునుగాత.

తా. గుడశర్కరాది మధురద్రవ్యభరితమును, దీయని చెఱకుగడలతోను బండిన వరిపైరతోను గూడి నేత్రానందకరమునైన శిశిరర్తువు మీకు నిరత మనంతసుఖప్రదాయి యగుఁగాత.



# వసంతము

ప్రఫుల్లచూతాంకురతీక్ష్ణసాయకో
ద్విరేఫమాలావిలసద్ధనుర్గుణః।
మనాంసి [1]వేద్ధుం [2]సురతోత్సుకానాం
వసంత[3]యోద్ధా సముపాగతః ప్రియే॥ 1

వికచచూతాంకురనిశాతవిశిఖుఁ డతిమ
నోజ్ఞరోలంబమాలాధనుర్గుణుండు
సురతలోలురయెదలఁ జీల్చుటకు నిపుడు
అదె వసంతయోధుఁడు చెలీ! యరుగుదెంచె.

టీ. చెలీ! వికచ=బాగుగా విస్తరించిన, చూత+అంకుర = మామిడిచిగుళ్లనెడు, నిశాత = పదనైన, విశిఖుఁడు = బాణములుగల వాఁడును, అతిమనోజ్ఞ = మిక్కిలి రమణీయమైన, రోలంబమాలా = తుమ్మెదలబారనెడు, ధనుః+గుణుండు = అల్లెత్రాడుగలవాఁడును (ఐన), వసంతయోధుఁడు = వసంతుఁడనెడు సైనికుఁడు, ఇపుడు, సురతలోలుర యెదలన్ = రతియం దభిలాషగలవారి హృదయములను, చీల్చుటకున్ = భేదించుటకు, అదె, అరుగు+తెంచున్ = వచ్చుచున్నాఁడు.

తా. చెలీ! వసంతుఁ డనెడి యోధుఁడు, తుమ్మెదలబారనెడి నారిపై లేమావి చివుళ్లనెడి యమ్ముల సంధించి కాముకుల హృదయములను చీల్చుచు వచ్చుచున్నవాఁడు, చూచితివా! ఎలమావి చివుళ్లతోను దుమ్మెద గుంపులతోడను గూడిన వసంతసమయము కామోద్దీపకముగా నున్నది.

1 భేత్తుం. 2 సురతప్రసంగినాం. 3 యోధః.

ద్రుమాః సపుష్పాః సలిలం [1]సపద్మం
స్త్రియః సకామాః [2]పవనాః [3]సుగంధయః
సుఖాః ప్రదోషాః దివసాశ్చరమ్యాః
సర్వం ప్రియే చారుతరం వసంతే।

సలిలము సారసాన్వితము,
  శ్యామలు కామయుతల్, తరుల్ స్ఫుటో
జ్జ్వలసుమభారనమ్రములు,
  సౌరభయుక్తము మారుతమ్ము, సొం
పలరు ప్రదోషముల్ మిపుల
  నందములౌ దివసమ్ములున్ బ్రవ
ర్తిలు మధుమాసకాలమిది
  హృద్యము చువ్వె సమస్తభంగులన్.

టీ. సారస + అన్వితము = తామర పూవులతోఁగూడిన, సలిలమున్ = నీళ్లును, కామయుతల్ = కామముతోఁ గూడిన, శ్యామలున్ = యౌవనమధ్యస్థలైన స్త్రీలును, స్ఫుట = ప్రకట మగునట్లు, ఉత్ + జ్వల = ప్రకాశించుచుండెడు, సుమభార = పువ్వుల బరువుచే, నమ్రములు = వంనైన, తరుల్ = వృక్షములును, సౌరభయుక్తము = పరిమళముతోఁగూడి మారుతమ్మున్ = గాలియును, సొంపు + అలరు = రమణీయమైన, ప్రదోషములున్ = సాయంకాలములును, మిపులనందములు + ఔ = మిక్కియానందజనకములైన, దివసమ్ములున్ = పగళ్లును, ప్రవర్తిలన్ = కలుగఁ మధుమాసకాలము + ఇది = ఈ వసంతకాలము, సమస్తభంగులన్ = అవిధములను, హృద్యము చువ్వె = మనోహరము గదా!

తా. తామరపూలతో నిండిన సరస్సులు, కామోద్రిక్త యువతులు, విరియఁబూచిన పూవుగుత్తుల బరువునకు వంగిన చెట్లు, పరిః

1 సుపద్మం. 2 పవనః. 3 సుగంధిః.

వంతమైన గాలి, రమణీయములైన దినసంధ్యలు గలిగిన యీ వసంతర్తువు కడు మనోజ్ఞముగా నున్నదిగదా!

వాపీజలానాం మణిమేఖలానాం
శశాంకభాసాం ప్రమదాజనానాం।
చూతద్రుమాణాం [1]కుసుమాన్వితానాం
దదాతి [2]సౌభాగ్యమయం వసన్తః। 3

కల్వరావెల్గులకు రత్నకాంచికలకు
మంజువాపీజలములకు మదవతులకుఁ
బుష్పితములైన మాకందభూజములకుఁ
బడఁతిరో! వసంత మసమసౌభాగ్య మొసఁగు.

టీ. పడఁతిరో=ఓ చెలీ! వసంతసమయము, కల్వరావెల్గులకున్ = చంద్రుని కాంతులకును, రత్నకాంచికలకున్=రత్నాల యొడ్డాణములకును, మంజువాపీజలములకున్ = నిర్మలమైన బావి నీరునకును, పుష్పితములైన = పూచిన, మాకందభూజములకున్ = మామిడి చెట్లకును, అసమ=సాటిలేని, సౌభాగ్యమున్ = సొంపును, ఒసఁగున్ = కలిగించుచున్నది.

తా. ఓ చెలీ! వసంతమునఁ జలి లేకుండుటచే వెన్నెలయును, రత్నకాంచీధారణమును, వర్షాకాలమునందువలె బురదతో నిండిగాని గ్రీష్మమునవలె నెండిపోయిగాని యుండకపోవుటచే జలక్రీడార్హములైన కోనేళ్లును, చిగిర్చి పూచిన తీయమామిడిచెట్లును మిక్కిలి యనుభవయోగ్యములుగా నున్నవి.

కుసుంభరాగారుణితై ర్దుకూలైః
నితంబబింబాని [3]విలాసినీనాం।

1 కుసుమానతానాం. 2 సౌరభ్య.
3 నితంబినీనాం.

[1]రక్తాంశుకైః కుంకుమరాగ[2]పింజరై
రలంక్రియన్తే స్తనమండలాని॥ 4

కుసుమకెందళ్కు_హత్తు దుకూలములను
వన్నెలాండ్రనితంబబింబములు, మఱియు
నమలకుంకుమగౌరతన్వంశుకముల
మహితకుచమండలమ్ములు మండితములు.

టీ. వన్నెలాండ్ర = విలాసినుల, నితంబబింబములు = గుండ్రని పిఱుదులు, కుసుమకెందళ్కు_హత్తు = కుసుమపూవువలె నెఱ్ఱని రంగుగల, దుకూలములను = పట్టువస్త్రములచేతను, మఱియు, మహితకుచమండలమ్ములు = కొనియాడఁదగిన గుండ్రని చనులు, అమలకుంకుమగౌర=నిర్మలమైన కుంకుమవలె నెఱుపుఁబసుపు గలిసిన రంగుగల, తను + అంశుకములన్ = సన్నని వలువలచేతను, మండితములు = అలంకరింపఁబడి యున్నవి.

తా. విలాసినులు, పట్టుచీరలు గట్టుకొని, బిగిగుబ్బలపైఁ జెంగావి పయ్యెదల నలంకరించుకొని విహరించుచున్నారు.

కర్ణేషు యోగ్యం నవకర్ణికారం
[3]చలేషు నీలేష్వలకే [4]ష్వశోకం।
[5]శిఖాసుఫుల్లా [6]నవమల్లికాశ్చ
[7]ప్రయాతికాంతిం [8]ప్రమదాజనానాం॥ 5

1 తన్వంశుకైః. 2 గౌరైః.

3 స్తనేషుహారాః. 4 అశోకః. 5 పుష్పంచఫుల్లం, శిఖాసుమాలాః. 6 నవమాలికాశ్చ, నవమల్లికాయాః. 7 ప్రయాంతిశోభాం, ప్రయాంతి కాన్తిం. 8 ప్రమదాజనస్య.

కోమలపీనుల నునుఁగొండగోఁగుపువ్వులు
కదలుకఱిముంగురుల నశోకంపుననలు
విరియఁబూచిన క్రొమ్మల్లెవిరులగములు
కలికి! యిత్తఱినందంపుఁగలిమి నందె.

టీ. కలికి = ఓ చెలీ! ఇత్తఱిన్ = ఇప్పుడు, కోమల=జవరాండ్రయొక్క, పీనులన్ = చెవులందు, నునుఁగొండ గోఁగుపువ్వులున్ = క్రొత్తకొండగోఁగుపూవులును, కదలు కఱిముంగురులన్=చలించు నల్లని ముంగురులందు, అశోకంపుననలున్=అశోకపుష్పములును, విరియఁబూచిన క్రొమ్మల్లెవిరులగములున్ = చక్కఁగా వికసించిన క్రొత్తమల్లె పూలదండలును, అందంపుఁగలిమిన్ + అందెన్ = మిక్కిలి యందముగా నమరియున్నవి.

తా. చెలీ! ఈ వసంతసమయమున, జవ్వనులు చెవిసందునఁ గొండగోఁగుపూలను, జలించు నల్లని ముంగురులపై వికసించిన యశోకపుష్పములను, క్రొత్త మల్లెపూలను దాల్చుచున్నారు.

స్తనేషు హారాః సితచంద[1]నార్ద్రా
భుజేషు [2]సంగం వలయాంగదాని।
[3]ప్రయాన్తి [4]నిశ్శంకమనంగసౌఖ్యం
నితంబినీనాం జఘనేషు కాంచ్యః॥ 6

గౌరచందనార్ద్రహారముల్ మొలనూళు
లమలమణిమయ వలయాంగదములు
మారపీడితలగు మదవతులకు నిప్పు
కుచ జఘన భుజములఁ గొమరుమిగులు.

1 నార్ద్రైః. 2 కంబువలయాంగదాని. 3 ప్రయాంత్యనంగాతుర మానసానాం. 4 నిఃసంగమనంగసౌఖ్యం.

టీ. ఇప్పు = ఈ వసంతసమయమున, మారపీడితలు + అగు = మన్మథునిచేఁ బీడింపఁబడినవారగు, మదవతులకున్ = యౌవనోన్మత్తలైన స్త్రీలకు, కుచజఘనభుజములన్ = పాలిండ్లు, పిఱుఁదులు, బుజములు—వీనిపై, గౌరచందన + ఆర్ద్రహారముల్ = గౌరవర్ణముగల చందనద్రవములోఁ దడసిన ముత్తెపు సరులును, మొలనూళులున్ = ఒడ్డాణములును, అమలమణిమయ = నిర్మలమైన మణి సమూహముతోఁగూడిన, వలయ + అంగదములున్ = గుండ్రని దండకడియములును, కొమరుమిగులున్ = ఎక్కుడు సొంపును గాంచియున్నవి.

తా. వసంతసమయమునఁ గామపీడితలైన యువతులు కుచములపైఁ జందనమలఁది ముత్యాలహారములను దాల్చి, మొలనూళుల బిగించి, భుజములపై రత్నఖచితములైన కడియముల ధరించి విటుల చిత్తములను హరించుచున్నారు.

సపత్రలేఖేషు విలాసినీనాం
వక్త్రేషు హేమాంబురుహోపమేషు।
[1]రత్నాంతరే మౌక్తిక [2]సంగరమ్యః
[3]స్వేదాగమో విస్తరతా ముపైతి॥ 7

పసిఁడితమ్మిపోని పత్త్రలేఖలనొప్పు
చెలులమొగములందుఁ జెమటబొట్లు
మణుల నడుమ నడరు మౌక్తికముల శోభఁ
గనుచు విస్తరత్వమొనసెఁ, జెలియ!

టీ. చెలియ = ఓ చెలీ! పసిఁడితమ్మిపోని = బంగారు తామరపూవునకంటె మించిన యందము గలిగి, పత్త్రలేఖలన్ + ఒప్పు = మకరికాపత్త్రరచనచే నలరారు, చెలుల = జవ్వనుల, మొగములందున్ = ముఖములపైన,

1 స్తనాంతరే. 2 సంగజాతః. 3 స్వేదోద్గమః.

మణులనడుమన్ + అడరుమా క్తికములశోభన్ = మణులమధ్యఁ బొదిగిన ముత్యములకాంతిని, కనుచున్ = పొందినవై, చెమటబొట్లు, వి స్తరత్వము + ఎనసెన్ = వి స్తరించియున్నవి.

తా. చెలీ! మకరికాపత్త్రరచనలచే నొప్పి, కనకపద్మములవలె విరాజిల్లు జవ్వనుల మోములపై, మణులమధ్యఁ బొదిగిన ము త్తియములవలెఁ జెమ్మటబొట్లు వి స్తరించియున్నవి. [నల్లని కస్తురిబొట్లు ఇంద్రనీలమణులకును దెల్లని చెమటబొట్లు ము త్తియములకును బోల్పఁబడినవి. చెమట పట్టుటకుఁ గారణము గ్రీష్మమునందువలె నెండకాదు; వసంత ప్రేరిత రతి సంజాతశ్రమము. రతిశ్రమమునఁ జెమ్మట పట్టుటయు జెమటబొట్లకు ము త్తెములతోఁ బోలిక సెప్పుటయుఁ బ్రసిద్ధములు.]

ఉచ్ఛ్వాసయ న్త్యః శ్లథబంధనాని
గాత్రాణికందర్ప సమాకులాని।
సమీపవర్తి[1]ష్వధునా ప్రియేషు
సముత్సుకా ఏవ భవన్తినార్యః॥ 8

ముడులన్ సడల్చి, చెలులి
ప్పు డనంగవ్యాకులాంగముల, నిట్టూర్పుల్
విడుచుచుఁ గాంతుల మ్రోలం
గడునుత్సుకతం బొరసిరి కంజదళాక్షీ!

టీ. కంజదళ + అక్షీ = తామరఱేకులవంటి కన్నులు గలదానా! ఇప్పుడు = ఈ వసంతమున, చెలులు = స్త్రీలు, ముడులన్‌సడల్చి = కోక అవికెల ముడులనువిప్పి, అనంగవ్యాకుల + అంగములన్ = అనంగసంగరమున (రతి) శ్రమనొందిన యవయవములు గలవారై, నిట్టూర్పులు విడుచుచున్ = నిట్టూర్పులను విడుచుచున్నప్పటికిని, కాంతులమ్రోలన్ = ప్రియుల

1 అపికార్యకేషు.

యొదుట, కడుఁన్ + ఉత్సుకతన్ + పొరసిరి=మిక్కిలి యుత్కంఠగలవారై యున్నారు.

తా. వసంతమున జవ్వనులు రతిశ్రమమున మేనెల్లఁ జెమ్మటలతో నిండ, గాలి తగులుటకై కోకముడిని అవికెముడిని సడలించుచు నాయాసమున నిట్టూర్పులు విడుచుచుండియుఁ బ్రియులం గాంచినంతనే తిరిగి రతికిం దార్కొనుచున్నవారు.

తనూని పాండూని [1]సమన్థరాణి
ముహుర్ముహుర్జృంభణతత్పరాణి।
అంగాన్యనంగః ప్రమదాజనస్య
కరోతి లావణ్య [2]ససంభ్రమాణి॥ 9

తనువుల, సదాలసములం,
బునఃపునర్జృంభణపరములఁ, బాండువులన్,
మనసిజుఁ డొనర్చుఁ బ్రమదా
తనువుల లావణ్యసంభృతమ్ములఁ, గాంతా!

టీ. కాంతా = ఓ చెలీ! మనసిజుఁడు = మన్మథుఁడు, ప్రమదా తనువులన్ = కామోన్మత్తలైన యువతుల దేహములను, తనువులన్ = సన్ననివిగను, సదాలసములన్ = మాంద్యము నొందినవిగను, పునఃపునః జృంభణపరములన్ = మాటిమాటికి నావులించు స్వభావముగలవిగను, పాండువులన్ = తెల్లనివిగను, లావణ్య సంభృతమ్ములన్=లావణ్యముతోఁ గూడినవిగను, ఒనర్చున్ = చేయుచున్నాఁడు.

తా. ఓ చెలీ! మధుమాస ప్రేరితలై నితాంతరతి క్రీడాసక్తలైన జవ్వనుల యంగములు మాంద్యమునొంది తెల్లఁబాఱి యున్నవి. వారు

1 మదాలసాని, 2 రసోత్సుకాని.

మాటిమాటికి నావులించుచున్నారు. అట్లగుటచే వారియందవినుమడించు చున్నది.

నేత్రేషు [1]లోలో [2]మదిరాలసేషు
గండేషు పాండుః [3]కఠినః స్తనేషు।
మధ్యేషు [4]నిమ్నో జఘనేషు పీనః
స్త్రీణామనంగో బహుధాస్థితోఽద్య॥ 10

పొలఁతిరో! మదిరాలసనేత్రములఁ జలుండు,
గండములఁ బాండురుఁడు, కఠినుండు చనుల,
నడుములందు నిమ్నుఁడు, జఘనములఁబీనుఁ
డలరు బహురీతిఁ జెలుల ననంగుఁడిపుడు.

టీ. పొలఁతిరో=ఓ చెలీ! ఇపుడు=ఈ వసంతమున, మదిర + ఆలస నేత్రములన్=మద్యపానముచే మత్తిల్లిన కనుల(చూపుల)వలన, చలుండున్ = చలించువాఁడును, గండములన్ = చెక్కిళ్లవలన, పాండురుండున్ = తెల్లనివాఁడును, చనులన్ =చనులవలన, కఠినుండున్=కఠినుఁడును, నడుములందున్ = నడుములవలన, నిమ్నుఁడున్ = లోఁతైన (సన్నని) వాఁడును, జఘనములన్=పిఱుఁదులవలన, పీనుఁడున్=బలిష్ఠుఁడును (ఐ), చెలులన్= జవ్వనులయందు, అనంగుఁడు = మన్మథుఁడు, బహురీతిన్ = అనేక విధములుగా, అలరున్ = ఒప్పుచున్నాఁడు.

తా. వసంతకాలమున మద్యపానాయత్తచిత్తలును, జంచలాక్షులును, బాండురగండలును, గఠినకుచమండలలును, దనుమధ్యపృథుజఘన విరాజితలునైన స్త్రీలనుజూడ మన్మథుఁడే వివిధభంగుల వారియందు మూర్తీభవించినవాఁడో యనిపించుచున్నది.

1 లోలం, అలోలః. 2 మదిరారసేషు. 3 కఠినస్తనేషు. 4 నమ్రః.

అంగాని నిద్రాలస [1]విభ్రమాణి
వాక్యాని కించి[2]న్మదలాలసాని।
భ్రూక్షేపజిహ్మాని చ వీక్షితాని
చకార కామః [3]ప్రమదాజనానామ్॥ 11

పలుకులు తనుమదలాలస
ములు, చూపులు కన్బొమవిఱుపుల వక్రములున్,
జెలుల మెయులు నిద్రాలస
విలాసములుగాఁగఁ బూవువిల్తుఁ డొనర్చున్.

టీ. పూవువిల్తుఁడు = మన్మథుఁడు, చెలుల = స్త్రీలయొక్క, పలుకులు = మాటలను, తనుమద + అలసములు = కొంచెఁదిగ మదించిన రీతిగను, చూపులు = వీక్షణములను, కన్బొమవిఱుపులన్ = బొమలు విఱుచుటచే, వక్రములున్ = కుటిలములుగను, మెయిలు = శరీరములను, నిద్ర + అలసవిలాసములు గాఁగన్ = నిదురమత్తు గొనుటచే విలాసవంత ములుగను, ఒనర్చున్ = చేయుచున్నాఁడు.

తా. వసంతసమయమున మద్యమును గ్రోలిన జవరాండ్రు మదించి నట్లు మాటలాడుచు, నర్మవీక్షణములను జూచుచు, నిద్రాలసవిలాసలై యున్నారు.

ప్రియంగుకాలీయక [4]కుంకుమాక్తం
[5]స్తనేషు గాత్రేషు విలాసినీభిః।

1 విహ్వలాని. 2 మదిరాలసాని, మదలాలసాని. 3 ప్రమదోత్త మానామ్.

4 కుంకుమాని. 5 స్తనాంగరాగేషు విసర్జితాని, స్తనాంగరాగేషు విచర్చితాని.

ఆలిప్యతే చందన మంగనాభి
ర్మదాలసాభి ర్మృగనాభియుక్తమ్॥ 12

ప్రమదాలసలగు భామలు
కమనీయవర ప్రియంగు కాలీయక కుం
కుమమృగమదయుతమగు గం
దము గౌరకుచములఁ బూసెదరు నేఁడు చెలీ!

టీ. చెలీ! నేఁడు = వసంతమున, ప్రమద + అలసలు + అగు భామినులు = కామాతిశయమున నలిసి యొడలెఱుంగని స్థితిలోనుండు విలాసినులు, కమనీయ = మనోజ్ఞమైనట్టిదియు, వర = శ్రేష్ఠమైనట్టిదియు, ప్రియంగు = ప్రేంకణముతోడను, కాలీయక = పసుపుతోడను, కుంకుమ= కుంకుమపువ్వుతోడను, మృగమద = కస్తురితోడను, యుతము + అగు = కూడినదైన, గంధముఁ = లేపమును, గౌరకుచములఁ = గౌరవర్ణములైన చన్నులపైన, పూసెదరు = పూసికొందురు.

తా. చెలీ! వసంతసమయమున స్త్రీలు చనులపైఁ ప్రేంకణపుఁ జివుళ్లతోను, గుంకుమపువ్వులతోను, కస్తురితోను కలిపి మర్దించిన గంధమును (విరహతాపోపశమనార్థము) బూసికొనుచున్నారు.

గురూణి వాసాంసి విహాయతూర్ణం
తనూని లాక్షారస రంజితాని।
[1]సుగంధి కాలాగురుధూపితాని
ధత్తే జనః [2]కామ మదాలసాంగః॥ 13

1 శిరాంసి. 2 కామశరానువిద్ధః.

కలికి! కామమదాలసాంగమగు జనము
గురువసనములఁ దొలఁచి చెచ్చెర ధరింత్రు
సురభికాగురుధూపసంశోభితముల
యావరసరంజితములఁ దన్వంశుకముల.

టీ. కలికి = ఓ చెలీ! కామమద + అలస + అంగము + అగు = కామోద్రేకమువలన నలిసిపోయిన యవయవములుగలవారైన, జనము = జనులు, గురువసనములన్ = దట్టమైన వలువలను, తొలఁచి = తీసివేసి, చెచ్చెరన్ = శీఘ్రముగా, సురభిళ + అగురుధూప సంశోభితములన్ = పరిమళవంతమైన యగురుధూపముచే శోభిల్లునవియు, యావరస రంజిత ములన్ = (ఎఱ్ఱని) లత్తుకరంగుచే నద్దఁబడినవియునైన, తను + అంశుక ములన్ = పల్చని వలువలను, ధరింత్రు = ధరించుచున్నారు.

తా. చెలీ! వసంతమున, రతిక్రీడాలసాంగులైన జనులు, చెమటకు నోర్వక దట్టపు వలువలను దీసివేసి, లత్తుకరంగుచే నద్దఁబడి యగురు పరిమళములతోఁగూడిన సన్నని వస్త్రములను ధరించుచున్నారు.

పుంస్కోకిల[1]శ్చూతరసాసవేన
మత్తః ప్రియాం చుంబతి రాగహృష్టః।
[2]కూజద్ద్విరేఫో[3]ఽప్యయమంబుజస్థః
[4]ప్రియం ప్రియాయాః ప్రకరోతి[5]చాటు॥ 14

అలికులవేణి! చూతమధు
రాసవమాని మదించి గండుఁగో
యిల యనురాగహృష్టత ని
దే ప్రియురాలిని ముద్దువెట్టు, మం

1 చూతరసేనమత్తః ప్రియాముఖంచుంబతిసాదరోఽయం. 2 గుంజన్. 3 అధికప్రమత్తః. 4 క్షిప్రం. 5 చాటుమ్.

జులజలజంబునఁ మనము
చొక్కఁగ గానమొనర్చు తేఁటియుఁ
విలసిత నర్మకృత్యములఁ
బ్రేయసికిం దమిఁగూర్చు నెంతయుఁ.

టీ. అలికులవేణి = తుమ్మెదబారువంటి జడగలదానా! కండుఁ గోయిల = మగకోయిల, చూతమధుర + ఆసవముఁ + అని = మావిపూఁ దేనియను గ్రోలి, మదించి = మదముతోఁ గూడినదై, అనురాగహృష్టతఁ = ప్రేమవలనఁ గలిగిన సంతోషముతో, ఇదే=చూడుము, ప్రియురాలిఁ = తన ప్రియురాలైన పెంటికోయిలను, ముద్దువెట్టుఁ = ముద్దిడుకొను చున్నది, జలజంబునఁ = తామరపూవునందు, మనము చొక్కఁగఁ = మనస్సు రంజిల్లఁగా, గానమొనర్చు = పాడుచున్న, తేఁటియుఁ=(మగ) తుమ్మెదయును, విలసితనర్మకృత్యములఁ = విలాసవంతములైన నర్మచేష్ట లతో, ప్రేయసికిఁ = తన ప్రియురాలికి, ఎంతయుఁ=మిక్కిలి, తమిఁ + కూర్చుఁ = సంతసమును గల్గించుచున్నది.

తా. చెలీ! వసంతమున నెలమావి పూఁదేనియను గ్రోలి మదించిన కండుఁగోయిల ప్రేమపారవశ్యమునఁ దన ప్రియురాలిని ముద్దిడుకొనుచున్నది. తామరపూవులోని తేనియను గ్రోలుచుఁ జెవికింపుగ ఝుంకారము సేయు చుండు మగతుమ్మెదయుఁ దన శృంగారచేష్టలచేఁ బ్రియురాలిని సంతోష పెట్టుచున్నది. (ప్రకృతియంతయుఁ బ్రేమపారవశ్యమున మునిఁగియున్న దని భావము.)

[1]తామ్రప్రవాళస్తబకావనమ్రా
శ్చూతద్రుమాః పుష్పితచారుశాఖాః।
కుర్వన్తి [2]కామం [3]పవనావధూతాః
[4]పర్యుత్సుకం మానసమంగనానామ్॥ 15

1 ప్రవాలనమ్రాస్తబకావతంసా. 2 కాంతే. 3 పవనాభిభూతాః 4 సముత్సుకం.

తొగరుఁజిగురాకుగుత్తుల మిగులప్రాలి
కుసుమితమ్ములై యలరారు కొమ్మల నమరి
చల్లగాడ్పుల కూఁగు రసాలతరులు
తరుణిచిత్తంబులకు మహోత్కంఠఁగూర్చు.

టీ. తొగరుఁజిగురాకు గుత్తులన్ = ఎఱ్ఱని చివురు జొంపముల బరువునకు, మిగులన్ + ప్రాలి = ఎక్కువగా వంగి, కుసుమితములు + ఐ + అలరారు = పుష్పించి విలసిల్లుచుండు, కొమలన్ = కొమ్మలతో, అలరి = ఒప్పి, చల్లగాడ్పులకున్ + ఊఁగు = చల్లనిగాలి వీచుటచేఁ గదలుచుండు, రసాలతరులు = తీయమామిడిచెట్లు, తరుణిచిత్తంబులకున్ = యువతుల మనస్సులకు, మహా + ఉత్కంఠన్=ఎక్కువ యుత్సాహమును, కూర్చున్ = కలిగించుచున్నవి.

తా. ఎఱ్ఱని చివుళ్ల బరువునకు వంగినవియుఁ బుష్పించిన కొమ్మలతో నొప్పునవియుఁ, జల్లగాలి తాఁకునకుఁ గదలుచుండునవియునైన తీయ మామిడిచెట్లు స్త్రీలకెంతయు నుత్సాహముం గూర్చుచున్నయవి.

ఆ మూలతో విద్రుమరాగతామ్రం
[1]సపల్లవాః పుష్పచయం దధానాః।
కుర్వంత్యశోకా హృదయం సశోకం
నిరీక్ష్యమాణా నవయౌవనానామ్॥ 16

పగడపుంగెంపుజిగి హత్తు ప్రసవతతులఁ
దాల్చి నిలువెల్లఁ, బల్లవోత్కరముతో న
శోకములు పొనరించు సశోకములుగ
మాటికిం జూడ నవయువమానసముల.

1 సపల్లవం.

టీ. అశోకములు = అశోకవృక్షములు, పగడపుంగెంపుజిగిన్ = పగడమువలె నెఱ్ఱని కాంతిని, హత్తు = కలిగియుండు, ప్రసవతతులన్ = పుష్పసమూహమును, నిలువెల్లన్ = మొదటినుండి కొనవఱకు, తాల్చి = కలిగియుండి, పల్లవ + ఉత్కరములతోన్ = చిగుళ్ల గుంపులతోఁ గూడినవై, మాటికిన్ + చూడన్ = పలుమాఱు చూడఁగా, నవయువమానసములన్ = నూతనయువకుల చిత్తములను, సశోకములుగన్ = శోకవ్యాకులములుగా, పొనరించున్ = ఒనరించుచున్నవి.

తా. ఆమూలాగ్రము ఎఱ్ఱని పూవులతోను జివుళ్లతోను నిండిన యశోకవృక్షములఁ గాంచినంతనే యువకులు కామపరవశులై కలఁత నొందుచున్నారు.

మత్తద్విరేఫపరిచుంబిత[1]చారుపుష్పా
మందానిలాకులిత [2]నమ్రమృదుప్రవాళాః।
కుర్వన్తి కామిమనసాం సహసోత్సుకత్వం
[3]చూతాభిరామకలికాః సమవేక్ష్యమాణాః॥ 17

మత్తరోలంబచుంబితమంజుసుమలు
మృదుపవనసంచలితనమ్రమృదులకిసలు
బాలమాధవీకలికలు పాఱఁజూడఁ
గాముకులమది బల్మి నుత్కంఠఁగొలుపు.

టీ. మత్తరోలంబ=మదించిన తుమ్మెదలచే, చుంబిత=స్పృశింపఁబడిన (తేనెఁగ్రోలఁబడిన), మంజుసుమలు = రమణీయములైన పుష్పములు గలవియు, మృదుపవన = మెల్లనిగాలికి, సంచలిత = కదలుచుండు, నమ్ర= వంగిన, మృదులకిసలు = మెత్తని చిగుళ్లుగలవియు (ఐనట్టి), బాలమాధవీ

1 చారుపుష్పాః. 2 చారు. 3 చూతావిముక్తకలికాః, బాలాతిముక్తలతికాః.

కలికలు = లేఁతబండి గుఱివెంద మొగ్గలు, పాఱన్ + చూడన్ = బాగుగాఁ జూడఁగా, కాముకులమదిన్ = కామార్తులైనవారి చిత్తములను, బల్మిన్ = బలాత్కారముగ, ఉత్కంఠన్ + కొలుపున్ = ఉద్రేకవంతములుగాఁ జేయుచున్నవి.

తా. మకరందపానమున మదించి ఝంకారము సేయు తుమ్మెదలతోను, బరువునకు వంగి గాలికి మెల్లఁగాఁ గదలుచుండెడు చివుళ్లతోను గూడిన బాలమాధవీలతలు కాముకులచిత్తములకు మహోత్కంఠను గూర్చుచున్నవి.

[1]కాంతాముఖద్యుతిజుషామపి చోద్గతానాం
శోభాం పరాం కురవకద్రుమమంజరీణాం।
దృష్ట్వా ప్రియే [2]సహృదయస్య భవేన్నకస్య
కందర్పబాణ[3]పతనవ్యథితం హి చేతః॥ 18

కాంతముఖకాంతిఁదగి నవోద్గతములైన
కురవకతరుగుచ్ఛంబుల పరమశోభఁ
బ్రియరో! వీక్షింపఁగా నే సహృదయుమనము
దర్పకశరపతనపీడితంబుగాదు?

టీ. ప్రియరో = ఓ ప్రియురాలా! కాంతముఖకాంతిన్ + తగి = ప్రియురాలిమోము చెలువునుబోలి, నవ + ఉత్ + గతములు + ఐన = క్రొత్తగాఁ బుట్టిన, కురవకతరుగుచ్ఛంబుల = గోరంటచివురుజొంపముల, పరమశోభన్ = అధికమైనకాంతిని, వీక్షింపఁగాన్ = చూడఁగా, ఏ సహృదయు మనము = సహృదయుఁడైన యెవ్వని మనము, దర్పకశరపతన = మన్మథుని బాణములు పడుటవలన, పీడితంబుగాదు = పీడింపఁబడినదిగాదు.

1 కాంతాముఖద్యుతిమనోహర ముద్గతానాం, కాంతాననద్యుతిముషామచిరోద్గతానాం, నానాముఖద్యుతిజుషామపిచోద్గతానాం. 2 హిపథి కస్య. 3 నికరైర్వ్యథితం, పతనవ్యథనం.

తా. చెలీ! కెందలిరుజొంపములతో నిండి, విలాసినుల మోము చెలువును దలఁపించు నీ యెఱ్ఱగోరంట, సహృదయుఁడైన ఎవ్వని మనమును మన్మథశరపీడితంబుగాఁ జేయదు? ఎట్టివానినైనను గామార్తునిఁ జేయును గదా!

ఆదీప్తవహ్నిసదృశై ర్మరుతా వధూతైః
సర్వత్ర కింశుకవనైః కుసుమావనమ్రైః।
సద్యోవసంతసమయే[1]న సమాగతేయం
రక్తాంశుకా నవవధూరివ భాతి భూమిః॥ 19

కనదనలతుల్యములు మరుత్కంపితములు
ప్రసవనమ్రములు పలాశవనము లిప్పు
డెల్లకడలఁబర్వంగ రాజిల్లు ధరణి
ప్రచురరక్తాంశుక వినూత్నవధువుపోలె.

టీ. ఇపుడు=ఈ వసంతసమయమున, కనత్ + అనలతుల్యములు= మండెడు నిప్పువలె నెఱ్ఱని కాంతిగలవియు, మరుత్ + కంపితములు = గాలి వీచుటవలనఁ గదలుచుండునవియు, ప్రసవనమ్రములు=పూవుగుత్తుల, బరువునకు వంగినవియు (ఐన), పలాశవనములు = మోదుగుచెట్లగుంపులు, ఎల్లకడలన్ + పర్వంగన్ = ఎల్లెడల వ్యాపింపఁగా, ధరణి = భూమి, ప్రచురరక్త + అంశుక = దట్టమైన ఎఱ్ఱని వలువను ధరించిన, వధువున్ + పోలె = స్త్రీవలె, రాజిల్లున్ = శోభావంతమై యున్నది.

తా. జ్వలించు నిప్పువలె నెఱ్ఱని కాంతితోఁగూడి గాలికి చలించు చుండు పుష్పములతో నిండిన మోదుగుచెట్ల గుంపులతో విలసిల్లు భూమి, యెఱ్ఱనిచీర గట్టుకొనియుండు లేఁబ్రాయంపుఁ జెలియవలె నున్నది.

1 హి. సమాచితేయం, సముపాగతేహ.

కిం కింశుకైః శుకముఖచ్ఛవిభిర్న[1]భిన్నం
కిం కర్ణికారకుసుమైర్న[2]కృతం ను దగ్ధం।
[3]యత్కోకిలః [4]పునరయం మధురైర్వచోభి
ర్యూనాం మనః[5]సువదనానిహితం నిహన్తి॥ 20

చెలువలసోయగంబునకుఁ
జిక్కిన ప్రాయపువాని చిత్తముం
జిలుక మొగంబుడంబునను
జెన్నలరారెడి కింశుకంబు ల
గ్గలముగఁ జీల్పవో? మిగులఁ
గాల్పవొ కోమల కర్ణికారముల్?
కలరుతులన్ వనప్రియము
కాఁతియ వెట్టఁగనేల వెండియున్?

టీ. చెలువలసోయగంబునకున్=జవ్వనుల యందమునందు, చిక్కిన=తగుల్కొనిన, ప్రాయపువానిచిత్తమున్ = యువకుని మనస్సును, చిలుక మొగంబుడంబునను = చిలుకముక్కువలె సెట్టనై, చెన్ను + అలరారెడి = ఒప్పిదమై యున్న, కింశుకంబులు = మోదుగుపూలు, అగ్గలమునన్ + చీల్పవో = ఎక్కువగాఁ జీల్చుటలేదా యేమి? కోమలకర్ణికారముల్ = నునుఁగొండగోఁగుపూలు, మిగులన్=ఎక్కువగా, కాల్పవో=దహించుట లేదా యేమి? వెండియున్=మఱల, వనప్రియము=కోయిల, కలరుతులన్ = మనోజ్ఞకూజితములతో, కాఁతియవెట్టఁగన్ + ఏల = బాధించుట యెందులకో?

తా. వసంతసమయమున జవరాండ్ర సొబగు మదికి హత్తుకొన్న యువకుల చిత్తములను జిలుకముక్కువలె సెట్టగాఁ బూచియున్న మోదు

1 దగ్ధం. 2 కృతంమనోజ్ఞం, హతంమనోజ్ఞైః. 3 కోకిలాః.
4 పురుర్హైః, పునరమీ. 5 సువదనే నియతం హరన్తి.

గులు చీల్చిచెండాడుచున్నవి. ఇవి చాలవోయన్నట్లు కోకిలకూజితములు వారి నింకను ఏడ్పించుచున్నవి. పుష్పోద్గమము కోకిలాలాపము విరహోద్దీపకములు.

పుంస్కోకిలైః [1]కలవచోభిరుపాత్తహర్షైః
కూజద్భిరున్మదకలాని [2]వచాంసి భృంగైః।
లజ్జాన్వితం సవినయం హృదయం క్షణేన
పర్యాకులం కులగృహేఽపి కృతం వధూనాం॥ 21

ముదితకలనినాదముల గండుఁగోయిలల్,
సమదకలరవముల షట్పదములు,
సవినయత్రపలగు జనులమానసములఁ
గులగృహంబులంద కలఁచుచుండెని.

టీ. ముదిత=సంతసమునుగలిగించు, కలనినాదములన్=మనోజ్ఞములైన, ధ్వనులచే, గండుఁగోయిలల్ = పుంస్కోకిలములును, సమద = మదించుటచేఁ గలుగు, కలరవములన్=రమణీయ ధ్వనులచే, షట్పదములును = తుమ్మెదలును, త్రుటిన్ = క్షణములో, సవినయత్రపలు + అగు=లజ్జావినయభరితలగు, జనులమానసములన్ = కోడండ్రచిత్తములను, కులగృహంబులంద = అత్తింటియందు నున్నప్పుడే, కలఁచున్ = కలఁతపెట్టుచున్నవి.

తా. వసంతసమయావిర్భూతములైన పుంస్కోకిలకాకలీరుతములును, మదమధుపఝుంకారములును, లజ్జావినయభరితులైన గృహస్థుల చిత్తములనే కలవరపెట్టుచున్నవన నిఁక స్వైరవిహారులసంగతిఁ జెప్ప నేల?

1 ఫలరసైః సముపాత్తహర్షైః. 2 విలోచనాని, వచాంసిధీరం.

ఆకంపయన్కుసుమితాః సహకార[1]శాఖా
విస్తారయన్పరభృతస్య వచాంసి దిక్షు।
వాయుర్వివాతి హృదయాని హర[2]న్నరాణాం
నీహారపాతవిగమా [3]విమలో వసంతే॥ 22

అలికులవేణి! పుష్పితము
లై యలరారు రసాలశాఖలం
బలమఱు నూఁచుచున్ బికర
వంబుల దిక్కులవిస్తరించు చ
త్యలఘుతుషారవారపత
నావరతిన్ సుభగత్వమొందు గా
డ్పులు జనమానసంబులను
మ్రుచ్చిలుచుం జరియించు నెల్లెడన్.

టీ. అలికులవేణి=(తుమ్మెదబారువంటి జడగల) ఓ చెలీ! పుష్పితములు + ఐ + అలరారు=పూలుపూచినవై యొప్పుచుండు, రసాలశాఖలన్= తీయమామిడి కొమ్మలను, పలుమఱున్ = మాటిమాటికి, ఊఁచుచున్ = కదలించుచును, పికరవంబులన్ = కోయిల కూఁతలను, దిక్కులన్ + విస్తరించుచున్ = నలుదెసల వ్యాపింపఁజేయుచును, అతి + అలఘు = మిక్కిలి యెక్కువైన, తుషారవారపతన + అవరతిన్=మంచుగురియుట లేకపోవుటచే, సుభగత్వమున్ + ఒందు = సౌఖ్యదాయకములై యుండు, గాడ్పులు = గాలులు, జనమానసంబులన్ = జనుల చిత్తములను, మ్రుచ్చిలుచున్ = హరించుచు, ఎల్లెడన్=అంతటను, చరియించున్=వ్యాపించియున్నవి.

తా. చెలీ! మంచు గురియకుండుటచే సుఖస్పర్శనములైన చల్లని గాడ్పులు, పూచిన తీయ మామిడికొమ్మలను గదలించుచుఁ, గోయిలకూఁతల నలుదెసల వ్యాపింపఁజేయుచు జనుల చిత్తములను హరించుచున్నవి.

1 శాఖాః. 2 వధూనాం. 3 సుభగః.

కుందైః సవిభ్రమవధూహసితావదాతై
రుద్యోతితాన్యుపవనాని మనోహరాణి।
చిత్తం మునేరపి హరన్తినివృత్తరాగం
[1]ప్రాగేవరాగమిళితాని మనాంసి [2]యూనామ్॥ 23

చెలియ! మిటారపుం బడఁతి
చిర్నగవుంబలె వెల్లనైన మొ
ల్లల వెలుఁగొందుతోఁటలు బ
ళా! హరియించు మునీంద్రమానసం
బులన నివృత్తరాగముల;
మున్మును రాగమలీమసంబులై
యలరెడునూత్న యౌవనుల
స్వాంతము లాఁచుటఁ జెప్ప నేటికిన్ ?

టీ. చెలియ = ఓ చెలీ! మిటారపుంబడఁతి = విలాసముగల జవ్వని యొక్క, చిర్నగవుంబలెన్ = మందహాసమువలె, వెల్లనైన = తెల్లగానుండు, మొల్లలన్ = మొల్లపూవులచే, వెలుఁగొందు = శోభిల్లుచున్న, తోఁటలు = ఉద్యానవనములు, బళా = ఎంతటివింత! నివృత్తరాగములన్ = ఇంద్రియ వాంఛలులేని, మునీంద్రమానసంబులన్ = మునిశ్రేష్ఠుల చిత్తములను, హరియించున్ + అనన్ = కలవరపెట్టుచున్నవో యనఁగా, రాగమలీమసంబులు + ఐ = విషయలోలతఁగలిగి, అలరెడు = ఒప్పుచున్న, నూత్న యౌవనుల స్వాంతములన్ = లేఁబ్రాయపు యువకుల చిత్తములను, ఆఁచుట = కలఁతపెట్టునని, చెప్పన్ + ఏటికిన్ = వేఱుగాఁ జెప్పనేల?

1 ప్రాయేణరాగ చలితాని, ప్రాగేవ రాగమఖిలాని, ప్రాగేవరాగ మలినాని. 2 పుంసాం.

తా. విలాసినుల చిఱునవ్వువలెఁ దెల్లనైన మొల్లపూలతో నుల్లసిల్లు తోఁటలఁ గనినంతనే జితేంద్రియులైన మునీశ్వరులే విషయాసక్తులగుచున్నారన నిఁక రాగలోలురైన యువకుల సంగతి వేఱుగఁ జెప్పవలయునా?

[1]ఆలంబిహేమరశనాః స్తనసక్తహారాః।
కందర్పదర్పశిథిలీకృతగాత్రయష్ట్యః।
మాసే మధౌ మధురకోకిల భృంగ[2]నాదైః
[3]నార్యో హరన్తి హృదయం ప్రసభం నరాణాం॥ 24

స్తనసీమఁ‌ మణిహారముల్ పెనఁగొనఁ‌,
జామీకరస్ఫారహా
రి నవీనద్యుతులఁ‌ వెలార్చు మొలనూల్
ప్రేలాడఁ గందర్పద
ర్పనిమిత్తక్షుభితాంగయష్టులగు చె
ల్వల్ బల్మిమైఁ గొందు రా
మనిలోఁ బూరుషచిత్తముల్ పికములుఁ
మత్తాళులుం బాడఁగఁ‌.

టీ. స్తనసీమఁ‌ = కుచములపైని, మణిహారముల్ పెనఁగొనఁ‌ = మణిహారములు చిక్కుపడి ప్రేలాడఁగాను, చామీకర = బంగారుయొక్క, స్ఫార = కాంతిని, హారి = తిరస్కరించునట్టి, నవీనద్యుతులఁ‌ = క్రొత్తజిగిని, వెలార్చు = వ్యాపింపఁజేయు, మొలనూల్ = మొలనూలు, ప్రేలాడఁ‌ = (పిఱుఁదులపై) ప్రేలాడఁగను, కందర్ప = మన్మథునియొక్క, దర్పనిమిత్త = గర్వలేశముచేతనే, క్షుభిత = బాధపెట్టఁబడిన, అంగయష్టులు = కఱ్ఱవలె సన్నని శరీరముగలవారును, అగు = ఐనట్టి, చెల్వల్ = విలాసినులు, ఆమని

1 ప్రాలంబి. 2 రావైః. 3 రామాః.

లోన్ =వసంతకాలములో, పికములున్ =కోయిలలును, మత్త+అళులున్ = మదించిన తుమ్మెదలును, పాడఁగన్ = గానముసేయుచుండఁగా, పూరుష చిత్తముల్ = మగవారి మనస్సులను, బల్మిమైన్ = బలాత్కారముగ, కొందురు = ఆకర్షించుచున్నారు.

తా. మదమధుపఝుంకారములతోను కలకంఠకలకలార్భటుల తోను నిండిన వసంతసమయమున, బిగిగుబ్బలపైఁ జిందులాడు ముత్తియంపు సరులతోను బిఱుఁదులపై వ్రేలాడు బంగరు మొలనూళ్లతోను నొప్పుచుండు జవ్వనులు మగవారి మనస్సులను బలాత్కారముగఁ దమవైపునకు లాగుకొను చున్నారు.

నానామనోజ్ఞకుసుమద్రుమ [1]భూషితాంతాన్
హృష్టాన్యపుష్టనినదాకుల [2]సానుదేశాన్।
శైలేయజాల పరిణద్ధశిలా[3]తలౌఘాన్
దృష్ట్వా జనః క్షితిభృతో [4]ముదమేతి సర్వః॥ 25

వివిధమనోజ్ఞ సూనవిట
పివ్రజముల్ కెడలన్ రహింప, హ
ర్ష వివశ కోకిలధ్వనులఁ
బ్రస్థములొప్ప, శిలాజతుచ్ఛటల్
దవిలిన ఱాలతోడ వసు
ధాధరముల్ జనకోటికెల్ల ను
త్సవమొనరించుచున్నయవి
తన్విరో! యిమ్మధుమాసవేళలన్.

1 భూషితాగ్రాన్, భూషితాంగాన్. 2 సంధిదేశాన్. 3 లతాంతాన్, గుహాస్థాన్. 4 సముపైతి సర్వాన్.

టీ. తన్వీరో = ఓ చెలీ! ఈ మధుమాసవేళలన్ = ఈ వసంత సమయమున, కడలన్ = పార్శ్వములందు, వివిధమనోజ్ఞసూన = నానా విధములైన రమణీయపుష్పములతోఁగూడిన, విటపివ్రజముల్ = అడవులు, రహింపన్ = ఇంపునింపఁగను, ప్రస్థములు = సానువులు, హర్షవివశ = సంతోషపరవశములైన, కోకిలధ్వనులన్ = కోకిల కూఁతలచే, ఒప్పన్ = ఒప్పిదమైయుండఁగను, శిలాజతుచ్ఛటల్ = గైరికాదిధాతుకాంతులు, తవిలిన = వ్యాపించిన, ఱాలతోడన్ = శిలలతో, వసుధాధరముల్ = కొండలు, జనకోటికెల్లన్ = జనులకెల్లను, ఉత్సవమున్ = ఒనరించుచున్ + ఉన్నయవి = (కన్నుల) పండువుగా నొప్పుచున్నవి.

తా. చెలీ! ఈ వసంతసమయమున, నలుదెసల నానావిధపుష్ప భరితములైన యడవులచేఁ జుట్టఁబడి, సానువులందుఁ జేరి కూయు కోకిలములతో నొప్పి, ధాతురాగరంజితములైన కొండలు, జనులకు నేత్రపర్వము గావించుచున్నవి.

నేత్రే [1]నిమీలయతి రోదితి [2]యాతిశోకం
[3]ఘ్రాణం కరేణ విరుణద్ధి విరౌతి చోచ్చైః।
కాంతావియోగ పరిఖేదిత చిత్తవృత్తిః
దృష్ట్వా[4]ధ్వగః కుసుమితాన్ సహకారవృక్షాన్॥ 26

విరియంబూచిన చూతవృక్షతతులన్
వీక్షించి, కాంతామణీ!
విరహోగ్రానలతప్తచిత్తుఁడయి యు
ద్వేగంబునన్ గన్నుఁదా

1 నిమీలతి, విరోదితి. 2 యాతిమోహం, జాతమోహాన్. 3 ప్రాణాన్. 4 నరః.

మరలఁ మోడుచు, నేడ్చు, శోకభరని
ర్మగ్నుండగుచుఁ, ఘ్రాణముఁ
బారి హస్తంబున మూయు, బిట్టడలుఁ బాం
థుం డిప్పు డుచ్చైస్స్థితిఁ.

టీ. కాంతామణీ = ఓ చెలీ! ఇప్పుడు = ఈ వసంతసమయమున, పాంథుఁడు = ప్రియురాలి నెడఁబాసినవాఁడు, విరియంబూచిన = ఎక్కుడగాఁ బూచిన, చూతవృక్షలతలఁ = మామిడిచెట్లగుంపును, వీక్షించి = చూచి, విరహ + ఉగ్ర + అనలత ప్తచిత్తుఁడు + అయి = ప్రియురాలి నెడఁ బాయుటయనెడి నిప్పుతోఁ గాల్పఁబడిన మానసము గలవాఁడై, ఉత్ + వేగంబునఁ = శీఘ్రముగా, కన్నుఁదామరలఁ మోడుచుఁ = తామరలవంటి కన్నులు మూసికొనును, ఉచ్చైఃస్థితిఁ = బిగ్గరగా, ఏడ్చుఁ = రోదనము చేయును, శోకభరనిర్మగ్నుండు + అగుచుఁ = దుఃఖములో మునిఁగినవాఁడగును, పారిఁ = మాటికి, ఘ్రాణముఁ = ముక్కును, హస్తంబునఁ = చేతితో, మూయుఁ = మూసికొనును, బిట్టు + అడలుఁ = మిక్కిలి వెఱఁగుపడును.

తా. వసంతమునఁ బూచిన మామిడిచెట్టును గనినంతనే పాంథుఁడు విరహతాపమున కోర్వలేక యా మామిడిచెట్టువంకఁ జూడలేక కండ్లు మూసికొనుచున్నాఁడు. దాని పరిమళమును సహింపలేక ముక్కు మూసికొనుచున్నాఁడు. ప్రియురాలిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని మాటిమాటికి బిగ్గరగా నేడ్చుచున్నాఁడు.

సమదమధుభరాణాం కోకిలానాం చ నాదైః।
కుసుమితసహకారైః కర్ణికారైశ్చ రమ్యైః।
ఇషుభిరివ సుతీక్ష్ణైర్మానసం మానినీనాం।
తుదతి [1]కుసుమమాసో మన్మథోద్వేజనాయ॥ 27

1 కుసుమబాణో మన్మథోద్దీపనాయ.

సమదమధుకరపరభృతస్వానములను,
గుసుమితరసాలములఁ, గొండగోఁగుతరులఁ,
దీక్ష్ణశరములంబలె స్మరోద్దీప్తిఁ గొలిపి
మధువు పీడించు మానినీమానసముల.

టీ. సమద = మదించిన, మధుకర = తుమ్మెదలయొక్కయు, పరభృత = కోకిలలయొక్కయు, స్వానములను=శబ్దములచేతను, కుసుమిత= పుష్పించిన, రసాలములన్ = తీయ మామిడిచెట్లచేతను, కొండగోఁగు తరులన్ = కొండగోఁగు చెట్లచేతను (గూడిన), మధువు = వసంతకాలము, స్మర + ఉత్ + దీప్తిన్ + కొలిపి = కామోద్రేకమును గలిగించి, తీక్ష్ణ శరములన్ + పలెన్ = కఱకుటమ్ములవలె, మానినీ మానసములన్ = స్త్రీల చిత్తములను, పీడించున్ = గాసివెట్టుచున్నది.

తా. మదమధుపఝుంకారములతోను, ఋష్పితకర్ణికారములతోను గూడి స్మరమదోద్దీపకమైన యిమ్మధుమాసము, మన్మథబాణమువలెఁ గామినీ చిత్తములను గాఱియ పెట్టుచున్నది.

ఆమ్రీమంజులమంజరీవరశరః సత్కింశుకం యద్ధను
[1]ర్జ్యాయస్యాకులితం కళంకరహితం ఛత్రంసితాంశుఃసితం।
మత్తేభో మలయానిలః పరభృతోయద్వందినో లోకజి
త్సోఽయం వో వితరీతరీతు వితనుర్భద్రం వసన్తాన్వితః॥28

పరభృతవ్రాతంబు వందిబృందంబుగా,
వేడ్క వసంతుండు వెంటరాఁగఁ,
గమ్మతేనియలాను గండుతేఁటులబారు
రమణీయమగు నల్లెత్రాడుగాఁగఁ,

1 జ్యాయస్యాళికులం.

గెంపుసొంపెసలారు కింశుక ప్రసవంబు
డంబుమీఱు శరాసనంబుగాఁగ,
మంజులంబగు నామ్రమంజరి దుర్భేద్య
కాఠిన్య పటుసాయకంబుగాఁగ,

నిందుఁ డకలంకుఁ డలవెల్లయెల్లిగాఁగ,
మలయపవనమ్ మత్తసామజము నెక్కి,
లీలఁ బదునాల్గు భువనముల్ గెలుచునట్టి
యతనుఁ డిడుఁగాత సకలసౌఖ్యములు మీకు.

టీ. పరభృతవ్రాతంబు=కోయిలలసమూహము, వందిబృందముగాన్ = స్తుతిపాఠకులుగను, వేడ్కన్ = సంతసమున, వసంతుఁడు, వెంట రాఁగన్ = వెంబడినే వచ్చుచుండఁగను,

కమ్మతేనియలు + అను = కమ్మనిపూవుఁదేనియం గ్రోలు, గండు తేఁటులబారు = మగతుమ్మెదలచాలు, రమణీయమగు = మనోజ్ఞమైన, అల్లె త్రాడుగాఁగన్ = అల్లెత్రాఁడుగను,

కెంపుసొంపు + ఎసలు + ఆరు = ఎఱ్ఱని కాంతియొక్క చెల్వము గలిగిన, కింశుకప్రసవంబు = మోదుగుపువ్వు, డంబుమీఱు = అత్యధిక కాంతితో విరాజిల్లు, శరాసనంబుగాఁగన్ = విల్లుగను,

మంజులంబు + అగు = మనోహరమైన, ఆమ్రమంజరి=మామిడిచిగుళ్ల గుత్తి, దుర్భేద్య = భేదింపరాని, కాఠిన్య = కఠినతగల, పటు = గొప్ప, సాయకంబుగాఁగ = బాణముగను,

అల = ఆ, అకలంకుఁడు=నిష్కళంకుఁడైన, ఇందుఁడు=చంద్రుఁడు, వెల్లయెల్లిగాఁగన్ = తెల్లని గొడుగుగను, మలయపవనము + అన్ = మలయానిలమనెడు, మత్తసామజమున్ + ఎక్కి = మదపుటేనుఁగు నెక్కి, లీలన్ = విలాసవంతముగ, పదునాల్గు భువనముల్ = చతుర్దశభువనములను, గెలుచునట్టి = స్వాధీనము చేసికొనునట్టి, అతనుఁడు = మన్మథుఁడు, మీకు

= పాఠకులైన మీకు, సకల సౌఖ్యములు = బహుసుఖములను, ఇడుఁ+ కాత = కలిగించునుగాత.

తా. మలయానిలమను మదపుటేనుఁగుపైఁ జందమామ యనెడి తెల్లగొడుగుక్రిందఁ గూర్చుండి, గండుఁగోయిలలు వందిమాగధులవలె స్తోత్ర పాఠంబులు పచరించుచుండఁ, జెలికాఁడైన వసంతుఁడు వెంటరాఁగ, రక్త కింశుక ప్రసూనధనుస్సక్తమదమధుకరమాలాశింజినీనిర్ముక్తరసాలకిసాల నిశిత సాయకక్షుభితసకలయువమానసుండై చతుర్దశభువనంబుల నేలు మన్మథుఁడు మీకు సకలసుఖంబు లొసంగుఁగాత!



# వసంతము

రుచిరకనకకాన్తిన్ముంచితః పుష్పరాశీన్
మృదుపవనవిధూతా న్పుష్పితాంశ్చూతవృక్షాన్।
అభిముఖమభివీక్ష్య క్షామదేహోఽపిమార్గే
మదనశరనిదాఘైః మోహమేతి ప్రవాసీ॥ 1

పరభృతకలగీతైః హ్లాదిభిః సద్వచాంసి
స్మితదశనమయూఖా న్కుందపుష్పప్రభాభిః।
కరకిసలయకాన్తిం పల్లవైర్విద్రుమాభై
రుపహసతి వసన్తః కామినీనా మిదానీమ్॥ 2

కనకకమలకాంతై రాననైః పాండుగండై
రుపరినిహితహారైః చందనార్ద్రైః స్తనాంతైః।
మదజనితవిలాసైః దృష్టిపాతైర్మునీంద్రాన్
స్తనభరనతనార్యః కాపయన్తి ప్రశాంతాన్॥ 3

మధుసురభిముఖాబ్జం లోచనే లోధ్రతామ్రే
నవకురవకపూర్ణః కేశపాశో మనోజ్ఞః।
గురుతరకుచయుగ్మం శ్రోణిబింబం తథైవ
న భవతి కి మిదానీం యోషితాం మన్మథాయ॥ 4

ఆకంపితాని హృదయాని మనస్వినీనాం
వాతైః ప్రఫుల్ల సహకారకృతాధివాసైః।
సంబాధితం పరభృతస్యమదాకులస్య
శ్రోత్రప్రియై ర్మధుకరస్య చగీతనాదైః॥ 5

రమ్యః ప్రదోషసమయః స్ఫుటచంద్రభాసః
పుంస్కోకిలస్య విరుతం పవనః సుగంధిః।
మత్తాళియూథ విరుతం నిశి శీధుపానం
సర్వం రసాయనమిదం కుసుమాయుధస్య॥ 6

ఛాయాం జనః సమభివాంఛతి పాదపానాం
నక్తం తథేచ్ఛతి పునః కిరణం సుధాంశోః।
హర్మ్యం ప్రయాతి శయితుం సుఖశీతలం చ
కాంతాం చ గాఢముపగూహతి శీతలత్వాత్॥ 7

మలయపవనవిద్ధః కోకిలేనాభిరమ్యః
సురభిమధునిషేకాలుబ్ధగంధప్రబంధః।
వివిధమధుమయూఖై ర్వేష్ట్యమానః సమన్తా
ద్భవతు తవ వసన్తః శ్రేష్ఠకాలః సుఖాయ॥ 8



# శ్రీ నారాయణరావుగారి యితరకృతులు

## 1. మేఘసందేశము (గద్యానువాదము) :

మున్నెన్నఁడు నెవ్వరుఁ ద్రొక్కి యెఱుంగని క్రొంగ్రొత్త పోకడ! మధురమందాక్రాంతావృత్తమునఁ బ్రవహించిన కాళిదాసుని వాఙ్మరంద ధారను ఛందోలక్షణ భూయిష్ఠమైన తెనుంగుఁబద్యముల నిరికింప యత్నించుట దుర్ఘటము. అనర్గళమైన ధార, మృదుమధురమైన శైలిగలిగి యీ గద్యానువాదము రసికజనహృదయరంజకమై, “సరసకవు”ల మెప్పుఁ గాంచి “తెలుఁగువాణికి సువర్ణమండన”మై యున్నది. ఉభయభాషాప్రవీణ శ్రీ కేసరి సుందరరామశర్మగారి విపులవ్యాఖ్యతో ముద్రితము. సంస్కృత భాషాజ్ఞానములేమిఁ గాళిదాసుని వాక్సుధఁ గ్రోలనేరక నిస్పృహఁజెందిన రసికులు, హృద్యగద్య రచనావిధానము నలవఱచుకొనఁగోరు విద్యార్థులు అవశ్యము పఠింపఁదగినది.

వెల రు. 1—8—0

## 2. వేంకటేశస్తోత్రము (ఆంధ్రీకరణము) :

“వేంకటేశ స్తోత్రము” “వేంకటేశ ప్రపత్తి” “వేంకటేశ మంగళాశాసనము” అను మూఁడుభాగములు గలది. విపుల టీకాసహిత ముగ ముద్రితము. అస్థానవిజృంభణములేక లలితపదబంధురమైన సరళ శైలిలో భక్తులెల్లరు గ్రుడ్డిపాఠము గావింపఁదగిన దైవస్తోత్రము.

వెల రు. 0—6—0

## 3. వేంకటేశ సుప్రభాతము (ఆంధ్రీకరణము) :

కలియుగమునఁ బ్రత్యక్షదైవమగు శ్రీ వేంకటేశ్వరుని దివ్యస్తోత్రము. భగవంతునియెడ నమ్మికగల్గిన ప్రతి మానవుఁడును బ్రభాతమునఁ బఠింపఁదగిన దైవస్తుతి. ప్రసన్నమధురమైన శైలిలో “అల్పాక్షరముల ననల్పార్థరచన” గావింపఁబడినది.

వెల రు. 0—6—0

**4. కుమతి శతకము :**

అందందుఁ గలుగు పలుకుల
నందముతోం దేటతెల్లమగు చందముగా
నందంబగు కందంబులఁ
బొందుపఱుపఁగాఁ దెలుంగు పొత్తము కుమతీ!

ప్రతిపదటీకాతాత్పర్యసహితముగా ముద్రితము. పాఠశాలలో బాలురచేఁ గంఠస్థము చేయింపఁదగిన నీతిపద్యములు గలది. కందపద్యము లోని బిగిబిగువు లెట్లుండవలెనో యెఱుంగవలసిన కవితావిద్యార్థులు పలుమాఱు పఠింపవలసిన యాధునిక కృతి.

వెల రు. 0—6—0

**5. కథావళి :**

"గద్యమ్ కవీనామ్ నికషం వదన్తి" ఆంధ్రవాఙ్మయమున లక్షణ రక్షితమైన శైలిలో వ్రాసిన గద్యకావ్యములు అత్యల్పసంఖ్యాకములు. ఈ కథావళి సరసమైన నిరుపమశైలిలోఁ గూర్పఁబడిన వచనరచన. బాలుర హృదయములలో భక్తిభావము నేగాక, నీతిమార్గమును, దేశాభిమానమును రేకెత్తించు వివిధకథలతో నలరారుచున్నది. పాఠశాలలలోఁ బాఠ్య గ్రంథముగా నియమింపఁదగినది.

వెల రు. 1—0—0

**6. బాలసుమతిశతకము :**

(టీకాతాత్పర్యాంగ్ల పదవివరణ సహితము)

ప్రాచీన సుమతిశతకములోని అశ్లీలస్ఫోరకములైన పద్యములఁ దొలఁగించి, తక్కినవానినిఁ బ్రతిపదటీకాతాత్పర్యాంగ్లపదవివరణసహిత ముగఁగూర్చి ముద్రించినది.

వెల రు. 0—4—0

(పోస్టేజి ప్రత్యేకము)

వలయువారు :

జయలక్ష్మి అండ్ కంపెనీ

ట్రంకురోడ్డు, నెల్లూరు, నెల్లూరు జిల్లా.